


విజయ
ఆశ్వయుజము

# భారతి

సంపుటము 30
సంచిక 10


# ఆంధ్రరాష్ట్రావతరణము



శ్రీ వాణీ గిరిజా శ్చిరాయదధతో వక్షో ముఖాంగేషుయే
లోకానాం స్థితి మావహం త్యవిరతాం స్త్రీపుంసయోగోద్భవామ్
తే వేదత్రయ మూర్తయః త్రిపురుషాః సంపూజితా వస్సురైః
భూయాసుః పురుషోత్తమాంబుజ భవ శ్రీకంధరాః శ్రేయసే

శ్రీయన గౌరినా బరగు చెల్వకు జిత్తము పల్లవింప, భ
ద్రాయితమూర్తియై హరిహరంబగు రూపముదాల్చి, విష్ణురూ
పాయ నమశ్శివాయ యని పల్కెడు భక్తజనంబు వైదికధ్యా
యిత కిచ్చు మెచ్చు పరతత్త్వము గొల్చెద నిష్టసిద్ధికిన్

స్ఫురదరుణాంశు రాగరుచి బొంపిరివోయి, నిరస్తనీరదా
వరణములై, దళత్కమల వైభవ జృంభణ ముల్లసిల్లను
ద్ధురతరహంససారస మధువ్రత నిస్వనముల్ చెలంగగా
గరము వెలింగె వాసరముఖంబులు శారదవేళ జూడగన్.

నేడాంధ్రదేశం అంతటా రాష్ట్రావితరణోత్సవావేశంతో ఉప్పొంగిపోతున్నది. తెనుగుజాతి పురాతనాంధ్రవైభవం తలుచుకుని పులకితమై ఉత్సాహంతో నవ్యాంధ్ర సృష్టి కుపక్రమిస్తున్నది.

వాడవాడలా, పల్లెపల్లెలా తెలుగువారందరు — ఆంధ్రోద్యమంలో అకుంఠిత విశ్వాసంతో సమస్తము సమర్పించిన అమర మూర్తులకు జోహారు లర్పిస్తున్నారు.

ఈ పవిత్రక్షణంలో భారతి, ఆంధ్రపత్రికా భారతి వ్యవస్థాపకులు, ఆంధ్రోద్యమ నాయకులు, దేశోద్ధారకులు అయిన స్వర్గీయ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులు గారికి సభక్తికంగా పూజాపుష్పాంజలి సమర్పించి, వారి సమున్నత జీవితాదర్శా లొకసారి మనసారా సంస్మరించి దివ్యాశీస్సు లర్థిస్తున్నది.

దేశోద్ధారకులు ఆంధ్రపత్రికద్వారా జాతి రాజకీయ సాంఘిక చైతన్యాలు సముద్దీపింపచెయ్యడంతో నే సంతృప్తులు కాలేదు. ఆంధ్రవ్యక్తివికాసానికి కళా,సారస్వత,విజ్ఞాన వికాసం అత్యవసరమని భావించి ఆంధ్ర గ్రంథమాల స్థాపించి, ఉత్తమ గ్రంథాలు ప్రచురించి రచయితలకు ప్రోత్సాహం కల్పించారు. ఆనాడే ఆంధ్రవిజ్ఞానసర్వస్వ ప్రచురణ కుపక్రమించారు. స్వయంగా గ్రంథాలు రచించి,సారస్వతవ్రతులై భారతీ సేవలో బద్ధకంకణులైనారు.

భారతి ప్రారంభ సంపాదకీయంలోని ఈ క్రింది వాక్యాలు ఆంధ్ర వ్యక్తి వికాసానికై ఆ పుణ్య పురుషుని హృదయంలో ఉద్భవించిన ఆ వేదన, అహమహమిక ప్రస్ఫుటం చేస్తున్నాయి.

"ఆంధ్ర వ్యక్తి పరిణామము నిరూపించుట కపారమైన విషయావగాహనము జేయుట కాంధ్రలోకము పూనుకొనవలసి యున్నది. విషయావగాహనమునకు సాధనములైన ప్రాచీనమందిరములు, బౌద్ధ స్తూపములు, తామ్రశిలాశాసనములు, తాళపత్రగ్రంథములు, కళావిచిత్రములు, వాఙ్మయస్వరూపములు, నిగూఢములై ప్రకాశము నపేక్షించుచున్నవి. ఆంధ్రవ్యక్తిద్యోతకములైన అమరావతి, సాంచి మొదలగు స్తూపముల వైభవ మజ్ఞాతముగనున్నది. శాసనపరిశోధనాలయములందు వందల కొలది తామ్రశాసనములు త్రుప్పుపట్టి పోవుచున్నవి. ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునందును, తంజావూరు గ్రంథ భాండాగారమునందును ప్రాత ప్రతులు శిథిలములగుచున్నవి. అజంతాయందలి మనోహరమైన చిత్తరువులు ప్రకాశమును గోరుచున్నవి. రసవంతమైన వాఙ్మయము ప్రకాశనమును పరిశీలనమును గోరుచున్నది. దేశమునందు మారుమూలలను దాగియున్న శాసనములు, గ్రంథములు, కళలు వెలుతురును గోరుచున్నవి. ఈ విషయావగాహనమునకు దోడుగను, ఆంధ్రప్రపంచమునందు భావరంగమునందు గలిగిన మహాసంచలనము, సాదర పరిశోధనమును, ప్రకాశమును గోరుచున్నది. గ్రంథకర్తలు, చిత్రకారులు, కళాప్రవీణులు సరసములైన

నవరచనలను జేయుచు నవజీవనోదయమును జేయుచున్నారు. ఈ మహోదయ సమయమునందు యథాశక్తిని భారతిని గొలుచుట కవకాశము లారాధకులకు గలవు."

ఇంచుమించుగా ముప్ఫయి సంవత్సరాలకు పూర్వం పంతులుగారి హృదయంలో బయలుదేరిన ఆ పునీతాశయాలే మన నూతన పరిస్థితులలో విస్తృతములై ఆంధ్ర సంస్కృతి సమున్మేషం అర్థించే నేటి నాయకులకు, కళారాధకులకు, శిరోధార్యాలైన సువర్ణమాలికలు కాగలవని ఆశిస్తున్నాము.

ఆంధ్రుల చరిత్రలో ఈ రాష్ట్రావతరణము చిరకాలసంస్మరణీయమైన సుదివసంగా నిలిచిపోగలదు. కృష్ణదేవరాయల అనంతరం క్రమక్రమంగా భిన్న భిన్నమైపోయిన ఆంధ్రదేశం తిరిగీ ఈనాటికి ఏక ప్రభుత్వచ్ఛత్రం కింద నిలిచి ఒక రాష్ట్రంగా ఆవిర్భవించింది. ఇంచుమించుగా నాలుగున్నర శతాబ్దాల కాలానికీనాడు ఆంధ్రదేశం ఏకీకృతమైనది. క్రమంగా విశాలాంధ్రావతరణోత్సవంకూడా త్వరలోనే సిద్ధించగలదని అభిలషిస్తున్నాము.

మన దేశచరిత్రలో ఆంధ్రరాష్ట్రావతరణం రాజకీయంగానే గాక, భాషా సంస్కృతులదృష్ట్యా పరిశీలించినా అత్యంత ముఖ్యమైన సంఘటన. ఈ మధ్యనే భారతదేశం భాషాసంస్కృతుల దృష్టితో తిరిగీ విభజింపవలెననేసూత్రం కేంద్రప్రభుత్వం అంగీకరించి, ఈ విషయ పరిశీలనకై ఒక ప్రత్యేకసంఘం నియమించాలని నిశ్చయించింది. మన దేశంలో మొట్టమొదటగా భాషారాష్ట్రాందోళన ప్రారంభించినవారు తెలుగువారు. భారత స్వాతంత్ర్యం వచ్చిన తరవాత మొట్టమొదటగా రాష్ట్రం సాధించుకొన్నవారూ తెలుగువారే. నలభై ఏళ్లనించి భాషారాష్ట్రాందోళన ప్రారంభించి అచంచలదీక్షతో స్వరాష్ట్రం సాధించుకొన్న ఆంధ్రజాతి ఈనాటికి భారతదేశంలో ప్రత్యేకవ్యక్తిత్వం గడించుకొన్నది. ఆంధ్రసంస్కృతి భారతీయ సంస్కృతి శరీరంలో ఒక ప్రధానావయవమై, ఇకనించి క్రమక్రమంగా రూపురేఖలు దిద్దుకొనే అవకాశం గడించుకొన్నది.

రాజకీయాల్లోనేగాక విజ్ఞానాత్మకమైన సాంస్కృతికరంగంలోకూడా ప్రస్తుతంమనం సాధించుకోవలిసిన భాషాసారస్వత సమస్యలెన్నో స్ఫురిస్తున్నాయి. ఇన్నాళ్లనించీ కేవలం ఉద్యమరూపంలోనే వివిధరీతుల్లో వ్యక్తమయిన వ్యావహారిక భాషకు శిష్ట స్వరూపం నిర్ణయించుకుని ఆభాషకు ప్రభుత్వ విశ్వవిద్యాలయప్రాంగణాల్లో గౌరవ ప్రపత్తులు కల్పించుకోవలిసిఉన్నది. విదేశ వ్యామోహాల్లో పడి, వెర్రితలలువేసే శిల్పసారస్వతసృష్టి తిరిగీ సజీవమైన భారతీయాంధ్ర సంప్రదాయంలో ప్రవర్తించేటట్టు సరిదిద్దుకుంటూ మన ప్రత్యేకత నిలబెట్టుకోవలిసిన అవసరం ఎంతైనా ఉన్నది. అలాగే మన సంప్రదాయదృష్టి వట్టిసంకుచిత ధోరణులలోపడి మాసిపోకుండా, ప్రపంచ సంస్కృతులతోబాటు సగౌరవంగా సాగిపోయేటట్లు సంరక్షించుకుంటూ ఉండాలి.

ప్రపంచ సారస్వత శాస్త్రవిజ్ఞానము

మనభాషలోనికీ, మన భాషలోని ఉత్తమ విజ్ఞానం ప్రపంచభాషల్లోనికి అనువదిస్తూ మన సంస్కృతిప్రత్యేకత విదేశీయులకు వెల్లడించాలి.

భారతదేశంలో వేరువేరు రాష్ట్రాల్లో నివసించేవారి భాషా సారస్వతాలతో సన్నిహితసంబంధం కల్పించుకుని భారతజాతీయతకు ఏకైకమైన సమగ్రస్వరూపము నిర్మించుకోవాలి.

సాధ్యమైనంతవరకు ప్రభుత్వవ్యవహారాలన్నీ తెలుగుభాషలోనే నడిపిస్తూ ప్రజలకు, పరిపాలకులకు నాయకులకు సన్నిహిత బాంధవ్యం వృద్ధిపొందించాలి. ఈ లక్ష్యాలన్నీ ఆచరణలోకి వచ్చినప్పుడే మన నవ్యాంధ్రరాష్ట్రప్రాప్తి సార్థకంఅవుతుంది.

మాతృభాష జననీక్షీరమువంటిది. పరభాష కేవలము కృతకదుగ్ధమే. ఎలాంటి శిల్ప, శాస్త్రవిజ్ఞానమైనా విద్యార్థులకు మాతృభాషద్వారానే హృదయంగమం కాగలదని విద్యావేత్త లంగీకరిస్తున్నారు.

మాతృభాషాభివృద్ధికి శాస్త్రీయ విజ్ఞానము, సారస్వత విజ్ఞానము రెండూ రెండు నేత్రాల వంటివి. ఉన్నత శాస్త్రీయవిజ్ఞానం మన భాషలోని కనువదించుకోవాలనే ప్రయత్నం ఇప్పుడిప్పుడే ప్రారంభమైనది. ఈ విషయంలో జరగవలసిన ప్రయత్నం విషయంలో నూతన ఆంధ్ర ప్రభుత్వము, విశ్వవిద్యాలయాధికారులు, విద్యావేత్తలు తగినశ్రద్ధ వహించగలరని భావిస్తున్నాము.

ఇన్నాళ్లనించీ మన సారస్వత సంస్థలు పరిషత్తులు ఆయా ప్రాంతాలకు, కొందరు సాహిత్యపరులకు మాత్రమే ప్రతినిధులుగా ఉన్నాయి. ఆంధ్ర దేశానికంతటికీ ప్రముఖమైనసాహిత్యపరిషత్తింకా ఆవిర్భవించ లేదు. ఈ పరిషదావిర్భావంతో బాటు కవిత, కథ, నవల, రూపకము, విమర్శనము మొదలైన శాఖలలో ఉత్తమాభివృద్ధికి కావలసిన దోహదా. లితోధికంగా కల్పించవలసిన బాధ్యత ఆంధ్ర ప్రభుత్వము, ప్రజ సరిసమానంగా స్వీకరించవలసి ఉన్నది. ముఖ్యంగా విద్యార్థి లోకంలోను, పాఠకలోకంలోను, శిష్టమునిర్దుష్టము అయిన తెలుగు భాషయెడల గౌరవాభినివేశాలినుమడింప జెయ్యడంలో ప్రత్యేకశ్రద్ధ వహించాలి. ఇన్నాళ్లుగా పరభాషా ప్రాబల్యంలోపడి నలిగిపోయే తెనుగువాణికి విశ్వవిద్యాలయంలోను, ప్రభుత్వ వ్యవహారంలోను, ప్రజాసదస్సులలోను, హుందా తనము గౌరవము పలుకుబడి కలిగించడం ఆంధ్రప్రజలందరు తమ పవిత్రలక్ష్యంగా భావించి నడుములు కట్టుకొని ప్రయత్నించాలి.

ఆంధ్రజాతి ఇకనించీ, దేశోద్ధారకులు, దేశభక్తులు మొదలయిన పుణ్య పురుషుల సమున్నతాశయా లనుదినము మననంచేసుకుంటూ మన భాషకు, కళలకు, విజ్ఞానానికి,—సమగ్రసంస్కృతికి అన్నివిధాలా దోహదం కలిగించగలదనీ, నవ్యాంధ్ర రాష్ట్రంలో ప్రజాసామాన్యం సంపూర్ణ వ్యష్టి సమష్టి వికాసాలతో విలసిల్లగలదనీ కాంక్షిస్తున్నాము.

---

అందువలననే, వారు పద్మావతిలో మఱొకచోట — కావ్యమున సాధారణముగా, — పదమునందు, వాక్యబంధమునందు, అర్థమునందు, రసమునందు — ఈ నాలుగు తావుల దోషములు ఘటిల్ల వచ్చుననియు, అట్టి దోషములు పొసగకుండ, తత్కావ్యకర్త జాగ్రతపడవలెననియు, ముఖ్యముగా, రసప్రతీతికి భంగకరమగు నే విషయమును, కవి యుపేక్షింపరాదనియు, దోషశంకయేమే నున్నచో, సత్వరమే దానిని తొలగించి వేయుట యుచితమనియు, పై దోషములకు దూరమైన కృతి, కావ్యమనియు, నుద్ఘాటించి యున్నారు.

(పద్మావతి. ప. పూ. ము. పు. 473–474)

## 4

శ్రీ శివశంకరులకు, తమ కావ్యములలో కథావస్తువు, దైవికముగాగాని, పౌరాణికముగాగాని, ఉండవలెనను పట్టుదలలేదు. చారిత్రకముగా, ఐతిహ్యముగా, స్థానికముగా, నున్న ఏవిషయమునైనను, ఎట్టిదియునైనను, ఎంతచిన్నదియునైనను, గ్రహించి, రసవత్తరముగా రూపొందింపగల ప్రజ్ఞ శివశంకరుల లేఖినిలో నున్నది.

ఏవిధముగాను ప్రామాణికముగాని విషయమును మాత్రము, వారు కృతులలో చొప్పింపరని ముఖ్యముగా గమనింపవలసి యున్నది. వారి కృతులలో కొన్ని, కల్హణుని రాజతరంగిణీమూలముగా బనుపడి యున్నవి.

శ్రీ శివశంకరుల కృతులు, భిన్నభిన్న విషయములను చెక్కింటెని జర్చించి వివరించినవి. ఈ సన్నివేశముల శిల్పములో యాథార్థ్యమునే ప్రకటించుటయేగాని, శ్రీ శివశంకరులలో, కుల, మత, జాతి, సంఘ, దేశ, రాష్ట్ర, ప్రాంత, ఆచార, వ్యవహారాది పక్షపాతము ఏమాత్రము గోచరింపదు. పైపెచ్చు, వారికృతులు పై యంశములకు మెఱుగుపెట్టు నూతనోత్తేజమును గలిగించునవిగా, సాహితీసంవర్ధనములుగా, నున్నవనుటలో సందేహము లేదు.

## 5

శ్రీ శివశంకరుల గేయనాటికలలో, "యక్షరాత్రి" గీతికా సల్లాపకము.

యక్షరాత్రి యనగా, యక్షులకు సంబంధించిన రాత్రియనిగాని, యక్షులతో ప్రవృత్తమైన చరిత్రగల యొక రాత్రియనిగాని, ఊహింపరాదు. కాని, యక్షుల ప్రభావమువంటి ప్రభావ మొకటి, నాయికా నాయకులపై అద్భుతముగా ప్రసరించి, మైమఱపించి, సుఖసమాగమముతో, వారిని మహానందరస వీచికలలో నోలలాడించినది. దానినిబట్టి, ఈ సల్లాపకము "యక్షరాత్రి" అనిపించుకొనినది అని మాత్రము చెప్పవచ్చును.

పక్షరాత్రికివలె యక్షరాత్రికి, సుఖరాత్రి అను నభిప్రాయమును చెప్పవచ్చును. పక్షమున కొకమాఱు ప్రేయసీ సుఖసమాగమముతో రాత్రిని జరుపుట, సంప్రదాయ విహితమై యున్నది. దానిని బట్టి, ఆ రాత్రికి పక్షరాత్రి అను పేరు వాడుకలోనికి వచ్చినది. అదియును, సత్పుత్రకాముడైనవాడు, శుక్లపక్ష రాత్రియందే అట్లు ప్రవర్తింపవలెనను నాచారములో నున్నది.

అట్లే అలవాటులోనున్న పక్షరాత్రి కాకున్నను, ఆనాటి రాత్రి అట్టి యక్షిణీ ప్రభావము నాయికా నాయకులపై ప్రసరించి, అట్లు ప్రవర్తింప జేసినది కావునను, ప్రకృత కథావిధానమును యక్షరాత్రియని యనుటయు సమంజసముగా నున్నది.

యక్షరాత్రి అనునొక పండుగ, మనకు శాస్త్రీయముగా, సంప్రదాయసిద్ధముగా, వచ్చుచున్నది. అది, ఆశ్వయుజ శుద్ధ పూర్ణిమనాడు వచ్చును. ఆశ్వయుజ శుద్ధ పూర్ణిమ, పరిణత శరచ్చంద్ర చంద్రికలతో ఆనంద సాంద్రముగా నుండునట్టిదిగాన, ఆ రాత్రి జరుగు పక్షరాత్ర్యుత్సవము, కౌముదీజాగరముగా గూడ పరిణమించినదని కొందఱి మతము.

ఆశ్వయుజ శుద్ధ పూర్ణిమనాటి రాత్రి, మఱొక ఉత్సవము, దేవతా ప్రీతికరమగు వ్రతరూపముగా జేయబడునది, మనకు ప్రసిద్ధమైయున్నది. దానిని, కోజాగర వ్రతమందురు. దాని విధి యిది—ఆశ్వయుజ శుద్ధ పూర్ణిమనాటి రాత్రి, మేల్కొనియుండి లక్ష్మిని, ఐరావత సహితుడగు నింద్రుని పూజించి, సాధకుడు, వేశ్యాంగనలతో జూదమాడవలెను. ఆ నియమము నట్లాచరించినచో, లక్ష్మి ప్రసన్నురాలై కోజాగర్తి?—ఇప్పు డెవడు మేల్కొనియున్నాడు? నేనే స్వయముగా వానిదగ్గరకుపోయి, వరములిచ్చి వాని నుద్ధరింతును గాక యని పోయి, అట్లొనరించునట.

పక్షరాత్రి, కౌముదీజాగరము, కోజాగర వ్రతము, సుమారు ఒక్క సమయమందలివే యగుట, అన్నిటిలోను, జూదపు నియమము లొక్కటిగానే రూపొందినవి. రానురాను ఈ ఆచారము పూర్తిగా పాటింపబడక, వేశ్యాసమాగమము, అక్షక్రీడ మాత్రమే మిగిలిపోయి, అవి అక్షరాత్రులుగా స్థిరపడినవి. కాని, అక్షక్రీడయు నాగరకులకు విహితమే.

యక్షరాత్రి ప్రభృతులను, వాత్స్యాయనుడు, తన కామసూత్రములలో, నాగరక వృత్తమున, వివరించియున్నాడు—

“యక్షరాత్రిః, కౌముదీజాగరః, సువసంతకః, సహకార భంజికా, అభ్యూషఖాదికా......... దేశ్యాశ్చ క్రీడా జనేభ్యో విశిష్ట మాచరేయు రితి సంభూయ క్రీడాః.” 206.

వాత్స్య. కామ. నాగ. వృ. ౧. ౪. ౪౨.

పై సూత్రములో నిర్వచింపబడిన వన్నియు, నాగరకుడు చేయవలసిన నియమములుగా నుద్దిష్టము లైనవి.

పై సూత్రమునకు, శ్రీ పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారీ క్రింది విధమున, ఆంధ్ర వివరణము వ్రాసియున్నారు—

“యక్షరాత్రిః—ఇదియొక మాహాత్మ్య దివసము. (అనగా వ్రతదినమని యర్థము.) దీనిని కొందఱు పక్షరాత్రియనియు, సుఖరాత్రియనియును, నందురు. యక్షులీ దినమున సన్నిహితులై యుండుటచేత, దీనికి యక్షరాత్రియని పేరు వచ్చినదనియును, నాగరకు లను వారు సుఖాతిశయముతో జూదము మున్నగు మనః ప్రమోదనములను నాటపాటలతో సుఖముగా కాలము గడుపునట్టి దివసము గనుక, సుఖరాత్రి యనియును, శుక్ల కృష్ణములను రెండు పక్షములలో కేవలము ఒక్క శుక్లపక్షమునందు మాత్రమే, జరుపునట్టి వ్రతోత్సవము గనుక, పక్షరాత్రి యనియు నందురు. ఈ వ్రతమునకు నామమునందు గల భేదమే కాని, వ్రతాచరణ విధానమునం దెట్టి భేదములేదు. ఈ వ్రత కాలమునందు విజ్ఞులగువారు, పూజాపురస్కారాదులను యక్షుల నుద్దేశించి చేయవలయును. కాని, రాను రాను, ఆ సంస్కారము మాసిపోయి, కేవలము లోకులు తెలియదుగ నానాడు జూదములాడుచు ప్రొద్దు పుచ్చుచుందురు. ఇయ్యది కార్తికామావాస్యను చేయునట్టిది.”—అని.

కాని, ఇంచు మించు, యక్షరాత్రి, కౌముదీ జాగరాద్యుత్సవములు, ఒకదాని కొకటి సంబంధించి, సమాన నియమములతో నుండుటచే, కేవలము శుక్ల శరద్రాత్రులయందే చేయదగినవిగా గోచరించుచున్నవి. అదియును గాక, కామసూత్రముల పూర్వ పరావమర్శనము చేయగా, వెన్నెల రాత్రులలో గణికా గృహములలో, కవి గాయక ప్రముఖులు గోష్ఠులు జరుపుటయు, సుఖముగా గడుపుటయు, నాగరిక వృత్తము విశదీకరించుచున్నది. దానిని బట్టి, పాశ్చాత్యులు కూడ, పై సూత్రముపై తమ యభిప్రాయమును సూచించుచు, యక్షరాత్రి వివరణమున, వెన్నెల రాత్రులలో గణికా గృహములలో కవి గాయక ప్రముఖులు గోష్ఠి చేయుచుండుటయే ప్రధానముగా నొడివియున్నారు.

శ్రీ శివశంకరులు, ఆ అభిప్రాయమునే స్వీకరించి, తమ గీతికా సల్లాపకములో, నితంబవతీ ఇందురాజుల సుఖసమాగమము నొక యక్షిణీ ప్రభావము వంటిదిగా వర్ణించుచు, నాటికకు, యక్షరాత్రి అని నామకరణము చేసినారు. అది యెంతయు సమంజసముగా నున్నది.

## 6

యక్షరాత్రిలో, నాయికయైన వికటనితంబ తప్ప, తక్కినవారు, కథాసంవిధానమున కనువుగా, కల్పింపబడిన పాత్రలు. అయినను, వారు నిజముగా నున్నారేమో అనిపించునట్లుగా, ఈసల్లాపములో విలసిల్లుచున్నారు.

## 7

ఇందురాజు, నేమికవి, భీమరథుడు, సునంద, వికటనితంబ, అను అయిదుపాత్రలతో, యక్షరాత్రి పూర్తి అయినది.

ఇందు, వికటనితంబ, నాయిక. ఇందురాజు, నాయకుడు. సునంద, సఖి. నేమి, భీమరథుడు, ఇందురాజుస్నేహితులు. నేమి, కవి. భీమరథుడు, గాయకుడు. వికటనితంబను, నితంబవతి అను ముద్దుపేరున, నాటికలో పిలిచినారు శ్రీ శివశంకరులు.

వికటనితంబ, ఉజ్జయినీ నివాసురాలు. విద్యావతి. కవయిత్రి. ఈమె, కావ్యము లేవైనను రచించినదో లేదో తెలియదుగాని, ఎన్నో ముక్తకములు రచించినది. వానిలో కొన్ని మనకు ఉపలభ్యమానములవుచున్నవి. ఆ ముక్తకములు, ప్రసిద్ధ ముక్తక కావ్యకర్తల ముక్తకముల కెందును తీసిపోక, రసస్ఫోరకములై యున్నవి.

వానిలో, ఉదాహరణ కీ క్రింది ముక్తకముల నరయుదము—

“కిం ద్వారి దైవహతికే, సహకారకేణ
సంవర్ధితేన విషవృక్షక ఏష పాపః
యస్మిన్ మనాగపి వికాస వికారభాజి
ఘోరా భవన్తి మదనజ్వర సన్నిపాతాః”

(విరహిణి, తన యింటిముందర వసంతకాలములో పూచిన సహకార వృక్షమును చూచి, —) “ఓ దురదృష్టవతీ! ద్వారమునొద్ద పెరిగిన తియ్య

మాపిడిసియున్నవల్ల ఏమి ప్రయోజనము? ఈ పాడుచెట్టు విషవృక్షము సుమా! ఇది కొద్దిగా వికసించగానే, మదన జ్వర సన్నిపాతములు ఘోరములుగా చెలరేగు చున్నవి."—అనెను.

"దిగ్వధూవదన చుంబిచేష్టయా
వీక్ష్యసద్యుతి దివా భవద్యశః
దర్శితః పృథుపయోధరోద్గమ
స్త్రైవ సాఽపి పరిరభ్య తేఽఖిలా."

(ఒకానొకరాజు కీర్తినిగురించి, ఎవరో ప్రశంసించుచు,—"రాజా! దిక్కులనే స్త్రీలముఖములను ముద్దుపెట్టుకొంటున్న నీకీర్తిని చూచి, స్వర్గము నే కాంత, ఈర్ష్యవల్ల, పృథుపయోధరోద్గమమును చూపినది."—అనివాడు. పయోధరములు అనగా, మేఘములు, పాలిండ్లు. ద్యోభామిని నీ యశస్సుతో సర్వాంగాలింగితమయినది. అనగా, కీర్తిదిగంతములను, స్వర్లోకమును వ్యాపించినదని తాత్పర్యము.)

"లావణ్యసిన్ధు రపరైవహి కేఽయ మత్ర
యత్రోత్పలాని శశినా సహసంప్లవన్తే!
ఉన్మజ్జతి ద్విరద కుంభకటీచ యత్ర,
యత్రాపరే కదలికాణ్డ మృణాల దణ్డాః."

(నాయిక నదితో పోల్చి వర్ణింపబడినది.—"ఈమె లావణ్యసింధువు. ఈ నదిలో నల్ల కలువలు చంద్రునితో సహా ఈదుచున్నవి. గజకుంభములు పైన తేలుచున్నవి. అరటిబోదెలు, తామరతూండ్లు, మఱొకచోట తేలియాడుచున్నవి."—అని.)

వికటనితంబ, తన చరిత్రను నే చెప్పుకొనుచు, చెప్పిన ముక్తకము, సరసము మాత్రమే కాదు, శాస్త్రమర్యాదా గంభీరముకూడనై యున్నది.

ఈమెకు, వికటనితంబ అను పేరు ప్రధాన నామధేయముగా తోచదు. వికారమై, మోయరాని బరువు గలిగిన నితంబస్థలము గలది యని హాస్యాస్పదమైన అర్థముగల ఇట్టి పేరును, తల్లిదండ్రు లామెకు పెట్టియుండరు. పెట్టినను, లోకజ్ఞానము కలిగినపిమ్మట, ఆమె తన కాపేరు నిలిచియుండ నిచ్చగింపదు. రసికురాలుగా, విద్యావతిగా, కవయిత్రిగా, పరిగణింపబడుచున్న ఆమె, తా నా పేరుతో నే వ్యవహరింప సమ్మతింపదు కూడ. కాని,—జఘన చపల, ఫల్గుహస్తిని, శాకీన కవి, నిద్రాదరిద్ర కవి, శునశ్శేపుడు, ఇత్యాది నామములు లేవా? అవి, వారికి న్యూనత గొనివచ్చుచున్నవా? అట్లే, ఆమె కాపేరే ప్రధాన నామమైయుండు—ననియు కొందఱందురు. మఱొక పేరున్నట్లు ఎక్కడను కన్పించక పోవుటకూడ, వారి వాదమును బలపరచుచున్నది. కాని,—ఆమె, ఒక వికటనితంబ ముద్దేశించి, ఎక్కువగా పద్యములు చెప్పియుండును. అవి విరళప్రచారమునకు వచ్చియుండును. వానిద్వారా, ఆమె, వికటనితంబ అను పేర ప్రసిద్ధికివచ్చి, తుద కామెకు, ఆపేరే రూఢముగా నిలిచియుండవచ్చును. — అని కొందఱూహించుచున్నారు.

శ్రీ శివశంకరుల అభిప్రాయము కూడ, ఇదియే యని స్పష్టమవుచున్నది. అది సూచించుచు వారు, యక్షరాత్రిలో—

"గతములో నీ పేరు కలిసిపోవక నిమ్మ!
వికట నితంబయన్ విఖ్యాత నామమ్మె
ఆచంద్ర తారార్క మక్షయ్యమగుగాక!"
యక్షరాత్రి. (మ. ప్రా. ము పే. 569..)

అని ఇందు రాజుచే బలికించి, మరల దానిని దృఢము చేయుచు—

"ఈ వికారపు పేర ఇంపయ్యెనా మీకు!
ప్రాణనాథా! నన్ను పరిహసించుట తగునె?"

అని వికటనితంబచే ప్రశ్నింపజేసి, అందుకు సమాధానముగా, ఇందురాజుచేత—

"బ్రహ్మకైనను తరమె పడిన పేరును మార్ప!
వినలేద ప్రేయసీ! వికటశబ్దమ్మునకు
అభిధానమందు రమ్యార్థమున్న విధంబు!"
యక్షరాత్రి. (మ. ప్రా. ము పే. 569..)

అని చాల సరసముగా పలికించినారు. ఇందు—"ఆమె కా పేరు పడినదే కాని, వాస్తవము కా,"—దనుటను, "పడిన పేరును మార్ప" అనునది, స్పష్టీకరించుచున్నది. అందువలననే వారు, తమ నాటికలో ఆమెను నితంబవతిని గావించి, అచ్చటచ్చట, ముద్దుగా, రమ్యముగా "వికట" అని వాడినారు.

## 8

శ్రీమాన్ ఈ యాజ్ఞి వేంకట వీరరాఘవాచార్యులుగారు, వికట నితంబను గురించి, రెండు వ్యాసములు వ్రాసినారు.

మొదటి వ్యాసము సారాంశ మిది—

"కే వైకట నితంబానాం
గిరాం గుంఫేన రంజితాః
నిందంతి నిజకాంతానాం
న మౌగ్ధ్య మధురం వచః!"

అను శ్లోకము, బిల్హణుని సూక్తిముక్తావళిలో, రాజశేఖర కవికృతముగా కనబడుచున్నది. రాజశేఖర కవి, క్రీ. శ. 900–25 లలో ఉన్నాడు. ఆయన

పేర్కొనుటచేత, ఈ వికట నితంబ, క్రీ. శ. 900 లకు పూర్వము, జీవించియుండును. ఈమె ప్రథమ నామ మేమో తెలియదు. వికట నితంబా అను పద ప్రయోగము ఉన్న పద్యము లేవైనను రచించుటచేత, ఈమెకు ఈ పేరు వచ్చియుండును. అంతేకాని, హాస్యాస్పదమైన వికట నితంబ అను పేరు ఎవరైన పెట్టుకొందురా? జఘన చపల, ఘట్టహస్తిని, కాకీవ కవి, నిద్రా దరిద్రకవి, ఇత్యాది నామములు కొందఱికి ఉంటున్నవి.

'క్షేనైకట నితంబానాం' అను శ్లోకమును "పునర్భూ విషయోయథా" అని భోజుడు, శృంగార ప్రకాశములో ఉల్లేఖించినాడు. అందువల్ల, ఈమె వితంతువనియు, తరువాత మరల పెండ్లియాడినదనియు తెలియవచ్చుచున్నది.

"పృష్టః కాలే వదతి స బాష్పం (నాషం)
తద్విపరీతం పస్య హీగన్యే
లుంపతి చోష్ట్రి రంవా షంవా
తస్మై దత్తా వికటనితంబా."

ఈ శ్లోకము కూడ శృంగార ప్రకాశములోనే కనబడుచున్నది. రుద్రటుని కావ్యాలంకారమునకు నమిసాధువు వ్రాసిన వ్యాఖ్యలో, ఈ శ్లోకమే కొద్ది మార్పులతో కనిపించుచున్నది.—

"యథా, వికటనితంబాయాః పతి మనుకర్వాణా సఖీ ప్రాహ—
కాలేమాషం సస్యేమాసం
వదతి శకాశం యశ్చసకాశమ్,
ఉష్ట్రేలుంపతి రంవా షంవా
తస్మైదత్తా వికటనితంబా."

ఈశ్లోకము వికటనితంబ చెలికత్తె పలికినట్లు కనబడుచున్నది. కాలవాచకమైన మాసము అని పలుకుటకు మాషము అనియు, మినుములు అను నర్థములో మాషము అనుటకు బదులు మాసము అనియు, బాష్పము అనుటకు భాస్పము అనియు; సకాశము అనుటకు బదులు శకాశము అనియు; ఉష్ట్రము అని అనుటకు, ఉష్టము అని కాని, ఉట్రము అని కాని, పలుకు ఒకానొక మూర్ఖునకు, వికటనితంబను ఇచ్చి పెండ్లిచేసినారట. — ఇటువంటి మూర్ఖుడు, అరసికుడు అయిన భర్త చనిపోగా, ఈమె మరల ఎవనినో ఒక రసికుని వివాహముచేసికొనినదని ఊహించవచ్చును."

రెండవవ్యాసము సారాంశమిది—

శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు, సంస్కృత ఛ్ఛందో గ్రంథమైన 'జనాశ్రయి' విషయమై వ్రాయుచు, వికటనితంబనుగురించి ఇట్లని వారట—

"గోవిందరాజకృతమైన ఒకానొక ప్రహసనములో, వికటనితంబ నాయిక యని తోచుచున్నది. ఈమె పునర్భువు అని భోజుడు చెప్పినాడు. ఈమె, భరతనాట్యముల్లో జాణ. శృంగారాదులను ఆవిష్కరించుటలోను, ఎదుటివారిని హావభావములతో ముగ్ధులనుజేయుటలోను, చాల నేర్పరి. నమిసాధువు చూపిన ప్రమాణములనుబట్టి భోజు డిట్లు ఊహించియుండవచ్చు. 'బాలా తన్వీ' అనే జనాశ్రయిలో ఆకరమునకు కర్త గోవిందరాజుగాక, మఱియెవరైననగుగాక, అందుదాహరించుటచేత కవి, క్రీ. శ. 900 లకు పూర్వుడు."

శ్రీ రాఘవాచార్యులుగారు, వికటనితంబ క్రీ. శ. 900 ప్రాంతములోనిది అని అంగీకరించినారు. కాని, ప్రహసనములోని కల్పితవ్యక్తి అను మాటకు అంగీకరింపలేదు.

దర్శనాధ్యాపకులైన శ్రీ పొన్నుస్వామి అయ్యరు గారు, వికటనితంబనుగురించి, ఈ ఐతిహ్యమును చెప్పినారట—

"వికటనితంబ, మూర్ఖభర్తతో కాపురము చేయలేక, గూఢముగా ఎచ్చటికో లేచిపోయి, ప్రచ్ఛన్నముగా వేశ్యావృత్తి నవలంబించినదట. ఈమె కవయిత్రి యగుటచేత, మనోహరమైన పద్యమే పణ్యధనముగా నిర్ణయించి, అట్టి శ్లోకము వినిపించిన సుకృతికి ఆనాటికి స్వశరీరము సమర్పించునదట. కొన్నినాళ్ళకు దైవికముగా ఆమె తండ్రియైన బాహటుడు, అట్లు రాగా గుర్తుపట్టి, తన నడవడిని క్షమింపవలసినదని, ఆమె ప్రార్థించినదట. అది విని తండ్రి మిక్కిలి విలపించినాడట. అప్పుడు—

"తాత! బాహట! మారోదీః,
విహానై కర్మణో గతిః;
దుషిధాతో రివాస్మాకం
గుణో దోషాయ కల్పతే."

'తండ్రీ! దుఃఖింపకుము. ఇదంతయు కర్మఫలము. దుష్ ధాతువునకు గుణమురాగా దోష అయినట్లు, నాకు గుణము దోషముగా పరిణమించినది.'— అని కూతురు, ఆయనను ఓదార్చినదట.

ఇందు, అయ్యరుగారు చెప్పిన కథ, నిరసముగానే కాక, ఒక రసిక యువతికి అంటగట్టదగనంత దారుణముగా నుండుటచే, శ్రీ శివశంకరులు, ఆచార్యులవారియు, రామకృష్ణ కవిగారియు, అభిప్రాయములతో నేకీభవించి, వికటనితంబను పునర్భువుగానే, నిరూపించినారు. అందువలన, వారు—

"సీమంతమున లేదు సిందూర రాగమ్ము
గోరోచనా రేఖ కూడ ఫాలమునందు

అస్పష్టముగనైన అగపడుట లేదేమి?
ఉత్తమాంగన వేష మెప్పియున్నది నీకు—
కాని నగరమ్ములో కవులు కొందరు నిన్ను
గణియించుచున్నారు గణికాలలామగా!
మర్మ మేదో యున్నమాడ్కి దోచును నాకు,
దీని వివరంబేమొ, తెలుపుదువ కవయిత్రి!
భావ్యమ్ము కాదేని ప్రశ్న క్షమియింతువా?"
అని ఇందురాజుచే ప్రశ్నింపజేసి—
"దుర్విపాకమ్ముచే తుడుచుకొనిపోయినది
ముత్తైదువలచిహ్న సుఖముమండి కవీంద్ర!"
(యక్షరాత్రి. ప. పూ. ము. పు. 565.)

అని నితంబవతి నోటిమీదుగా, గద్గదికతో, స్ఫుటముగా చెప్పించినారు.

కాని, శ్రీ శివశంకరులు తమ నాటికా నిర్మాణములో, మానినికి లేశమేని కళంకము కలుగుట కిష్టపడక, కావలసిన కొద్దిపాటి మార్పులతో, నితంబను ఉదాత్త చరితముగా చిత్రించినారు.

ఇందురాజుతో పరిచయము కలుగునప్పటికి, వికటనితంబ పరమపవిత్రాశయములో నున్నది. లోకములో తనపైనున్న అపప్రథలకు వెఱచియు, చేయునది ఏమియు లేకయు, ఆమె తనస్థితికి తానే లోలోపల విచారపడి, ఒక నిశ్చితాభిప్రాయమునకు వచ్చినది. ఆ అభిప్రాయముననుసరించి, ఆమె కేవల మాధ్యాత్మికదృష్టితో, తద్బోధకములైన గ్రంథములనే చదువుచు, వాని నాచరణమున బెట్టి, మహాత్ముల దర్శనముతో పునీతయగుచు, కాలము వెళ్ళబుచ్చుకొనుచున్నది. అందులకు నిదర్శనముగా, వికటనితంబ, ఇందురాజుతో సంభాషించునప్పుడు, అశ్వఘోషుని బుద్ధచరిత, సౌందరనందము, తన సరసనే యుంచుకొనియున్నది. (పు. 564.)

బౌద్ధగ్రంథములు, బౌద్ధ కథలు చదువుటతో, ఆమె విహారధర్మములలో విహరించుచున్నదని తలపరాదు. ఆ గ్రంథములలో బోధింపబడిన నిర్వాణమార్గములు, సుఖశాంతులు, మనఃప్రసన్నత, పరోపకారపరాయణత్వము, పెద్దలసేవ, సత్యము, మున్నగు సూత్రములు, జీవితలక్ష్యములుగా ఆమె నాకర్షించినవని గమనింపవలెను.

ఇంతవరకు, అసహాయురాలై దీనచరిత్రయైన నితంబమీద, కవి సభాపతుల దయాదృష్టి ప్రసరించినది. కవుల దృష్టిలో పడిన కామినికి, కల్యాణము కలుగక తప్పదు. అందుకు పునర్భువు అగుటచేత, హృదయము ద్రవించి, సభము మతెంత శీఘ్రగతికి ప్రేరేచినది. ఇక, ఆమెకు పునస్సౌభాగ్య భిక్ష పెట్టక తప్పని సరిఅయినది. అందువలన, కవయిత్రి, రసికురాలు, అయిన నితంబవతికి, కవి, రసికుడు నగు ఇందురాజుతో వివాహము జరిపించి, శ్రీ శివశంకరులు, వారిని యక్షరాత్రి సుఖములో నోలలాడించినారు.

శృంగార రసబంధురములైన పద్యములను చెప్పిన రసికురాలికి, భర్తగా, ఒక ప్రౌఢ రసిక కవిని సమకూర్చుట సరసమేకదా!

## 9

"కాళిదాసుని దూత కావ్యమ్ము నొకమారు
పఠియించుచుండగా పండు వెన్నెలరేయి
మనసు వోడెమెను మేఘ మార్గాన పయనింప—"
(ప. పూ. ము. పు. 555)

వినువెంటనే శ్రీ శివశంకరులు, తాముగా, మహాకవియైన ఇందురాజుచే, అతిదీర్ఘవృత్తమైన యాత్రాప్రబంధమునకు మొనయించినారు.

ఒకానొక ప్రత్యూషమున, ఆగ్నేయముగా పయనము నారంభించి, ఆయాత్ర—

"రామభద్రపద రాజీవాంకిత
మేఖలమగు నా పేటి రామగిరి
స్నిగ్ధచ్ఛాయా క్షితిజంబులకడ
గడపి వాసరము.........పిమ్మట
మాలకూట మను మహిత క్షేత్రము......"
(ప. పూ. ము. పు. 556)

ఆమ్రకూటగిరి మున్నగువానిని జూచుచు, క్రమముగా ఉజ్జయిని, మహాకాళ క్షేత్రము, దశపురి, కురు క్షేత్రములమీదుగా, ఆర్యావర్తమును పూర్తిగా చుట్టివచ్చినది.

ఇందు, ఇందురాజులో సంపూర్ణముగా శ్రీ శివశంకరులే మూర్తీభవించినారు. స్వయముగా పాదలేపమువంటి యోగసిద్ధాంజనముతో, దేశదేశములు, మూలమూలలు, మిన్నులుపడ్డ చోటులు, అఖండ నియతితో సందర్శించుచు, యాత్రలు నడపినవారికి గాని, అచటచటి విశేషములను కన్నులకు గట్టిన ట్లభివర్ణించుచు, యాత్రాప్రసంగములను వివరింప సాధ్యపడదు. స్వయముగా శివశంకరు లిట్టి యాత్రల నెన్నియో మారులు చేసియున్నారు. అందువలననే, కాళిదాసాదుల ప్రభావము, ఔత్సుక్యము, శివశంకరులలో ఆయా సందర్భములలో సరసముగా వ్యక్తమగుచున్నది.

## 10

యక్షరాత్రి, చిత్రవిచిత్రవిషయములను లెక్కించనిని వర్ణించినది.

1. యువకవులు అనగా కుబ్జకవులు, అర్భకులు. వారు, తమవిషయమునగాని, మఱియొకరి విషయమునగాని, సంఘటిల్లిన నూతనవిషయమును అరయుకొనలేరు. వారినోటిలో నూవుగింజ నానదు. అల్లరి మెండు. అది సూచించుచు, యక్షరాత్రి, ఇట్లనినది—

"ఉజ్జయినిలో నాకు యువకవులమూలాన
అచిరకాలమునుండి అప్రతిష్ఠ ఘటిల్లె!"

(యక్షరాత్రి. ప. పూ. ము. పు. 565)

ఈ పలుకులు పలుకుచు, పాపము, నితంబ, అపరాని దుఃఖముతో రోదనము సలిపినదట.

2. నితంబవతీ ఇందురాజులకు, అన్యోన్య ప్రణయభావము మనస్సులలో అంకురించినది. మాటలద్వారా, చేష్టలద్వారా, అది, ఇంచుకించుక ముగ్ధసుందరముగా వెలియుచున్నది. కాని, ఇంకను బాహాటపు పరిణతికి రాలేదు. అట్టితఱి, వ్యంగ్యవైభవమును పొదువుకొని, మధురాకృతి సమన్వితముగా, శ్రీ శివశంకరులు, నితంబవతిచే, ఇందురాజుతో పలికించిన పలుకులు, మొత్తము యక్షరాత్రికి, జీవము తెచ్చుచున్నవి. అవి ఇవి—

ఇందు రాజునొద్దనున్న గ్రంథమును జూచి, నితంబవతి అనినది—

"కౌముదీ ధవళమౌ కౌశేయ బద్ధమౌ
కోశ మీక్షింపగా కోర్కె పొడముచున్నది."

(యక్షరాత్రి. ప. పూ. ము. పు. 563.)

ఇందు, కౌశేయ బద్ధము, కోశము, అనువానిని ముఖ్యముగా గమనింపవలెను.

3. కావ్యపరిగణనములోనికి రాని ఖండకృతులు వ్రాసిన కవికి గలుగు యశస్సు, తాత్కాలికముగా జనసమూహములో కనబడినను, అది చిరస్థాయి కానేరదనియు, అచిరముననే అది ఒకరీతిగా హాస్యాస్పదముగా, ఆత్మవంచనముగా కూడ, పరిణమించుననియు, ఇందురాజ కవీంద్రుని పలుకులద్వారా, సూచితమగుచున్నది.—

"చిన్ని చిన్ని ఖండకృతులు
చెప్పి కీర్తి వడసినట్టు
అల్పమోద మొందుచుండు
టాత్మవంచనమ్ము సఖా!"

(యక్షరాత్రి. ప. పూ. ము. పు. 552.)

ముచ్చటగా ఈ మూడు నిదర్శనములు చాలును. విశేషములను మాతృకలో జూడవచ్చును.

## 11

గీర్వాణభాష, నిజముగా గీర్వాణభాషయే అని, అంతకు మించిన మంచి భాష లేదని, అందు రచింపబడిన కావ్యములే కావ్యములు అని, అందు జరిపిన వ్యవహారములే వ్యవహారములు అని, కేవలము గీర్వాణభాషయే వ్యవహారభాషయు కావలెనని, శ్రీ శివశంకరుల గట్టి నమ్మిక. అది నిరూపించుచు, శ్రీ శివశంకరులు—

"సర్వతోముఖాఢ్య శక్తి
సంస్కృతమ్మునకె చెల్లు"
.........................
"గీర్వాణమునందు కవిత
కీర్తిహేతువనుట నిజము."

(యక్షరాత్రి. ప. పూ. ము. పు. 551.)

అని ఉద్ఘాటించినారు.

## 12

పాత్రలద్వారా సంభాషణమును నడపుటలో శివశంకరుల లేఖిని, ఒక విశిష్టస్థానము నందుకొన్నది. ఏవిధముగా, ఏనడకలో, మొదటి పాత్రసంభాషణమును ప్రారంభించి ముగించునో, అదేవిధముగా, అదే నడకలో, రెండవ పాత్రకూడ ఆ సంభాషణమును అందుకొని సాగించును. అనగా, ఆ సందర్భమున ఆ ఆవశ్యకతను పురస్కరించుకొని, పూర్వపాత్ర ప్రారంభించిన వృత్తాదికముల నే తరువాతి పాత్ర కూడ కొనసాగించును. అట్టి సంభాషణ క్రమములో, కావ్యవస్తువునకు ఉదాత్తత సంపాదించి, రసవంతముగ చేయుటయే గాక, పాఠకులను కూడ, తనతో రసస్థాయికి గొనిపోగల శక్తి ఇమిడియుండును.

విశిష్టస్థానమును పొందదలచిన ప్రతి కవి యొక్క కావ్యము, ఈ మర్యాదను తప్పక అవలంబింపవలయును. అందును, గీతికాసంలాపకాదికములలో, ఈరీతిని ముఖ్యముగా గమనింపవలెను.

## 13

యక్షరాత్రి, విశిష్టమైన గీతికాసల్లాపక కావ్యమని, అడుగడుగున విశదమగుచున్నది. ఇందు మరియొక విశేషముకూడ గలదు.

వస్తువు, కాలము, ప్రదేశము, అను మూడు (*Three unities*) ఈ సల్లాపకములో, అద్భుతముగా, ఇమిడిపోయినవి. ఒక్క యామమాత్ర కాలములో, మొత్తము కథ జరిగిపోయినది.

ఇట్టి నాటికలు తెలుగున లేవు. గ్రీకు నాటికలు, కొన్ని పాశ్చాత్య నాటికలు, కానవచ్చుచున్నవి.

నవ్యత్వమును ప్రతిపదమున ప్రదర్శింపగల ప్రజ్ఞ, శ్రీ శివశంకరుల లేఖినికి అలవడినది.

# కంఠధ్వని

శ్రీ కవికొండల వెంకటరావు



ఈ కథ నేను కన్నీళ్లతో వ్రాస్తూ వున్నాను. ఇదివఱలో ఎన్ని కథలు వ్రాసినా సిరాతో వ్రాశాను కాని ఈ కథ మాత్రం నేను కన్నీళ్లతో వ్రాస్తూ వున్నాను.

—గోదావరివరదనుగురించి అనేకులు అనేకవిధాలుగా ఈ మధ్య చెప్పుకోవడం, పత్రికలలో కుప్పతిప్పలుగా అచ్చువెయ్యడం అంకెలు వెయ్యడం ఏర్పాటు కావడం, చందాలు వసూలుచేయడం, వరదబాధితులకు సాహాయ్యపడ్డం, చాలామంది యీ వఱకే ఎఱిగివుంటారు. దాన్నిగురించి మఱి వివరిస్తినా ఉన్నగోడు చెడగొట్టుకోవడమవుతుంది:

దుమ్ముగూడెంనుంచి బ్రహ్మనమేధ్యం దాకా ఏర్పడ్డ మహాస్రవంతి వర్ణనాతీతం. అదంతా రెండవ మహార్ణవ మనవచ్చును. ఆమధ్యనున్న ప్రజ పడ్డ అగచాట్లు అసంఖ్యాకాలు. పశువులేమిటి, పక్షులేమిటి, పాములేమిటి, పాకలేమిటి,నరులేమిటి నానా జీవరాశి నవభీభత్సంగా తల్లడిల్లపోయింది.

కాని ఆ గండ్లెండ్లిపోయినాయి. ఇప్పుడు నేనేమైనా వ్రాస్తే, నిమ్మకు నీరోస్తూన్నట్టు చదివేవారేగాని గమ్మున గంగవచ్చేస్తూ వుందని లేచిపోరు.

“ఆనాడు గోదావరికి కాదు గండ్లు పడతా! నా కండ్లకు! వెల్లువై ప్రవహించింది నీరుకాదు కన్నీరు” అని నే నిప్పుడంటే నమ్మేవారెవరు? అయినా నా కలం ఇప్పటికీ కన్నీటముంచే వ్రాస్తూవున్నాను.

ఇప్పటికీ, అనగా మూడువారాలైనప్పటికీ, ఇల్లు తడార లేదు. ఇంటిలోపలిగోడలు, గొందిలు, బీగువాలు, పీటలు, సమస్తం గీత గీసి చూపినట్టు నీటిమట్టం చూపెట్టేని. నాని పోయిన సరుకునంతనూ ఎండబెట్టడం ఇంకా పూర్తికాలేదు. ఎండినా ఆయావస్తువులుమఱి పనికివస్తాయన్న ఆశ నాకు లేదు. అయినా నా పడకకుర్చీలోకూర్చుని నేనీ కథవ్రాస్తూ వున్నాను. పడకకుర్చీలో కూర్చుని వ్రాస్తూవున్నానన్నంత మాత్రంచేత సుఖంచే వ్రాస్తూవున్నాను అని అనుకోకండి! దుఃఖంచే వ్రాస్తూవున్నాను!

“ఎందుకు నీ కంత దుఃఖం?” అని అడుగుతారేమో! తోడిమానవుని చూచి!

ప్రకృతిముందు ఓడిపోయిన తోడిమానవుని చూచి ఈ దుఃఖమంతా నాకు కలుగుతోంది. కథకంటె కబుర్లుగా చెప్పుకుంటే మెఱుగనిపిస్తుంది! అయితే కబుర్లను మఱచిపోతాం! కథ అయితే అలా నిలిచివుంటుంది! కథకు సారస్వతలోకంలో ఒక స్థానముంది! కబుర్లకు అట్టి స్థానంలేదు. అంచేత దీనిని కథగానే ప్రపంచిస్తూవున్నాను.

గోదావరినిగురించి తలపోసేటప్పుడల్లా కవుల కొకానొక విపరీతబుద్ధి పొడమక మానదు. అసలు ఏది వారు తలపోసినా అంతే అని నా వూహ! భూమినంతనూ జలమయంచేసి ఆ జలంలో మత్స్యావతారంగా శ్రీమన్నారాయణమూర్తి విహరించినవాడన్నది నిజమేమో అని అనిపించింది ఆనాడు, అనగా 15-8-1953 వ తేదీ రాత్రి రాజమహేంద్రవరంలో! ప్రళయమన్నది అబద్ధంకాదనిపించింది. ఒక్కుమ్మడి హిమాలయపర్వతాలు అడుక్కుపోయి హిందూమహాసముద్రం లెప్పున పైకి తేలిందన్నా నమ్మేలా గగపడింది.

ఎటొచ్చీ వాన లేదు ఆ రాత్రి! మబ్బు లేదు! చుక్కలు ప్రకాశమానంగా ఉన్నాయి. గట్లను నోరాడుతూ గోదావరి ఎప్పు డీవల కురికిపడదామా అనే తుదిక్షణంకోసం వేచియున్నట్టుంది. చూచేవాళ్లకు బాగానే అనుతూవున్నది జలప్రవాహము. నడిచేవాళ్లకు పోతగట్టంతా కూడా "స్పాంజి" లాగు మెత్తమెత్తగా తట్టుతూ కాలుసాగిస్తూనేవుంది. అయితే పడుకున్నవానికి పరాకుసెప్పేవానికీమాత్రం అమ్మహాతల్లి అనిమేషమప్పుడు మత్తుమందు జల్లేసింది. గింద్లు కొట్టేసింది! ఒకచోటా? కాదు! అనేకచోట్ల! ఒక రీతి గానా? కాదు! అనేకరీతులుగా! ఇప్పుడు వాటి నన్నిటినీ, కాటారం నుంచి కపిలేశ్వరందాకా లెక్కించడం అంటూ వస్తే-అప్రస్తుతం. అవన్నీ ఈపాటికి పూడ్చేసే వుంటారు. మరిన్నీ, నదియొక్క ఉద్రుతం తగ్గిపోయినాక, నీరు, గండిపడి పడ్డదో నిండిపోయి పడ్డదో ఎవరికి కావాలి?

* * * *

కాని ఒక్కలిప్తలో ఆనాటి రాత్రి ఆర్యాపురంఅంతా జలప్రళయమైపోయింది. నే చెప్పదలచుకొన్న కథకూడా ఇక్కడ నుంచే ప్రారంభం! ఎలెక్ట్రిక్ తీగల్లోకి పిల్లకాయల "బరబర" బండ్లెక్కి కూర్చున్నాయి. గది కన్నంలోపెట్టిన తిరగటి గురుజు కిటికీలోంచి తొంగి చూస్తూవుంది. ఫెడీల్ ఫెడీల్ ఈదవడ ఆదవడ చపేటలిచ్చి, ముక్కుమీద గుద్దినట్టుగా, గుంపులుగుంపులుగా, ఏగీనదూలాలు, టేకిపలకలు, మద్దిమానులు, గుమ్మాల్లోంచి దూరి కొన్ని, కప్పులు తన్నికొన్ని, ప్రహారీ గోడలు పడగొట్టికొన్ని, ఇలా ప్రజతోపాటు పంకిలంతోపాటు తామూ పామరులే అన్నట్టు పరవళ్లు త్రొక్కసాగాయి. నడుస్తూవుంటే వెనుదఱుముకొచ్చి, "చచ్చిపోతావా? గ్రుచ్చుకుపోతావా?" అని అడిగే లా "హోరు హోరు! హుం హుం!" శబ్దం గావించుకుంటూ ఒకటేవరద! ఒకటేవరద!

అంతలో అరుగెక్కింది. మఱి కొంత సేపట్లోనే అటుకెక్కిపోయింది. అంతా నీరే

అంతాపరే! చూరులంట దొర్లిపడే నీరూ ఏటిలోకే. మేరలేకుండా జీవనాధారాలు గోలుపోయి ఏడ్చేవాళ్ల కన్నీరూ ఏటిలోకే!

ఒకడు టెలిఫోన్ స్తంభం ఎగ్రాకి చివళ్లు పట్టుకు వ్రేలాడి "వ్రేళ్లు పట్టు తప్పి పోతున్నాయి! రక్షించండ్రోయి" అని కేకే స్తూంటే అవి వినిపించుకోకుండా, కవ్వి దొలుచుకు పైకి తెప్పున తేలినట్టువచ్చి ఒక కుటుంబం కుటుంబం ఒకటే అరపంట! "ఏమండ్రోయి! ఇంటిల్లిపాదిమీ హతమై పోతున్నాము! గంగమ్మ కాహుతి అయి పోతున్నాం! మాకు ప్రాణదానం చేసే వాళ్లు లేరా? పడవలు తేరా? ఈత నేరరా? కొంప కూలిపోయేని! మేం ముంపులో పడిపోతున్నాం!" అని ఒకటే అరపంట ఆకుటుంబం కుటుంబం! మరోచోట పదు కోడానికి మంచమంటూ లేని ఒకవ్యక్తి తలుపుడూ తెత్తిమామూలు ప్రకారం ఆతలుపే తల్పంగా జేసుకు పడుకున్నాట్ట. గుండెల మీాద చెయ్యేసుకు గుర్రు పెట్టేట్ట! పగ లెంతగా అలసి వచ్చేడో పాపం!—పక్కకు తిరిగాట్ట! చెయ్యి ఆలా వేశాట్ట! తేల గొడుతూ నీరు చేతికి తగిలిందట!—ఆట్టే లోతుండదని, తేలే తలుపుమంచం దిగి నట్టు దిగబోతే—మోకాలబంటి, మొల బంటి, మెడబంటి, ఇల్లంతా వరదై యీాదించి యీాదించి పీథిని పెట్టిందట ఆకుజ్జణ్ణి మహాగోదావరి!

ఇంటిల్లా అల్లకల్లోలంగావున్నా తమ యిల్లు ఘట్టిఅని, తన యిల్లాలుకు వెయ్యేళ్లు ఆయుష్షని, తన కనలే చావు లేదని, తాను పట్టిందల్లా బంగారమేనని, వచ్చింది జంబూ నదిగాని గంగానమ్మ కాదని, అనుకొన్న వారు లేకపోలేదు. అటువంటివాళ్లయొక్క ఇల్లు, ఆఖరుకు ఆగినా, వాళ్ల పిల్లాజెల్లా సునాయాసంగా బయటపడ్డా, అతగాడికి అంతకంతకు లాభసాటిగా పెద్ద కరకట్టు కంటరాక్టో, పక్కా గుడిసెవేతబేరమో మర్నాడే తయారెడీగా చేపడ్డా లోకం ఎంతైనా అభినందనా లందిస్తుంది. కాని మరోలా జరిగి యావత్తూ విషమిస్తే విచార మన్న దెవరికి? కథవ్రాసే నాకు, కథచదివే మీాకు! అసలు వ్యక్తి పోనేపోయేడుగా ఏడవడానికి! వాని పురాతనపు టిల్లు కూలి పోవడమే మెలుగంటారు మరి పునర్నిర్మాణం చేసేవారసుల్లేక!

* * *

ఊరివీధులంట వెల్లువ. అదివరలో ఎన్నడూ కనీ విని యెఱిగున్నది కాదు. పడ వల పడిచెక్కలు, ఇళ్ల 'టెర్రేసులు' ప్రక్క ప్రక్కలుగా అమర్చబడ్డ "పారలెల్" గీతలుగా ఏర్పడి వున్నాయి. తభీమని ఒక పడవలోనికి ఒకానొక డాబామీాదనుంచి ఒక పురుషవ్యక్తి ఏభైయేళ్లవాడు దూకాడు. "రావే! నీవుకూడా దూకవే! ఇంకెక్కడిఇల్లే! ఇంటిని నమ్మకే! నమ్మకే!" అని అఱచాడు. పడవ, పురుషవ్యక్తి పడ్డ పాటుచే ఇంటికి కొంచెం ఎడమైంది. స్త్రీవ్యక్తిదూకేలో ఆమె నీళ్లల్లో పడింది. నీళ్లల్లో ఆమెపడ్డం ఏమిటి, ఇల్లుఇల్లు డాబా సమేతంగా కూలడం ఏమిటి! పడిపోతూ వున్న ఇంటికి తాళంవేసే తలంపు ఆమె కుందాఅన్నట్టు ఆమె చెంగునవున్న తాళం

చెవి ఆలా ఎగిరి గోళ్లాన్ని తగిలింది. ఆమె "డ్రెబ్స్"లో నలిగి నాశనమైనట్లు చూపలకు తోచింది. "మఱి ఆవిణ్ణి రక్షింప బోవటం అటే, పడవ పోదు! నీవుకూడా ఆమెతో పాటుచావు నపేక్షిస్తున్నావా పడు! ఈ వరదనే పడు! చూచావా? గడ కందడం లేదు" అని గడ తేల్చి, పడవలోకి గడను తీసుకు, తెడ్డు మెడ్డుకుంటూ రక్షకుడు ఆ పురుష వ్యక్తిని ఒడ్డు చేర్చాడు.

గాఢాంధకారం. ఆ పురుష వ్యక్తి ఆ పడవలో కూర్చుని ఏడ్చాడో, ఏమన్నాడో ఏలా వున్నాడో, కనిపెట్టడానికి దుస్సాధ్యము. తఱిమికొట్టే టకి దూలాన్ని తప్పించుకుంటూ, ఇరుతట్టుల్ని పడే ఇళ్లు తగులకుండా, పడవను ఆ రక్షకుడు పోనిచ్చాడు కాబట్టి, ఆ పురుషవ్యక్తి గట్టెక్కాడు.

గట్టెక్కినప్పట్నుంచి ఆ పురుషవ్యక్తి కొకే విచింతనం, తన భార్య యేమైందని. తనకంటె చిన్నదైనటువంటి, తనకంటె చలాకీదయినటువంటి, తనకంటె ఆశాలతలు అల్లుకునేటటువంటి, ఆమె తనకంటె ముందు చనిపోవడమూ? ఇల్లు పదిలపఱచుకు ఇంకా తెల్లాఱితే ఆమె తనకు కనిపించి తీరుతుందనే అతగాడి నమ్మకం. ఆ నమ్మకంతో గట్టున నిలబడ్డాడు. గట్టు ఎక్కడో గండిడి ఊరిలోనికి నీరు వచ్చింది కాని ఆ పురుషవ్యక్తి నిలుచున్నచోటున చూస్తే గట్టు మళ్ళీ ఎక్కడలేని ఘట్టీని!

భళ్లున తెల్లాఱడంలో బయలుపడే ప్రతీ చీపురు ముల్లును, ప్రతీ చీమను, ప్రతీ కట్టెపుల్లను, ప్రతీ కనులున్న మనిషినీ అడగడమే ఆ పురుషవ్యక్తి, తన యిల్లాలు అగుపించిందా అని, తన గేస్తురాలు జీవించి వుందా అని: తా నెవ్వరో ముందు జెప్పడాయిరి! తనకంటె ముందు తన భార్యను గురించి అడిగేడు. "ఎవరికెరుక యీ మహా విపదంబుధిలో" అని అనేవారే అందఱు. ఆకాశం ఉదయారుణమైంది. ఆ అరుణిమ ఇంటికప్పులమీద ప్రవహించే నీటిమీద రక్తంగా నాట్యమాడుతూ వుంది. కొబ్బరి చివళ్ళను కవ్విస్తూ వుంది. ఎక్కడన్నా ఒక పక్షి కూసేనేమోగాని, కుక్క కనబడ్డం లేదు! కోడి వినబడ్డం లేదు! పిల్లులు, పిల్లలు, ఒక్కరీతిగా మాయమైనట్లు, మరుగుపడినట్టు అయిపోయినాయి. జీవనమంతా ఒకే చేవ అన్నట్టు కలప అడితినరుకు తప్పిస్తే మఱి తెప్పున తేలిన పదార్థం ఆ జలంమీద కనబడలేదు. సూర్యబింబం తెలుపెక్కింది. లాంచీలు వీథులంట నడడుతూ మెఱిసిపోతున్నాయి లాంచీల కంటె వరుసలుతీరి అద్దె పడవలు, అధికారి పడవలు వరదబాధితులకు సాయపడ్డానికి గాను అమారుగా వున్నాయి.

కాని మన మనుకొనే పురుషవ్యక్తిని ఏవీ గాని తలపోయడంలేదు. ఏవిగాని వాని దరిదాపునకు చేరుకోవడంలేదు.

పురుషవ్యక్తి పేరు భూపయ్య. భూపయ్య చూపించడానికి గాని కాపించడానికిగాని తన చేత రూపాయ లేదుగదా చిల్లిగవ్వైనా లేకుండా వున్నాడు. కట్టుగుడ్డలతోను కడప్రాణంతోను కడచిన రాత్రి అతడెలా రక్షింపబడ్డాడో మన మీవలకే

చూచాం! అతని కనుసన్నల్లో ఆదాకా మసలిన కాంత పేరు కళ్యాణమ్మ. ఆదాకా మసలిన కాంత అని ఎందు కంటూవున్నా నంటే మఱి చెప్పకోడాని కామె కళేబరం కూడా కనిపించడం లేదుగా! కాని ఆమె చనిపోయిందంటే భూపయ్యకు నమ్మకం లేదు. ఆ కారణంగా గట్టు వీడి మఱో పట్టుకు పోడు. అతగాడి చూపెంతసేపూ వీధులంట కొత్తగా ప్రవహిస్తూవున్న గోదావరీ ప్రళయతాండవంమీదనే వుంది.

"ఒక్కరన్నా ఆమె జాడ చెప్పేవారు లేరా? వీరా? వారా?" అని వాపోసాగాడు. "అంత చేటు వాపోయేవాడవు అసలు ఆమె నెడబాసి ఎందుకు వచ్చావయ్యా!" అంటే, "నన్ను పడవలో పడేసి, ఆమెను నీట పడేసిన ఆ దౌర్భాగ్యుణ్ణే అడుగు" అనేడు. కళ్లు లోపలకు పోతున్నాయి. ఆకలీ దప్పీ తీర్చుకోకుండా అటమటించేడు భూపయ్య.

భూపయ్యలాంటివాళ్లింకా ఎందరున్నారో ఈలోకంలో గట్టెక్కి ఏడ్చేవాళ్లు? భూపయ్య ఎలుగెత్తి అరచిన అరపుచేత అతగాని కంఠం బొంగురుపోయింది.

ఒక గంగా భాగీరథీ సమానురాలెవర్తో అలాపోతూ "నాయనా! ఎవరికోసం ఏడుస్తున్నావు?" అని అడిగింది. "ఆమె కోసమే!" అన్నాడు. "ఆమే లాగుంది, పడిపోయిన ఇంటిమీదనో ఇంటి క్రిందనో కుంయి కుంయి మన్నట్టయింది. ఆ రుతం దయ్యానిదనుకున్నాను. నిన్ను చూచాక బ్రతికున్న సుమంగలిదేనని అనిపిస్తోంది." అని జవాబు చెప్పింది. ఆ చెప్పిన ఆవిణ్ణి మఱి ప్రశ్నలు వెయ్యాలీ అంటే నూటొక్క ప్రశ్న వెయ్యెచ్చు. "నీకెక్కడ కనబడింది? నీ వెప్పుడు చూచావు? నీ వెల్లా గొంతు గుర్తించావు? నీవు ఏలా వెళ్లి ఏలా మళ్ల గలిగావు? నట్టేట కట్టినట్టున్న నా కొంప గుట్టు నీ కెలా తెలిసింది?" అని యిన్ని ప్రశ్నలు వెయ్యెచ్చు. కాని భూపయ్యకు మఱి ఆమె నడుగ బుద్ధి పుట్టలేదు. ఆమె అక్కడ మఱి నిలుచుండనూ లేదు. భూపయ్య చూపప్పుడే ఒక ఆమడ దూరం మఱో తట్టుకు ప్రాకిపోయినట్టు పోయింది. ఈ కొత్త స్త్రీ యొక్క వెన్ను పోల్చి బిగ్గఱగా అఱచేలో ఆమె వినిపించుకోలేదు. ఆమె వీనికి మఱి కనిపించనూ లేదు. అయితే తన భార్య ఉందన్న, బ్రతికి బాగావుందన్న నమ్మకం మాత్రం భూపయ్యకు ఆమె అన్న వాక్యంవల్ల ఇనుమడించింది. కుంయి మన్నది కుక్కా కావచ్చు, నక్కా కావచ్చు నమ్మకం లేనివాడికి. కాని భూపయ్యకు మాత్రం కళ్యాణియే!

కళ్యానికో ముప్పై అయిదేళ్లుంటాయి. లావణ్యం లాలిత్యం రెండూ కూడా ఆమె సొమ్మే. కళేబరమన్నా కనబడితే చాలన్నసే ఊహలో పడి భూపయ్య ఒక పడవ వాణ్ని తన యింటివద్దకు తీసుకు వెళ్లమన్నాడు. పడవవాడు "కళేబరమేం ఖర్మం. కంఠమే వినబడ్డప్పుడు! పది రూకలు ఇవ్వండి!" అన్నాడు. పది రూకలు కావుకదా పది నూకలు లేవు భూపయ్యవద్ద ఆ పొద్దు.

పైపెచ్చు నోట మాట రావడంలేదు. కేవలం సంజ్ఞామాత్రంగా బతిమాలుకున్నాడు. బతిమాలుకున్నా ఆ కర్కోటకుడు "ఊరికే అన్నాను గాని ఇంకెక్కడి ఊరయ్యా? ఊరుఊరు మునిగిపోయింది. చూస్తే కానం. నీ సూదంటురాయి దానంతటదే దొఱకాలి కాని మఱి నెమకితే దొఱకమే" అన్నాడు. భూపయ్య మఱో పడవవాణ్ణి పట్టుకు పాకులాడాడు. వాడూ మొండిచెయ్యి చూపించాడు. తిన్నగా ప్రభుత్వోద్యోగిదగ్గిరికి వెళ్లిమనవి చేసుకున్నాడు. అతగాడు కూడ ఆఖరుకు లేనట్టే, తనవల్ల కానట్టే చెయ్యి వెలకలేశాడు. "అసుర సంజ పడిపోతూవుంది. ముసురుకూడా పట్టేటట్టుంది. పొద్దున్న తెల్లాఱక రోచిద్దాంలే" అన్నాడు ఆ పెద్ద జీతగాడు.

భూపయ్యకు పట్టరాని కోపంవచ్చింది. కొట్టబోయినంతగా చెయ్యెత్తి మళ్ళీ ఆ చెయ్యే అటుపోయ్యేదాన్ని ఇటు తీసుక తనఫాలాన్ని మొత్తుకొని "అయ్యో! కళ్యాణీ! కళ్యాణీ!" అన్నాడు. "గట్టెక్కే ముందేమైంది యీ ప్రలాపం?" అని గద్దించాడు ఆ ప్రభుత్వోద్యోగి. "ఇప్పుడన్నాస్వామీ! తరుణం మించలేదు" అన్నాడు భూపయ్య కన్నీళ్లు కార్చుకుంటూ. ప్రభుత్వోద్యోగికి జాలేసింది. "కంఠం వినబడి కళేబరం కనబడకపోతే మఱింత బాధే?" అన్నాడు ఆ ఉద్యోగి. "కళేబరంకనపడి కంఠం వినబడక పోయినా బాధే" అన్నాడు ప్రభుత్వపు నావికుడు. "ఏమైనా వెళ్ళి చూచి కనుగొన్నాక కదా అనుకోవలసింది." అన్నాడు చేరువనున్న నిర్వాసి ఒకడు. భూపయ్య నిట్టూర్పు వొకటి విడిచాడు. ఆ నిట్టూర్పుకు పడవలన్నీ కదిలినట్లయ్యాయి. వరద చిరుకెరటాలు చిందులుత్రొక్కినట్లుంది. ప్రభుత్వపు పడవలోకి నిర్వాసి దూకుతూ "నేనుతోడుంటాను. చూపించు!" అన్నాడు భూపయ్యతో. ప్రభుత్వపు పడవ ఆసామీ తెడ్డు వేశాడు. ప్రభుత్వోద్యోగి "ఇటో అటో తేల్చుకురావాలి అర్ధరాత్రైనాసరే" అని ఆజ్ఞ ఇచ్చాడు. తాను రేవులో వేచియున్నాడు.

"ఏగంగా భాగీరథీ సమానురాలు నీతో చెప్పింది?" అని అడిగేడు పడవలో నిర్వాసి. "ఒకరు చెప్పేదేమిటి? అదిగో అఱపు, అదిగో నా కళ్యాణిమొఱ". అన్నాడు భూపయ్య. నిర్వాసి ఆకాశంవంక చూచాడు. ఆకాశం ఉఱుములతో మెఱుములతో అలజడిగొన్నట్టుంది. మెఱుపు మెఱుపుకీ ఉలిక్కిపడేడు భూపయ్య. "అదే మా యిల్లు! ఇదే నా వెల్లి?" అని ఏదో ఉన్మాదునిలా అన్నాడు. పడవవాడు "ఈ గేస్తుగానికేం తెల్దు. మనం పోదాం!" అన్నాడు నిర్వాసితో. నిర్వాసి "పోతే ఏలా? ఆమె కళేబరాన్నో కంఠధ్వనినో ప్రభుత్వోద్యోగికి చూపించాలి!" అన్నాడు. పడవవాడు "కళేబరాన్ని చూపించగలం గాని కంఠధ్వని నెలా చూపిస్తాం?" అన్నాడు తెడ్డేత కుదించి.

ఏదో తెడ్డుకు తగిలింది. అది కళ్యాణి తలకట్టా? ఏదో నావయొక్క చుక్కాని కడ్డపడింది. అది కళ్యాణి ఎముకా?

ఎలుకా? ఇలా సందేహించుకుంటూ సందేహంతీరకుండా ఆ పడిపోయిన యింటి జాడ చుట్టూ నావతో ప్రదక్షిణం చేసి నావతోనే ఇంటికప్పుమీదను అడ్డుగీతలు నిలువుగీతలు గీసి, గీట్లుదాటి ప్రవాహాన్ని తరిమి తునకు దేన్నీ సాధించలేక ముగ్గురూ కూడా నావలో చతికిలబడిపోయారు.

"మతి భూపయ్యా! కళేబరం కనిపించకపోతే పోయిరి! నీవన్న కంఠధ్వనిమైనా వినిపించవద్దూ?" అన్నాడు నిర్వాసి. భూపయ్య "కళేబరం కనబడగలిగితే కంఠధ్వని కూపిరి నేనే పోయగలను" అని నిర్వాసికి కాక పెడజవాబు చెబుతూ రెండో పెడకు తన అరచేతులు బూరాగా ఊదాడు "కళ్యాణీ! కళ్యాణీ! నీ వెక్కడైనా ఉంటే పలుకు! కూయిడ్డావుటగా! ఆమె చెప్పింది. ఏ "డెబ్రిస్" క్రిందైనా వుంటే పలుకు! నిన్ను పైకి లేవనెత్తడానికి పడవేసుకు వచ్చాను—ఇంకెక్కడి కళ్యాణీ? కళ్యాణీ! కళ్యాణీ!" అంటూ పడవలోనే మూర్ఛిల్లాడు భూపయ్య. నిర్వాసి "భూపయ్యా! మనం ఆ గంగా భాగీరథీ సమానురాల్ని కూడా యీ పడవలో కెక్కించుకుని "కుంయి" విన్నస్థలం తెలుసుకుని ఉండవలసినది. "ఇదేనా కళ్యాణి పడిన జాగా?" అని అడిగాడు. అప్పటికప్పుడే భూపయ్యకు స్పృహ తప్పింది. పడవవాడు "ఈ భూపయ్యే పోయినాడు తనకంటె ముందుగానని ఆ కళ్యాణమ్మగారే ఆలా అవతార మెత్తి ముండమోపు మోసియుండవచ్చు. ఈ వరదలో ఎవరు ముందఱ పోయేరో ఎవరు వెనుక పోయేరో ఎవరు ఎవరికి చెప్పి పోయారు? అన్నాడు. అంటూ పడవను వెనుద్రిప్పాడు.

పడవ వెనుదిరగడంలో పడవ పొడుగునా అడుగున ఏదో ధ్వనించినట్టయింది. ఆభరణాల్లా అగపించినట్టయింది ఎర్రగా కుంకుంపట్టై అలుక్కుపోయి. "ఒరొయ్యాయి! పడవక్రింద తగిలినట్టుగా వుంది కళ్యాణమ్మ కళేబరం!" అన్నాడు నిర్వాసి ఆ పడవ ఆసామీతో. భూపయ్య ఆ మాటతో స్పృహ దేతి "దొరికిందా? కళేబరం! నా కళ్యాణి కళేబరం!" అన్నాడు.

"కళేబరం దొరికిం దంటేనే ఇంత సంతోషించేడు భూపయ్య. కంఠ ధ్వని వింటే ఎంత సంతోషించేవాడో" అన్నాడు నిర్వాసి. "కంఠధ్వని! కంఠధ్వని! దాన్ని ఎన్నిసార్లైనా వినగలను. కళేబరాన్ని చూచేది ఇదే కడసారి! కడసారి! కడసారి!" అని విస్తుపోతూ, తన భార్యయొక్క కళేబరాన్ని పడవవాడూ నిర్వాసీ పైకెత్తి పట్టి పడవలో పెడుతూవుంటే, భూపయ్య వలవల ఏడ్చాడు.

---

# స్వాతంత్ర్య చంద్రిక



శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

విశదంబైన ప్రకాశభావ మెసఁగన్ విచ్చేసె నేకాదశీ
శశిబింబాంధ్ర నవాంశువుల్ జలధరచ్ఛాయానిరాసక్రియా
కుశలంబుల్ నిశియెల్లనుం బగటివెల్గుల్ గాఁగ నాశాధ్వనీ
న శరత్కాశ సుమాభమంజరులు మింటన్ దోరణాల్గట్టఁగన్

రాజకళయెల్ల దమయుందె రాజిలంగ
శారదిక తారకా ప్రజాస్వామికముగ
వెలలివచ్చిన జిల్గువెన్నెలల ప్రాత
కలక తేరెను దెల్గు మాగానిచేలు.

ఎలయన్ వెన్నెలలంచుఁ జెప్పుటయె కానీ! యివ్వి, పువ్వారు త
న్మూల పూర్వాంధ్రధరాధినాయక శిరఃకోటీరవైడూర్య కాం
తులలో వెల్గులు వల్గుచాలనఁపుఁజిందుల్ గాఁగఁ గాలంబు నం
దులలోనుండి వినిర్గమించెడు నవేందుస్వచ్ఛకాంతుల్ బలెన్.

కదలిన పండువెన్నెలలు గాఁగ నెవండో మహోపవాసియై
వదలిన ప్రాణసంతతులు వచ్చినఁ దెచ్చినకాంతి గాఁగ నం
బుదములు నడ్డువచ్చిన వె మున్నిపుడెంతయుఁ బొల్చె, నల్లె, సం
పద లరుదేరినంతటన బందుగు లౌదుర జ్ఞాతి శత్రువుల్.

బలిసి చకోరసంతతులు పచ్చిన వెన్నెల సొమ్ము చేసికో
వలయున క్రొత్తవెన్నెలల వాగులు కట్టలుకట్టి తిర్పు బో
దెలు నవరించి నద్దెసలఁ దెచ్చిన సాధుసుధాఫలో దయో
జ్జ్వలముగ మల్లమల్లగఁ బ్రశాంత, వియత్పదమెల్లఁ దోచఁగన్.

విశ్వనాథుని తనూ విభవముగ్ధచ్ఛటా
వలులతో వెన్నెల సత్తులాడి
శంకరాచల మహా సానుప్రదీప్తని
ష్కూటములన్ గుజ్జనగూళ్లు మెసవి

# "ఇది నిజము...

...మీరు లక్స్ టాయిలెట్ సబ్బుతో
ఇంకా మనోహరముగానుండవచ్చును"

అని సావిత్రి
చెప్పుచున్నది



నిజముగా ఫలకరమైన నియమము తప్పని సౌందర పద్ధతి ఇదిగో: "సువాసనతో గూడుకొన్న మీగడవంటి లక్స్ టాయిలెట్ సబ్బు నురుగును నేను నా చర్మముమీద బాగా రుద్దుతాను. తరువాత నేను కడుగుకొని ఒక మెత్తని తువ్వాలుతో అద్దుకొనగానే నా చర్మము ఒక క్రొత్త అందమును తెచ్చుకొనును." అని సావిత్రి చెప్పుచున్నది.




## లక్స
## టాయిలెట్ సబ్బు

సినీమా తారలకు
సౌందర్యమునిచ్చు సబ్బు

LTS. 377-X30 TL.




శ్రీ పంతుల శ్రీరామశాస్త్రి



"అంతే నంటావా? అన్నయ్యా! నువ్వు మరొక్కమారు ఆలోచించలేవా?" "ఆలోచిస్తానంటే ఇప్పుడే తొందరలేదు. నువ్వు ఊరునుంచి తిరిగివచ్చేవరకు నేను ఆగగలను" అన్నాడు వేణుగోపాల్.

రామకృష్ణ ఏమీ మాట్లాడకుండా దళసరి కళ్ళజోడు అద్దాలను చేతి రుమాలుతో తుడవసాగాడు. అతని సమాధానం నోటితో చెప్పిన దానికంటె స్పష్టంగా తెలిసిపోయింది గోపాలానికి.

రామకృష్ణ కళ్ళజోడు పెట్టుకొని చేతివాచీ వంక, గోడనున్న గడియారం వంక చూసేడు; రెండూ అయిదు నిమిషాల తేడాలో నడుస్తున్నాయి. ఇదివరకెన్నడూ ఈ రెంటి నడుమ రెండు మూడు నిమిషాలకంటె వ్యత్యాసం ఉండడం మామూలు లేదు అనుకొంటూ తమ్ముడి ముఖం వంక చూసేడు. ఆ చూపు అర్థమేమిటో బాగా తెలిసిన గోపాల్ తనకి ఉన్న కొద్దికాలాన్ని సద్వినియోగ పరచుకోనే పట్టుదల చూపలేదు. దగ్గర దగ్గరగా ఒక నిమిషం కాలం మాట్లాడకుండా కూర్చొని, నెమ్మదిగా లేచి, పడిపోతానేమో అన్నట్టుగా టేబిలును ఆనుకొని, "మరి వెళ్తా నన్నయ్యా! నీకు అవతల రయిలుకి టయిమయి పోతున్నట్టుంది. ఈ వచ్చే ఒకటవ తేదీనుండి మరి మనియార్డరు పంపించకు, నేను మరి కాలేజీ విడిచి పెట్టేసినట్టే." అని అన్నయ్య సమాధానానికి ఎదురు చూడకుండా తలవంచుకొని ద్వారం దాటి వెళ్ళిపోతున్నాడు వేణుగోపాల్. "గోపాల్" అని అరిచాడు అతి అసహజమయిన గొంతుతో రామకృష్ణ. వెనక్కు తిరిగివచ్చి ద్వారం దగ్గరనే నిలబడి "పిలిచావా అన్నయ్యా!" అన్నాడు గోపాల్.

రామకృష్ణ కళ్ళజోడు తీసి టేబిలుమీద పడేసి, కోటు అంచులు రెండూ రెండు చేతులతో పట్టుకొని, అటూ ఇటూ తిరగసాగాడు. కొద్దిక్షణాలు ద్వారం వద్దనే నిలబడి, "పొరపాటున పిలిచావనుకొన్నా నన్నయ్యా! మరి నేను వెళ్తాను" అన్నాడు.

అతని మాట పూర్తికాకుండానే ఉరుమురిమినట్టుగా రామకృష్ణ: 'పిలిచానట? ఎందుకు పిలవాలి? ఏమని పిలవాలి? అసలు పిలిపించుకొనే వీలుంటే కదూ! ఇక నే నన్నయ్యనా? నువ్వు తమ్ముడివా?'

"ఇన్నాళ్ళు పెంచి పెద్దచేసేవు, ఈనాడు నా తెలివితక్కువ నీకు దుర్భరంగా అనిపిస్తే మాత్రం నేను నీకు తమ్ముణ్ణి కాకపోతానా?" ఈ మాటలు అంటూ తనకు తెలియకుండానే గోపాల్ గదిలోపలికి ప్రవేశించాడు.

రామకృష్ణ నడక ఆపి, తమ్ముడివంక చూడకుండా, కిటికీదగ్గర నిలబడి, తోటలోని గులాబీ మొక్కను చూస్తూ, "ఇప్పటికి రెండేళ్ళయింది ఈ మొక్కను నాటి. ఇంత కష్టపడినందుకు ఇన్ని ముళ్లు పెరిగాయి తప్ప, ముచ్చటకు ఒక్క పువ్వు పుయ్యలేకపోయింది. స్వార్థపరత్వం మనుష్యులలోనే కాదు, చెట్లలో కూడా నిండిపోయింది."

"అన్నయ్యా నువ్విలా కవిత్వమూ వేదాంతమూ మాట్లాడితే నేనేం చెప్పలేను. నాలో నిన్ను నొప్పించాలనే కోరిక, లవలేశమైనా లేదని నీకు తెలుసును. అయితే ఇప్పుడీ సందర్భంలో నేను నీకు సంబంధించి ఆలోచించలేకపోయేను. ఆలోచించినా..."

"ఎందుకు ఆలోచించాలి? అను. అసలు బుద్ధి తక్కువ మాది."

"నిన్ను నువ్వేవిూ నిందించుకో నక్కరలేదన్నయ్యా! చిన్ననాటినుండి నేటివరకే కాదు, ఏనాటికైనా నువ్వే నాకు ఆదర్శమూర్తివి. అయితే నాలో ఎన్నెన్నో లోపాలున్నాయి. వాటన్నిటినీ ఇన్నాళ్లూ కేవలం నిన్ను సంతృప్తిపరచాలనే ప్రధాన ఆశయపు ప్రాబల్యంవలన దాటుకొని వచ్చేను. నీకోసమే కాకపోతే, బొమ్మలు గియ్యడంకోసం ఏనాడో చదువు మానుకొని ఉండేవాణ్ణి—పార్టీ భక్తి అనే పేరుతో అథమం జైలుకి వెళ్ళిఉండేవాణ్ణి... ఇంకా ఎందుకు చెప్పడం, ఎన్నెన్నో నీ దృష్టిలో అత్యంత అసమర్థులయినవాళ్లు చెయ్యవలసిన పనులు చేసిఉండేవాణ్ణి—అయితే బొమ్మలు వెయ్యలేదు, కవిత్వంలో లీనం కాలేదు; మంచి సంగీతాన్ని ఆరాధించలేదు; లోపలి సహజమయిన చలన శీలానికి బిగించిన బందుకట్లు సడలనీయలేదు. ఏం చేసేను, నాకు సహజంగా అణుమాత్రమయిన ఇష్టంలేని, గౌరవంలేని పుస్తకాలను, కేవలం మార్కులు సంపాదించే దృష్టితో వల్లెవేస్తూ వచ్చేను; ఒకరోజు కాదు రెండురోజులు కాదు, ఇన్ని సంవత్సరాలుగా తంటాలు పడుతూ వచ్చేను. ఎందుకిదంతా? తక్కినవన్నీ నాకెంత సహజమయినవీ ప్రియమయినవీ అయినా, అన్నిటికంటె నాకు ప్రధానంగా కోరదగినది నీ అభిమానమే గనుక—ఇప్పటి ఈ సందర్భం ఇది నా తలకు మించినది. నేను చెయ్యగల ననుకొన్న ప్రయత్నం అంతా చేసేను. కాని, ఏదో, నాకంటె బలమయిన శక్తి నన్ను ఈడ్చుకొని పోతూంది."

"తెలివితక్కువపనులు చేసేవాళ్లందరూ చెప్పే సమాధానమే ఇది. స్వార్థపరత్వం జీర్ణించిపోయినప్పుడు......"

"సగంలో ఆపేసేవే మన్నయ్యా!"

"మరి చెప్పడానికేముంది, నువ్వు వెళ్లు. నన్ను బాధపెట్టడానికి కాకపోతే ఇప్పుడిలా చదువు మానుకొని, ఎవత్తెనో లేవదీసుకొనివచ్చి, నా అనుమతీ సహాయం అడగడంలో అర్థం ఏముంది? ఎన్ని పేక మేడలు కట్టుకొన్నాను నీగురించి. నా చదువుకొనే రోజుల్లో బట్టలు పుస్తకాలు మాటకేం, కడుపునిండా తృప్తిగా తిండితిన్న సందర్భాలుకూడా వేళ్ళమీద లెక్కపెట్టదగినవి మాత్రమే. నా స్వంత పుస్తకాలు లేకపోడమే కాదు, నాది అని దీపం పెట్టుకోండికి కూడా లేక, వీధిలాంతర్ల వెలుగులో చదువుకొన్నాను. స్కూలు జీతానికి డబ్బు సంపాదించడానికి నేను పడిన అగచాట్లు భగవంతుడికి తెలుసును. అటువంటి పరిస్థితులలోకూడా శెలవులలో వచ్చినప్పుడు నీకు ఆటవస్తువులు బట్టలు తీసుకొని రావడానికి ఆకలిని కూడా చంపుకొనేవాణ్ణి. నా ఆశయం ఒకటే, నన్ను నమిలిమింగుతున్న కష్టాలస్ఫురణ అయినా లేకుండా నా తమ్ముణ్ణి పెద్దవాణ్ణి చెయ్యాలని. నేను సాధించలేని ఎన్నెన్నిటినో నా తమ్ముడు సాధించి తీరాలని. నా తమ్ముడి భవిష్యత్తు ఉజ్జ్వలంగా ఉంటుందన్న తృప్తికరమయిన హామీకోసం, అవసరమయితే హాయిగా విషమయినా పుచ్చుకొని ఉండగలిగేవాణ్ణి."

"అన్నయ్యా, అన్నయ్యా! నేనంటూ ఒకణ్ణి లేకపోతే, నీ జీవితం ఎంతహాయిగా ఆనందమయంగా ఉండిఉండేదో? నేనే తెలివితక్కువవాణ్ణి. చిన్నతనంలోని, నా సరదాలలో ఏఒక్కదానికో నిర్మొగమాటంగా జీవితం అర్పించిఉంటే, నీకు ఇంతగా విచారం లేకపోయి ఉండును. నాలోని నిజమయిన గోపాల్ వేరు, నీకు కనిపించే మనిషి వేరు. ఎప్పటికప్పుడు నిన్ను అసంతృప్తి పరుస్తాననే భయంతో, నిన్ను మోసపుచ్చడం జరిగింది. గాని, నీ ఆశయాలకు అనుగుణంగా ప్రవర్తిస్తున్నట్లుగా నువ్వనుకొంటున్న గోపాల్ నాలో లేడన్నయ్యా; ఇంతకాలంగా నిన్ను వంచిస్తూ వచ్చిన వంచకు డేనయితే నేమి విచారం నీకు. ప్రస్తుతపరిస్థితులలో నాకు నీ ఆర్థిక సహాయంకంటె ముఖ్యమయినది, ఏమయితే కానీ అవి నన్ను నా కర్మానికి విడిచిపెట్టడమే."

"విడిచిపెట్టక నిన్ను పట్టుకొని నిలవదీస్తున్నవాళ్లెవరు? పో, నీకర్మంనీది, నాకర్మంనాది."

"అదే నా భయం, నన్ను పొమ్మని, తరవాత నాగురించి అనవసరంగా దిగులుపెట్టుకొని నీరసించిపోతావని. నాలో లేని గొప్పదనం నువ్వెంతకని తీసుకొనిరాగలవు? సబ్బు బుడగ పెద్దది పెద్దది అవుతున్నకొద్దీ పగిలిపోయేపరిస్థితికి మరీ దగ్గరవుతూందన్నమాట! అది ఎంతవేగంలో పగిలిపోతే అంతమంచిది; అటు

వంటిదానిమీద పెద్దపెద్ద ఆశలు పెట్టుకోడంలో ఏమి సౌఖ్యం ఉంది?"

"సౌఖ్యమే, నా బ్రతుకంతా సౌఖ్యంకాక మరేమిటి? అట్టడుగుమెట్టున గుమాస్తాకంటె తక్కువ స్థితిలో ఆరంభించాను. ఈ పదిసంవత్సరాలూ నా పెళ్ళి, సంసారమూ సౌఖ్యమూ అనేవి లేకుండా ఎందుకున్నానో, అందులో నా స్వార్థం ఎంత ఉందో...హు, తెలియనివాడికయితే చెప్పడం"

"నిజమేనన్నయ్యా, నాకు తెలుసును, కానీ స్వార్థరాహిత్యంలోని ఔన్నత్యంగురించి. కాని నాగురించి, నేటివరకూ నీకు తెలిసింది చాలాస్వల్పం. నీతమ్ముడు గోపాల్ లో నువ్వు చూస్తున్న తెలివయినవాడు, భవిష్యత్తులో అతిఉజ్జ్వలంగా ప్రకాశించవలసిన కార్యశూరుడూ నూటికి అయిదారుపాళ్ళకంటె లేడు. అయితే పవిత్రమయిన నీఇచ్ఛాశక్తి ప్రాబల్యం ఎంతటిదంటే, నాకంటె ఎంతో తెలివయినవాళ్ళని నాకు తెలిసినవాళ్ళని, మార్కులపోటీల్లో అతి సులభంగా ఓడించగలిగేను. నాలోని అవగుణాలనన్నిటినీ బైటికి రానీయకుండా అణచి ఉంచగలిగేను. లేకపోతే చూడు అన్నయ్యా నువ్వు నాకంటె పది హేనేళ్ళు పెద్దవాడివయిఉండికూడా నేటివరకూ నా భవిష్యత్తుని దృష్టిలోపెట్టుకొని, పెళ్ళిచేసుకోడం మానుకోగలిగావు. పోనీ అలాగని, మరేమయినా లోకులు మాటలు అనుకోవలసినట్టుగా ప్రవర్తించావా? నిన్నొక ఋషి అని లోకం చెప్పుకొంటుంది. కాని చూసేవా అన్నయ్యా— నేను నీ తమ్ముణ్ణి అని నేనే నమ్మలేను. చిన్నప్పటినుండి బొమ్మలమీద దృష్టి ఉంచడంచేత కాబోలు, నాకు స్త్రీల అందంమీద ఇంత కోరిక ఏమిటో చెప్ప— నాకు తెలుసును, ఇదంతా తెలివితక్కువ, క్షుద్రమయినది, చంచలమయినది అని. కాని, ఏం లాభం? నా శరీరం దానితోపాటు నా మనస్సు నాస్వాధీనంలో ఉంటే కదూ. ఇదివరకూ నీకు చెప్పలేదు. ఇప్పటికి, రెండుమార్లు ఆత్మహత్యా ప్రయత్నాలు చేసేను, నీకు తెలియదుగాని. ఒకమారు పరీక్షకి ముందురోజు రాత్రి అంతా కొత్తగా వచ్చిన ఒక నవల చదవడంలో పడి, నూటికి నూరు మార్కులు తెస్తానని నీకుమాట ఇచ్చిన లెక్కల పేపరు సగానికి సగం తగలేశాను. చూస్తున్నంతసేపూ, తొలినాటి రాత్రి చదివిన పుస్తకంలోని మనుష్యులే కనిపిస్తూ ఉంటే. ఆవేళ సాయంత్రం రైల్వేలైన్ల వేపు వెళ్లేను అంతా నిశ్చయం చేసుకుని. నేను బ్రతికిఉండి, అనుదినము నీకు కలిగించే ఆశాభంగం ఎక్కువదా? లేక ఒక్కమారుగా చచ్చిపోయి కలిగించే మనోవ్యథ ఎక్కువదా నిర్ణయించుకోలేకపోయేను. దూరాన రైలుకూత వినిపించేసరికి ఇటు పరుగు లంకించుకొన్నాను. కాని, ఎవరో బలంగా వెనక్కి లాగుతున్నట్టే కనిపించింది. అక్కడేగాని రైలు వచ్చేవరకూ ఉంటే, అది బలవంతంగా నన్ను కత్తిరించివుండును. ఆతరవాత కొత్త సైన్సు విద్యార్థి అనిపించుకొందికి వీలుగా, పొటాసియమ్ సైనేడు హైడ్రోక్లోరిక్ ఏసిడ్ కలిపి, హైడ్రోసైనిక్ ఏసిడు తయారుచేసేను.

క్రొత్త బ్లేడు తీసి చేతిమీద గంటు పెట్టుకొన్నాను. కాని, చిట్టచివరి క్షణంలో మళ్ళీ ధైర్యం చాలింది కాదు......అసలు కారణం నీకు చెప్పనే లేదు. చెప్పేస్తాను. అందుకల్లనయినా, నామీద నీకు గల అనవసరపు ఆశలు అపోహలూ అంతరిస్తాయేమో?...ఆ మనిషి ఏమీ అందమయినది కాదు, వివాహితురాలు, నాకంటె పెద్దది కూడాను. ఆమె భర్తకి నా పాటలంటే ఇష్టం. నన్ను పిలిచి పాడిస్తూ ఉండేవాడు. నాగురించి ఊరందరితోనూ ఎంతో గొప్పగా చెప్పుకొనేవాడు ; అటువంటి వాడికి ద్రోహం చేసేనంటే ఏమిటి చెప్పడం. మొదట్లో నాలో ఉత్సాహమూ, కోరికా లేకపోలేదే, నా సామీప్యంలోని క్షుద్రత్వం, లౌల్యం, చాపల్యం మొదలయిన నికృష్టభావాలు—లేకపోతే, అసలు నేననేవాణ్ణే లేకపోతే, ఆవిడలో అటువంటి హీనమయిన తలపు ఎందుకు కలుగుతుంది? అతను తలుపు పిలిచాడు, ఆవిడ నిబ్బరంగా తలుపుతీసి, "గోపాల్ కి అకస్మాత్తుగా పెద్ద తలనొప్పి వచ్చింది. పడుకోమన్నాను. గట్టిగా మాట్లాడకండి. ఇప్పుడు కొంచెం సర్దుకొంటున్నట్టుంది. అయినా కొంచెం అమృతాంజనం తెచ్చిపెట్టకూడదూ" అంది. అతడు పాపం అలాగే మళ్ళీ వీధిలోకి వెళ్ళి బజారులో తలనొప్పికి దొరికిన మందులన్నీ పట్టుకొనివచ్చేడు. నా మనస్సు కొంతసేపు ఆలోచించే శక్తిని కోల్పోయింది. ఆతరవాత చేసిన ప్రయత్నం ఏవిధంగా వ్యర్థ అయిందీ నీకు చెప్పాను. అందుకే శెలవులంతా అక్కడే ఉండి చదువుకొంటానన్నవాణ్ణి ఆరాత్రే బయలుదేరివచ్చా. మళ్ళీ సంవత్సరం అక్కడే బాగుంటుందని నువ్వెన్ని కారణాలు చెప్పినా కాదని మరొక ఊళ్లో చదువుకి వెళ్లేను—ఇందాకా ఒకటే నిశ్చయం చేసుకొని లేచిపోయేను, గాని, మళ్లీ ఇంతసేపు మాట్లాడేక ఆశ కలుగుతున్నది. చూడు, నాలో ఎలాగూ నువ్వనుకొన్న గోపాల్ లేడు. నేను నేడు కాకపోతే ఏనాటి

కయినా నాలోని తెలివితక్కువకీ, దౌర్బల్యానికీ లొంగిపోవలసిన వాణ్ణే—అటువంటిది, లోగడ తటస్థించినటువంటి వికారమయిన పరిస్థితులు మళ్ళీ తటస్థించకుండా ఉండాలంటే, నేను వేరే స్వతంత్రంగా ఉంటే మరి లాభం లేదు. అదృష్టవశాత్తు, నాకీ లీల అనే మానవ స్వరూపంలోని దేవత దొరికింది. ఆమె నాకంటె ఎంతో తెలివయినది, ప్రపంచజ్ఞానం గలది; ఎక్కువమంది పిల్లలున్న కుటుంబంలో పెరిగి పెద్ద కావడంవల్ల ఆమెలో సాధారణమయిన స్త్రీత్వం కంటె మాతృత్వమే ఎక్కువ ఉందనిపిస్తుంది. నాకు కావలసినదికూడా అదే. అటువంటి వాళ్ళు ప్రపంచంలో నూటికి కోటికి ఎక్కడో ఉంటారు. ఉన్నా, వాళ్ళను మనం సకాలంలో కలుసుకోవడం అన్నది కేవలం దైవికమయిన భాగ్యవిశేషమే."

"ఇటువంటి చాపల్యం ఉన్నవాడికి ప్రతిదీ దైవనిర్ణయమయిన భాగ్యవిశేషమే. కనిపించిన ప్రతి మనిషి గురించి ఇలాగే అనుకోవచ్చును. ఎందరు అందమయిన అమ్మాయిలు లేరు, ఎందరు తెలివయిన వాళ్ళు లేరు. ఈ అందాన్నీ ఈ తెలివితేటలనూ నమ్ముకొని, తొందరపడి నిత్యకృత్యాలకు కావలసిన పాటికూడా ఆర్జించుకోలేక, కనిన పిల్లలను పెంచి పెద్దచెయ్యలేక, మన కళ్ళయెదుటే వాళ్ళు ఎల్లప్పుడూ తమ ఇరుగుపొరుగుల కంటె హీనంగా నానా అగచాట్లు పడుతూ ఉంటే అప్పుడు ఈ ప్రేమ, ఈ అవతలి మనిషిని తృప్తిపరచాలనే భావమూ ఇవి నిలబడగలవా? పేదదంపతుల కోపతాపాలు కొట్లాటలు నూటికి నూరుపాళ్లు దారిద్ర్యంలోంచి పుట్టినవే. మేనిమీంచి కళ్లు మూసుకొని గంతినా కాళ్లు విరగక మానవు, నాకేం తెలుసుననుకొని నిప్పు ముట్టుకొంటే కాలక మానుతుందా? జీవితమంటే ఇవాళటి ఆటకాదు, ఒకనాటి నటనకాదు; కలకాలమూ తరతరాలుగా అనుభవించవలసిన కష్టసుఖాల కలయిక. అటువంటి దానిని వర్తమానంలోని క్షుద్రమయిన చంచలమయిన లాలసకి లోబడి కర్దమ దుర్గమం చెయ్యడానికి మనకి అధికారం ఏముంది?"

"అందరూ నీలాటి లక్ష్యశుద్ధిగలవారూ, నిగ్రహపరులే ఉంటారా అన్నయ్యా? ఈ లోకంలో మోసగాళ్ళు, అశక్తులూ పతితులూకూడా కొందరు ఉండక పోరుకదా; వాళ్ళలో నే నొకణ్ణి."

"ఓరే గోపాల్! నువ్వు నన్ను మోసపుచ్చలేవు. నువ్వు నన్ను ఇంతవరకూ చేసినమోసంకంటె పెద్ద మోసం చేసుకోబోతున్నా విప్పుడు. వెనుక నీవు తగినంతఏకాగ్రత లేకుండాకూడా కేవలం నాకోసమనుకొని నువ్వు చదివి, అందులో అంత ప్రజ్ఞ చూపించేవంటే, నీ తెలివితేటలూ శక్తిసామర్థ్యాలూ నేను అనుకొన్నకంటె చాలా గొప్పవి. అటువంటివాడివి ఇంత మీదికివచ్చి, కొద్ది సంవత్సరాల ముందు వెనకలకి ఆగలేక, సంసార నిర్వహణలో పడ్డావనుకో. నువ్వు సుఖపడలేవు; ఆమె సుఖపడలేదు; మీ సంతతికి భవిష్యత్తు అంధకారమయంగా, కాదు కాదు, ఆశలూ ఆశయాలూ ఉండికూడా వాటి నిర్వహణకి తగిన ఆధారం లేకుండా, పోతారు. అంతేకాదు, నువ్వొక గొప్ప ప్రొఫెసరువయితే నీ ప్రజ్ఞవలన నీ బోధనాశక్తివలన ఎందరి మేధా సంపద బైటపడి దేశానికి ఎంతటి ఉపకృతి చేయవలసి ఉందో—అంతకంటె కూడా నువ్వు ఏ న్యాయవాదివో న్యాయమూర్తివో అయి, అన్యాయం జరగడానికి వీలున్న ఎన్ని సందర్భాలలో న్యాయాన్ని నిలబెట్టవలసి ఉందో?"

"అన్నయ్యా ఇదంతా నీ మమకారం కాకపోతే, ఒక మనిషి లేకపోయినంతలో లోకంలో న్యాయం జరగదా, మేధావులు మరి బయలుదేరరా? సృష్టి అంతా మనతోనే ఉందా?"

"ఉంది, ఉంది, ఉంది; ప్రతి చిన్న అణువు ఇలా ఎదురు తిరిగితే మరి సృష్టేలేదు; మనం ఎంత అల్పులమో అంత మహత్తరులము కూడాను. మనలోని, ప్రతి సూక్ష్మాతి సూక్ష్మమయిన కణం కూడా మన మొత్తానికి మేలు కీళ్ళు నిర్ణయించడంలో భాగం పంచుకొన్నట్టుగానే మనం భరించవలసిన పాత్రకూడా అంత ముఖ్యమయినదే — నీతో వాదించడం ఎందుకుగాని, ఎంత ముఖ్యమయిన శారీరక భాగమయినా దుష్టమయినప్పుడు సంస్కరణ సాధ్యం కానప్పుడు, శేషాంగశ్రేణి సౌఖ్యం నిమిత్తం ఖండించి తీరాలి. సంస్కరణకీ నిజమయిన నిగ్రహానికీ అతీతమూ అసాధ్యమూ అంటూ ఉండదు. ఆ ప్రయత్నమే ఉండాలి గాని, నాకు మరి రైలు టైము దగ్గర పడుతూన్నట్టుంది. ఎక్కువమాటలు వద్దు. నువ్వు చెప్పిన మాటలు విన్న మీదటకూడా నాకు నీమీద అసహ్యం కలగలేదు. నీలో కొన్ని లోటుపాట్లున్నాయంటే వాటిని అతిక్రమించడానికి నువ్వుచేసిన ప్రయత్నమూ తరవాత కలిగిన పశ్చాత్తాపమూ తగిన ప్రాయశ్చిత్తంకిందనే లెక్క. ఊహూఁ మరేం మాట్లాడకుండా విను. నీమాటలే నిజమయితే ఆ అమ్మాయి తెలివయినదీ, తన భవిష్యత్తునీ, నీ భవిష్యత్తునీ గుర్తించగలిగినదే అయిఉండాలి. అటువంటిమనిషిని ఒప్పించడం విమా

కష్టంకాదు. నీకు మొగమాటంగా ఉంటే ఆ భారం నాకు విడిచిపెట్టు. నీ చదువు పూర్తయి, నువ్వేదో ఒకపద్ధతిలో స్థిరపడేవరకూ ఆగమందాం.

"అది మరి కుదరదు. వాళ్ళ కుటుంబపరిస్థితులు, ఆమెకంటె చిన్నపిల్లకి ఏదో దగ్గరసంబంధం ఉండడం, ఒకటికాదు రెండుకాదు, చాలా చాలా అడ్డంకులున్నాయి. ఇప్పుడిలా మేము లేచి రావడంకూడా వాళ్లకుటుంబదృష్ట్యా చాలా కష్టమేకాని, ఆమె కేవలం నాకోసం సర్వం విడిచి పెట్టింది. ఇప్పుడు మరి వెనక్కి తిరగడమన్నది లేదు. నువ్వు నా చదువుకోసమని, నీ అవసరాలనుకూడా కాదని కొంత నిలవచేసేవు; నెలనెలా నూరూ నూటయాభై ఎంత కావాలంటే అంత పంపిస్తున్నావు — నా క్షేమార్థం కుతూహలం ఉన్నా, నీ తల తాకట్టు పెట్టి అయినా విదేశాలకు సయితం పంపించడానికి సంతోషంగా అంగీకరించగలవు. ఇప్పుడు కాకపోతే, మరి కొన్నాళ్ళు పోయిన తర్వాత నేను సుఖపడలేని ఏ తగులాటంలోనో పడి ఇబ్బందులు పడేకంటె నాకోసం తల్లిదండ్రులను కుటుంబ మర్యాదనూ తృణప్రాయంగా చూసిన ఒక అమాయకురాలితో కలిసి కష్టసుఖాలు పంచుకోవడంలో పొరపాటేముంది? మాది కేవలం కళ్లు కప్పే ఉద్రేకపు పొంగు అనుకోకు. ఇదివరకే కాదు, ఈ రెండు రోజుల ఏకాంతంలోనూ ఒకరినొకరం తాకనయినా లేదు తెలుసునా? ఆమె నాకోసం తనవాళ్ళను గురించిన ఆలోచన అయినా చెయ్యలేదు. నేనే నిన్ను అసంతృప్తి పరచలేక ఇలా వచ్చేను — ఇప్పుడు నే నడిగిన డబ్బు అంత ముఖ్యం కాదు; నువ్వు నామీద పెట్టుకొన్న ఆశలన్నీ భగ్నం చేసిన, నా అశక్తిని నువ్వు అర్థం చేసుకొని మనసారా క్షమించి ఆశీర్వదించి పంపిస్తే చాలును. అన్నయ్యా."

రామకృష్ణ ఈ మాటల ప్రాబల్యానికి లొంగిపోయే వనుకున్నాడు — కాని, అంతలోనే ఆఫీసు బంట్రోతు వచ్చి "జట్కా వచ్చింది బాబూ" అనడంతో మనసులోని ఉద్వేగప్రవాహాలు తగ్గిపోయింది. బంట్రోతుతో, పరుపు చుట్ట, పంచీ జట్కాలో ఉంచమనడంతో మామూలు రామకృష్ణ అయిపోయేడు. పరిశుభ్రంగా కళ్లజోడు అద్దాలను మళ్లీ, తుడుస్తూ, ఏమాత్రమూ గాధ రాలేని కంఠధ్వనితో

"ఇవాళ నువ్వు వచ్చావంటే ఒకమాదిరిగా సంతోషించాను. నీకోసమై నేను, నా తక్కిన బాధ్యతలనుండి తప్పించుకొన్నా ననిపించుకోడం ఇష్టంలేక పెళ్ళిచేసుకోడానికి ఈనాటికి అంగీకరించాను. అందుకే, అంటే, ఆ అమ్మాయిని చూడడానికే, ఇప్పుడీ ప్రయాణం. ఈసంబంధం గురించి మాట ఇచ్చి ఉండకపోతే ఈనాటి నీలోని పతనాన్ని చూసి, ఆత్మహత్య చేసుకోడానికూడా వెనుదియ్యక పోయేవాణ్ణి. నా ఆత్మశాంతికోసం అయినా నువ్వు నేననుకొన్న విధంగా ప్రవర్తించి ఉండవు. సరే, మరెందుకీ వృథామాటలు. ఈ రామకృష్ణమాట తిరిగే మనిషి కాడు. వెళ్తాను; నా విధి నేను నిర్వహిస్తాను. అయితే నీ చదువుకేమీ అంతరాయం రాకుండా అన్ని ఏర్పాట్లూ చేసేను. ఇదుగో, ఒక్క అయిదు నిమిషాలు వ్యవధి ఇస్తున్నాను. ఈలోగా ఆలోచించుకో — ఆమెగురించి కాదు, ముఖ్యంగా నీగురించి ఆలోచించుకో. నామాట వినే ఉద్దేశంలో ఉంటే నే నీ ప్రయాణం ఈ రాత్రికో రేపటికో వాయిదా వేసుకొంటాను. ఆ అమ్మాయినీ, వాళ్ళ వాళ్ళనీ సమాధానపరచే పూచీ నాది. ఇప్పుడు జరిగిన నష్టానికి వాళ్ళకి తగిన పరిహారమిద్దాము. చూడు, అదుగో అయిదునిమిషాల్లో అరగంట కొడుతుంది. కొట్టగానే నీ నిశ్చయం తెలియజెయ్యాలి. నామాట వింటానంటే తక్కిన బాధంతా నేను పడతాను."

కొద్ది సెకనులు నిశ్శబ్దంగా ఉండి గోపాల్, "అయిదు నిమిషాలు కాదు, అయిదుగంటలు ఆలోచించినా ఇంతే. తక్కిన విషయాల్లో కాకపోయినా మాట వెనక్కి తిరగక పోవడం అనే విషయంలో నేను నీ తమ్ముణ్ణే. వెళ్తున్నాను. మరినన్ను పిలవకు. సెలవు."

గోపాల్ లేచి వెళ్ళిపోయినా తాను అన్న అయిదు నిమిషాలు గడచేవరకూ లేవలేకపోయేడు రామకృష్ణ. గడియారం టంగుమని అరగంట కొట్టింది. లేవాలంటే కష్టమనిపించింది. కళ్లజోడు తీసి టేబిలుమీద పడేసి, ఈమారు కళ్లనే చేతి రుమాలుతో తుడుచుకోవలసి వచ్చింది. తుడుచుకొంటున్న కొద్దీ ఆ అవసరం మరీ ఎక్కువ కాసాగింది. బంట్రోతు వస్తే కనబడిపోతానేమోనని లేచి కిటికీ దగ్గరకు వెళ్ళి నిల్చున్నాడు, ఎన్నటికీ పూలు పూయని మల్లెగులాబీ మొక్కవంక చూస్తూను.

అతను అటునించి తిరిగి చూసేసరికి ఇందాకా గోపాల్ కూర్చునిఉన్న కుర్చీలోనే, ఆకుపచ్చని చీర కట్టుకొనిఉన్న, ఒక అందమైన సుమారు పద్దెనిమిదేళ్ల అమ్మాయి ఉంది. ఆమె లేచి నిలబడి నమస్కరిస్తూ, "నే నెవరో మీకు తెలుసును. అందుచేత నన్ను నేను పరిచయం చేసుకోనక్కరలేదు. నేను వచ్చేసరికి మీ రిద్దరూ మాట్లాడుతున్నారు. అది

నాకు ముఖ్యంగా సంబంధించిన విషయం. అయితే నేను ఎదురుగా రాకుండా పక్కనుండి వినడం తప్పే అని తెలియకపోలేదు గాని, మరింకేం చెయ్యాలో తోచలేదు. మీరు ఆయన కిచ్చిన అయిదు నిమిషాల కాలం నాకూ ఇచ్చినట్టే అనుకొన్నాను. ఆ అయిదు నిమిషాలలోనూ గప్‌చిప్‌గా తిరిగి హోటలుకి వెళ్ళిపోడంగాని, తిన్నగా రయిలుస్టేషనుకి పోవడంగాని చెయ్యాలనుకొన్నాను. కాని, అయిదు నిమిషాలలోపునే ఆయన లేచి వెళ్ళిపోయేరు. నేను ఆయనతో కలిసి వెళ్లలేదు, రైల్వేస్టేషనుకి వెళ్లడానికి నిశ్చయం ఏర్పడలేదు — ఏమీ అనుకోకుండా ఇలా లోపల ప్రవేశించాను. అయితే నే నిలా రావడంలో మీకూ కొంత సదుపాయం లేకపోలేదు."

రామకృష్ణ మాట్లాడకుండా టేబిలుమీది కళ్ళజోడు తీసి పెట్టుకొని చేతివాచీవంక చూసేడు.

"మీకు నాయెడల ఎంత అసహ్యమూ కోపమూ కలగవలసిఉందో నాకు తెలుసును. మీ మొగంలో అవి కనబడకుండా దాచుకొనే ప్రయత్నం చెయ్యక పోయినందుకు నాకు నిజంగానే సంతోషంగా ఉంది. —నాకు అవతల తొందర రైలు ప్రయాణం ఉంది. ముక్కూ మొగం ఎరగని నీగొడ వేమిటనేకదూ— అనుకొంటున్నారు."

అప్రయత్నంగా రామకృష్ణ "ఇంతటి అసాధ్యురాలివి గనకనే మావాడంతగా దిగజారిపోయాడు" అని, అన్న వెంటనే, తనమీద తనకి ఎంతో కోపం వచ్చింది, తిన్నగా పోయి జట్కాలో కూర్చోక ఈమనిషితో ఎందుకు మాట్లాడానా! అని.

ఆమెకి అతని మొగంలోని మాటలు చదువుకోడంలో ఏమీ శ్రమ లేకపోయింది. నిబ్బరమయిన గొంతుతో అంది — "కూర్చోండి. నేను మిమ్మల్ని కోరేదికూడా అయిదునిమిషాలకంటె ఎక్కువ లేదు. మీ రిందాకా మీ తమ్ముడుగారితో మాట్లాడ్డంలో కొన్ని కొన్ని పరిస్థితుల్లో ఇప్పటి ప్రయాణం అవసరమయితే రాత్రికి, రేపటికి వాయిదా వేసుకోందికి అభ్యంతరం లేదన్నారు కదూ. ఇప్పుడు అంతకంటె చాలా ఎక్కువ అవసరం ఉందనే నా నమ్మకం. ఇంకా మీరు నన్నడిగి, నా సలహా వినే మాటయితే, ఊఁహూఁ నామీద, కళ్లెర్రజేసి లాభం లేదు, అసలు వెళ్లడం పెళ్ళి చూపులకని వెళ్తున్నారాయె. ఇలా కళ్లెర్రజేసి హడలగొడితే ఏ పెళ్ళికూతురు మాత్రం, మీహృదయంలోని మంచినీ నిండుదనాన్నీ గ్రహించుకోగలదు? మీకిష్టంలేకపోయినా నా సలహా యిస్తున్నాను. మీరీ ప్రయాణం అసలే మానుకోడం ఎంతయినా సమంజసంగా ఉంటుంది."

రామకృష్ణ ఆమె కూర్చోండి అనగానే తనకి తెలియకుండానే కూర్చున్నాడు. మళ్ళీ ఇందాకటిలాగే ఆలోచన తెములకముందే మాట బైటికివచ్చింది- "తప్పంతా మా తమ్ముడిలో లేదు. ఇంతటి ప్రగల్భ ధోరణి గనకనే వాడంతలా లొంగిపోయాడు"—

"ఇంత అనుభవం ఉన్న మీరు ఇంత తొందరగా ఎదుటి మనుష్యుల స్వభావాలనుగూర్చి నిశ్చయాలు చేసుకొంటే ఎలాగ? సరే, అసలు సంగతికి వద్దాము. మీ ప్రయాణం మానుకోవాలనడం మరొక దురుద్దేశంతో కాదు. మీరు ఏ ఉద్దేశంతో అయితే ప్రయాణం చెయ్యబోతున్నారో ఆ ఉద్దేశం ఇక్కడనే నెరవేరి పోతున్నాది కదా అని. ఇంతకాలం కలగని అభిప్రాయం మీకు కలగడంతోనే, మహమ్మదు దగ్గరకి మక్కా వచ్చిందన్నట్లు, మీరు వెదుకబోయిన తీగ మీ కాళ్ళని చుట్టుకోవాలని కాకపోయినా, కాళ్ళమీద పడే ప్రయత్నంతో వచ్చింది. నేనేమీ మిమ్మల్ని మోసం చెయ్యడం లేదు. మీరు రైలుప్రయాణపు శ్రమ ననుభవించినా అక్కడ మీరు చూడవలసిన పెళ్ళికూతురు ఉండడానికి వీల్లేదు ఏంచేతంటే ఆమె ఇక్కడనే మీ కళ్ల ఎదురుగా ఉంది గనక.

"ఆఁ ఏమిటేమిటీ?" అంటూ ఒక్కక్షణం కళ్లు పెద్దవి చేసిచూసి, మోచేతులలో తలపెట్టకొని, కళ్లు అరచేతులతో బలంగా మూసుకొన్నాడు రామకృష్ణ.

కొద్దిసెకన్లు ఊరకొని ఆమె నెమ్మదిగా చెప్పుకొని పోసాగింది. "నాకు మొదట మీరని తెలియదు. మీ తమ్ముడుగారికి ఇప్పటికీ నాకు వచ్చిన పెళ్ళి సంబంధం మీ దేనని తెలియదు. అసలతనికి ఆ ఊసెత్తితేనే తలనొప్పి. అయితే, ఇద్దరం తీరా ఇల్లువిడిచినతర్వాత నాకు బోధపడింది మీ రిద్దరూ సోదరులని. అయితే, ఆయన మీతో చెప్పి, ఒప్పించి, మీ ఆశీర్వాదం పొందుతానంటే వద్దనలేకపోయాను; పైగా నాకూ అదే అవసరంతోచింది. అంటే మీరు క్షమించి, ఆశీర్వదించగలిగితే, తరవాత అక్కడికి వెళ్ళి చెందే ఆశాభంగపు బాధ తగ్గుతుందనుకొన్నాను. అంతా నాదే పొరపాటు. ఇక్కడి దిగవిడవకుండా తీసుకొని పోవలసింది. మీకు ఈనాడు హఠాత్తుగా కలిగిన ఆశాభంగము ఆవేదనా కొంత తగ్గును. ఏమో, అందువల్ల, మీ అనుమతిలేకుండా వచ్చినందుకు

గోపాల్ శాశ్వతంగా మీనుండి విడిపోయి, ఎన్నటికీ తీరని దుఃఖంతో క్రుంగిపోవు నేమో?"

"చేసేవి దరిద్రపు వెధవపనులున్నా, మళ్ళీ మనస్సులో నాటకాల్లోని పాత్రల్లాగ ఆశయాలనుగురించి, ఆదర్శాలనుగురించి కబుర్లున్నా"— చేతనయినంత కాఠిన్యాన్ని గొంతులోకి తెచ్చుకొని అన్నాడు.

"నాటకాల్లో తప్ప, యథార్థ జీవితంలో ఆశయాలూ ఆదర్శాలూ ఉండడానికి వీల్లేదంటారు కదూ? ఇందాకా మీరు మీ తమ్ముడు గోపాల్‌తో అన్న మాటలను ఉన్నవి ఉన్నట్టుగానే రాస్తే, యథార్థమని నమ్మడానికి చాలామందికి కష్టంగా ఉంటుంది. మీరు పెద్దలు మీకు తెలియని దేముంది? ఇక మీరు, వెధవపనులన్నారే..."

"వెధవపనులా, ఇంకా ఇంకా..."

తరవాతి మాటకోసం కొంతసేపు తడుముకొని, ఆ వాక్యం అసంపూర్తిగా విడిచిపెట్టేసేడు. తరువాత అంతకంటె సాధువయిన కంఠస్వనంతో, "ఇలా యథార్థ వాదిత్వం ప్రదర్శించి ఒకళ్ళను కొల్పుకొని తినే కంటె, వాడికి నెలకి ఎంత కావాలంటే అంత పంపిస్తున్నాను కదా, రహస్యంగా సంసారయాత్ర సాగించలేకపోయేరు?

"నేనయితే మీ దృష్టిలో ప్రపంచంలో ఉండడానికి వీలున్న దుర్గుణాలన్నీ ముద్దగా చేసినమనిషిని కావచ్చును, గాని, మీ తమ్ముడికి అటువంటి ఆలోచన అయినా కలగడానికి సావకాశం లేదని మీకు మాత్రం తెలియదా? ఏమో, నాకు చూడగా చూడగా మీకు మీ తమ్ముడిమీద ఉన్న అభిమానం, నిజంగా ఆయనమీద కంటె, ఆయనలో మీరు కావాలనుకొన్న కొన్ని లక్షణాలమీదనే ననిపిస్తుంది. ఇటువంటి స్వార్థాన్ని, పైకి ఎంతగొప్పదిగా కనిపించినా, భరించడం మాత్రం చాలా కష్టం. సరిగా నన్ను గురించిన మావాళ్ళ ఆలోచనలూ ఇటువంటివే. నిన్న మొన్నటివరకు నన్ను బాగా చదివించి, నాచేత ఉద్యోగం చేయించి, కుటుంబ నిర్వహణకు తక్కిన పిల్లల అభివృద్ధికి వినియోగించుకోవాలనుకొన్నారు. కాని, ఇంతలో ఇప్పుడు చెయ్యకపోతే మా చెల్లెలికి మేనరికం సంబంధం తప్పిపోయే ప్రమాదం కనిపించింది; వేళకి మీ సంబంధం ఒకటే వచ్చి పడింది. ఒక్కమారుగా పథకం మారిపోయింది. ఇద్దరు ఆడపిల్లలు పెళ్ళిళ్ళయి, వెళ్ళిపోవడం కంటె కావలసిందేముందనుకొన్నారు. ఇన్నాళ్ళూ ఆ పద్ధతి గొప్పది; ఇప్పుడిది గొప్పది. ఎంతసేపూ వాళ్ళలోని ఆశలూ సంఘంలో బడాయిగా చెప్పుకొనే అవకాశమూ, ఇంతే తప్ప నా గురించిన ఆలోచనే లేదు— ఈ చిక్కులన్నీ చాలనట్టు మీరు గోపాల్‌కి దైవతుల్యులయిన అన్నగారుకూడా కావడం తటస్థించింది. అయితే ఈ చిక్కు సంగతి గోపాల్‌కి ఇంతవరకూ తెలియదు," ఇకముందు తెలియవలసిన అవసరం కూడా లేదు.

రామకృష్ణ కుర్చీలోంచి లేచి, అత్యంతమైన వేగంతో గదిలో ఆచివరనుండి ఈ చివరవరకూ పచారు చెయ్యసాగాడు. అతని మొగం అంతా చెమటముత్యాలతో నిండిపోయింది.

ఆమె గది అంతా కలయజూచి, తువ్వాలు తీసి, అతని చేతికి అందించి, "మొగం తుడుచుకోండి, అలిసిపోతారు, కుర్చీలో కూర్చోండి" అంది. అతనికి ఆమెను కాదనే శక్తిలేకపోయింది.

ఆమె మళ్ళీ అందుకొంది. "ఏమిటండీ, మీరింత పెద్దవారు, అంటే వయసులో కాదు, జ్ఞానంలో, అనుభవంలో, ప్రతిభలో, పట్టుదలలో. కేవలం స్వయంకృషివలన ఎంతో కిందుగా మొదలుపెట్టి ఇంతమీదికి వచ్చేరు. ఇటువంటి మీరు ఒకానొక చిన్న అఘాతం గానికి ఇంతలా క్రుంగిపోతే...

"చిన్న ఆఘాతంగ మేమిటి నా అస్తిత్వం మీదనే నాకు అనుమానం కలుగుతూ ఉంటే... అయితే ఒక మనిషిమీద ఇంకొక మనిషి అతీతంగా ఆశపెట్టుకోడానికి ఏమి హక్కుంది? హక్కు లేని దానిమీద ఆశలు పెట్టుకొంటే ఎప్పటికయినా ఇంతే...."

"ఉఁహుఁ. కాదుగాని మీరు ఇందాకా మీ తమ్ముడితో మాట్లాడ్డంలో నాతో వాదించి ఒప్పించి వెనక్కి పంపించే పూచీమీది అన్నారు కదా? ఆ ప్రయత్నం చెయ్యరేం? అంతే కాదు, ఇంకా మరొక పద్ధతికూడా ఉందికదూ, నన్ను నయానో భయానో మీకంక తప్పకొని, పెళ్ళి చెసుకొందికయినా ప్రయత్నించరేం. రెండు పక్షులూ ఒకేదెబ్బతో పడతాయికదా? అయితే నన్ను చూసేక నాతో మాట్లాడేక, పెళ్ళి చేసుకోవాలనే ఉద్దేశం అంతరించిపోయి ఉండవచ్చు. నేనంత భయంకరంగా ఉన్నానేమో?"

"అదంతా నాకు తెలియదుగాని, మా తమ్ముడికి ఇదివరకులాగ నన్ను మభ్యపెట్టాలని కాక, యథార్థం చెప్పాలనే ధైర్యం ఎందుకు వచ్చిందో, నీకోసం ప్రపంచంలోని తక్కిన అనుభవాలన్నిటినీ విడిచి

పెట్టడం ఎలా త్యాగం కాదనిపించిందో అర్థం అవుతూంది. నిన్ను చేసుకోదలచి హతాశుడయినవాడు మాత్రం మరొకరిని చేసుకోలేడు. ఇంతగా ప్రేమించిన నేనే మా తమ్ముడిఅదృష్టానికి అసూయపడకుండా ఉండలేనేమో ననిపిస్తుంది"

లీల "అమ్మయ్య!" అని బ్రహ్మాండమయిన తృప్తితో నిట్టూర్చింది. ఆమెకళ్లనుండి మొదలయిన రెండు నీటిధారలు అద్దంమీద ప్రవహించినంత మృదువుగా క్రిందికి జారసాగాయి.

రామకృష్ణకి తన కళ్ళలోకూడా నీళ్ళు తిరుగుతున్నాయని తెలియనేలేదు. అతను ఎందుకో తనకే తెలియకుండా చెప్పకు పోసాగాడు: "ఒకే తల్లిపిల్లలమయినా మాయిద్దరి నడుమఉన్న వయస్సులోని భేదం వల్లనో మరేమో, మా తమ్ముడిలో నాలో ఉన్నంత స్వార్థపరత్వమూ, ఆత్మనిగ్రహ మనే పేరుతోడి ఆత్మవంచన, మరింక చాలా చాలా పెద్దపేరులు పెట్టుకొన్న ధనదాహమూ ఇవన్నీ వాడిలో ఎంత ప్రయత్నించినా కలగలేదు. ఇకముందు నీ సాహచర్య ప్రాబల్యంవలన కలగవుకూడా! అయ్యో వెర్రి పిల్లా, ఎందు కేడుస్తావు నవ్వి గంతులేయవలసిన సందర్భంలో"—అంటూ అతిసహజంగా వెళ్లి తువ్వాలు కొనలతో ఆమె కన్నీటి చారలను తుడుస్తూ "అబ్బ! ఎంతకొంచెంలో మా తమ్ముణ్ణి పోగొట్టుకొని ఉండే వాణ్ణి; ఎంత కొంచెంలో వికసించి పరిమళించవలసిన రెండు జీవితాలను నాశనంచేసి ఉండేవాణ్ణి!

"నిజంగా నాకు నవ్వాలనీ, చిన్నపిల్లలాగు గంతులనే ఉంది—కాని, ఎందు కిలా ఏడుపు వస్తుందో తెలియకుండా ఉంది. అబ్బ, ఇప్పటికెన్నడూ మా అమ్మని నాన్ననీ కూడా ఈక్షణంలో మిమ్మల్ని ప్రేమించినంతగా ప్రేమించిన సందర్భం లేదు. ఇదివరకు గోపాల్ మిమ్మల్ని మానవాతీతుల న్నంతగా చెప్తూవుంటే, లోలోపల కొంత ఈర్ష్య కలిగేది. అబ్బా, నేనే తట్టుకోలేకపోతున్నానుకదా, ఈ ఆనందానికి గోపాల్ ఏమవుతాడో...... వెధవ హోటలు—మైలున్నర దూరం ఉంది. ఇటువంటి సుఖసమయాల్లోనయినా మనుష్యులకి రెక్కలు లేకపోతే మరెందుకు?"

"నిజమే, నిజమేగాని గుమ్మంలో జట్కా ఉంది. ఊఁహూఁ అంతకంటె ఈ సందుచివర టాక్సీ ఒకటి ఉంటుంది. అది తెప్పించుకొందాం. నేనూ వచ్చి, అక్కడ కారులో కూర్చుంటాను. ముగ్గురం కలిసి ఇంటికి వచ్చేద్దాము. అబ్బే, ఇలా లేచిపోతే లాభంలేదు. కారు వచ్చేలోపుని కొత్తమొగం కడుక్కొని కాఫీ పుచ్చుకోవాలి. ఇది, మరి ఏమాత్రమూ కాదనడానికి వీల్లేదు. ఇందాకా నేను తెలిసి మా వాడికీ, తెలియకుండా నీకు అయిదునిమిషాలు వ్యవధి ఇచ్చేను. ఇప్పుడు నాకు నువ్వు ఆమాత్రం వ్యవధి ఇవ్వాలి. ఈలోగా ఏడుపును కడిగేసుకొంటే, అద్దుకోనక్కర లేకుండానే నవ్వు దానంతటదే వచ్చేస్తుంది."

లీలకే కారు, రామకృష్ణకికూడా కారు అతి నెమ్మదిగా పోతున్నట్టే అనిపించింది. హోటలుదగ్గర ఆగగానే, లీల, "మరి దిగక్కర్లేదు. అదుగో, ఆ చివరనున్న ఏడవనంబరు గదే, తాళంవేసి ఉంది. నాకేమో భయంగా ఉంది, తొందరగా రైలు స్టేషనుకి నడిపించండి"—అంది.

ఒక రయిలు అప్పుడే దూరపు సిగ్నలు దాటి వంకర తిరిగి అంతర్థాన మయిపోయింది. ఇంకొక రయిలు రెండవనైపు అయిదునిమిషాల క్రితమే వెళ్ళిపోయింది. రామకృష్ణ పెద్ద ఆశలేకుండానే దిగివెళ్ళి స్టేషనంతా తిరిగివచ్చేడు. వస్తూనే, "వాడు మరొక దారిని మా యింటికి వెళ్లేడేమో! లేక హోటలుకి వెళ్లేసరికి నువ్వు కనబడక నిన్ను వెతకడానికి ఎక్కడెక్కడ తిరుగుతున్నాడో! లేక ఈసరికి హోటలుకి వచ్చి ఉంటాడేమో! రయిలులో ఎక్కడికీ వెళ్ళిఉండడనే నానమ్మకం. ఎందుకు వెళ్తాడు? ఎలా వెళ్తాడు నువ్వు లేకుండా—" లీల ఏమీ మాట్లాడలేదు—వట్టి శిలాప్రతిమలా కూర్చుంది. ఆమెకళ్లలో ఏమీ కదలిక లేదు, ఎదుటి వస్తువుల ప్రతిబింబాలనయినా సరిగా గ్రహించలేకపోతున్నాయి. ఏదో మాట్లాడుతున్నాడే గాని రామకృష్ణకీ అనుమానంగానే ఉంది.

మేనేజరుదగ్గర తాళం తీసుకొని, ఆమెను చెయ్యిపట్టుకొని, మెట్లెక్కించి తీసుకొని వెళ్లేడు. తలుపు తియ్యగానే టేబిలుమీద దృష్టికి బాగా కనబడేలాగ పెట్టబడి ఉన్నాయి. రెండు ఉత్తరాలు. రామకృష్ణకి అక్కడ తనకని ఉద్దేశించబడిన ఉత్తరం కనిపించడంలో వింత ఏమీ తోచలేదు. తన ఉత్తరంలో మూడేపంక్తు లున్నాయి. రెండవ ఉత్తరం కూడా అట్టే పెద్దదిగా లేదు. ఆమె అది చదవకుండానే "నాకు తెలుసును, నిజంగా ఇందాకటి ఆనందంలో గుండె ఆగిపోతుందనిపించింది. గోపాల్ ఉన్నా భరించలేకపోయి ఉందును. పోనీ, ఇదే మంచిది, నన్ను పట్టిన దౌర్భాగ్యం మరిక అతిన్ని బాధించనక్కరలేదు — ఇక మావాళ్ళు కుటుంబ

శ్రేయస్సు, మర్యాద పేరు చెప్పి ఏం చేసుకొన్నా నాఅభ్యంతరం ఎంతమాత్రం ఉండదు”—

“ఏమిటమ్మా వెర్రిపిల్లవి, ఇప్పుడింత క్రుంగి పోవలసిన అవసరం ఏమీ లేదే. వాడు ఆశాభంగంవలన, కాస్త వైరాగ్యధోరణిలో పడినా ఆత్మహత్య చేసుకొనే ఉద్దేశంమాత్రం లేదని స్పష్టంగా రాశాడు. ఈ రాత్రి రైళ్ళలో నేనూ మా స్నేహితు లిద్దరమున్నూ బయలుదేరి, నలువంకలా గాలిస్తాము. పత్రికలలో ప్రకటిస్తాము మహా అయితే వారం పదిరోజు లవుతుంది. వాణ్ణి, తీసుకొనివచ్చి పువ్వులలో పెట్టి అందజేయడానికి నాది హామీ.

రోజులు వారాలు నెలలు సంవత్సరాలు నడిచి పోయాయి. రామకృష్ణ ఆర్థిక సహాయంతో లీల బి. యస్ సి పూర్తిచేసింది; డాక్టరీ చదివింది; ప్రాక్టీసు పెట్టింది—ప్రాక్టీసు పెట్టిన కొత్తలోనే ఒక మోసపోయిన కన్నెతల్లి, కవలపిల్లలను కని లీల చేతిలో వాళ్ళను పెట్టిపోయింది.

కవలలకు వేణుగోపాల్, రామగోపాల్ అని పేర్లు పెట్టింది. రాముని తానుంచుకొని, వేణుని రామకృష్ణ కిచ్చింది. అంతవరకూ ఏడాదికి అథమం ఒక నెల అయినా తమ్ముణ్ణి వెదకడంలో గడుపుతూ వచ్చిన రామకృష్ణకి కొంత ఊరట లభించింది; క్రమంగా పసిపిల్లవాడితోపాటు తాను పసిపిల్లవాడయిపోసాగాడు.

ఎప్పుడయినా లీల అతణ్ణి చూడడానికి వచ్చినప్పుడు అంటూ ఉండేది. “చూడండి మా రాముని, ఎంత మప్పితంగా ఉంటాడో! మా యింట్లో మా వేణు యజమానో మీరు యజమానో కూడా తెలియదు—అంతేకాదు, మీరు వాడికి అనారోగ్యం కలిగే పరిస్థితుల్లో కూడా వాడిని అదుపు ఆజ్ఞల్లో ఉంచలేక పోతున్నారు చూడండి” అని.

రామకృష్ణ: నిజమే నిజమే నేనూ అలాగే అనుకొంటాను గానీ, నిజంగా నే వాణ్ణి అదుపులో పెట్టాలనే కోరిక బలంగా లేదు; అప్పుడప్పుడు కలిగినా అంతటి మనసు నిబ్బరం లేదు—అయిదు నిమిషాలు వాడి ముఖం కనబడకపోయే సరికల్లా ఏమీ తోచదు. వాడు పెద్ద యేకమాటకేం, ఇప్పటినుండి నన్ను ద్వేషించకుండా ఉంటే చాలునన్న నా స్వార్థానికి లొంగిపోతున్నాను. ఒక్క కఠినమయిన మాట, ఒక్క అయిదునిమిషాల కోపము ఎంత దారుణమయినదో ఇంతగా అనుభవిస్తున్నాను—ఇంకా మరి అదుపు ఆజ్ఞల తాపత్రయం దేనికి. నాకు మా రాము మీద నువ్వు ఉపయోగించే అధికారమూ క్రమశిక్షణా చూస్తే భయంగా ఉంది. వాణ్ణికూడా ఇక్కడే ఉంచి, నువ్వు వెళ్ళి హాయిగా పెళ్ళి చేసుకొని...

“మాస్టారు! ఇదివరకే చెప్పాను, మీరు మళ్ళీ మళ్ళీ ఆ మాటంటూ ఉంటే, మీకు కనబడడమే మానేస్తానని — నా కష్టంకంటె తక్కువ కష్టంలో ఉండి మీరు నన్ను ఓదార్చినా అర్థం ఉండును గాని...రామూ అలా స్తబ్ధులా కూర్చొని పెద్దవాళ్ళ మాటలు వినకపోతే, తోటలోకి వెళ్ళి వేణుతో ఆడుకోకూడదూ? చెట్లూ చేమలూ ఎక్కి మాత్రం కాళ్ళు చేతులూ విరుచుకోకండి...”



# సోమనాథుఁడు



శ్రీ అప్పల వీరవెంకట జోగయ్యశాస్త్రి

(గత సంచిక తరువాయి)

మూఁడౌరైనను వారు మూసెయివ పెం,
    పుం డెంపు దీపింప, రా
పాడింపుం డల మ్లేచ్ఛ వాహినుల, దు
    ర్వార ప్రతాపంబులో
తాడింపుం డరకాల రాచి, గములై,
    తారాడు నీ మ్రుచ్చులన్
జాడల్ రూపర, జాతి గౌరవ ప్రతి
    ష్ఠల్ వమ్ముగాకుండగన్.

పర జాతీయమత ప్రచారమున కే,
    వారైన రావచ్చు, వే
ర్పరులై స్వాభిమతమ్ము శ్రోతలకు జె
    ప్పవచ్చుగా కిట్లు ము
ష్కరతన్ జెత్తురు ద్రావు రాజ్యవిజి గీ
    షా వృత్తికిన్ బోవు కా
వరముల్ సైపగ వచ్చునే? భరత వి
    శ్వంబంత నిర్వీర్యమే?

*    *    *

ఆదిని హైందవుల్ గెలుతు
    రంచును, బోరున నార్యజాతి మ
ర్యాదలు దక్కనంచును ద,
    లంచిరి - కాని యదృష్టరేఖ యీ
జోదుల ఫాలభాగమున,
    జూపదె కాలగతిన్ భ్రమించి, మా
మూదుని రొట్టె సేతబడి,
    పోయిన దొక్క క్షణంబులోపలన్.

## 2

హుక్కానాశము ప్రక్కకున్ విసరి వి
    ద్యోతించు నేత్రాల నా
మక్కాదిక్కున నిల్చి, మోకరిలి సం
    భావించి హస్తద్వయిన్
చుక్కానుల్ బలె చాచియెత్తి గజినీ
    సుల్తాను ధ్యానించి, వే
రెక్కల్ కట్టుకు వ్రాలినాడు సమరో
    ర్విన్ మందహాసంబుతోన్.

అల్లా వచ్చి యనుగ్రహించె-"గెలువుం,
    డాజిన్ జయోత్సాహులై
కొల్లాడుండని నాడు కాఫరుల ము
    క్కుల్ పిండి సర్వస్వమున్
కల్లాడన్ బనియేమి? యిద్దినిజమో,
    కాదో నిరీక్షించినన్
దెల్లంబౌ" ననినాడు-కత్తిగొని శ
    క్తిన్ జూపి పోరాడుడీ!

"రాతికి మోకరిల్లుచు న
    లాములు వేయు గులాము లెల్ల నే
జాతికి జెందినన్ మనకు
    శాత్రవులే - యని ద్రుంపుడేగి వీ
చేతుల తీటవో" నని వ
    చించి హుషారిడ, కారుపిచ్చియౌ
బోతుల కైవడిన్ దెగువ,
    ముస్లిము ఫౌజులు రెచ్చి మార్కొనన్.

పిరికికండ రొలుంగని, బిరుసు పోటు
బంటులొక్కరికి దీసిపో వని విధాన
ఘోరసంగ్రామ భూమి సం హారకాండ
జరిపి కొన్నార లరిభయంకరముగాగ.

కలుకుకత్తుల వెన్నెల కాంతులందు
క్రోలు పులుల ట్టులు భయ ప డాలవారు
మంచినెత్తురు చిమ్మిచి మిన్నంచుకొనుచు
సల్పుకొన్నారు రక్తవసంతకేళి!
భరత సర్వంసహా మాతృ చరణయుగళి
నుదుటి శోణిత ధారల నొలుకబోసి
యంత్య నిశ్వాస మిడిగెడు నంతదాక
యరుల నిర్జించి యొరిగినా, రామెసుతులు.

లోపముకానరాదు మన
    లోకులలో నిసుమంత, తమ్ముపూ

పాపని బుద్ధి వెఱ్ఱి తల
    వైచిన లోపమె కాని, పాపమే
శాపము - సోమనాథు గ్రహ
    చారము దుర్దశకున్ గమించె - సం
తాపము దేల నావిధి వి
    ధానము కడ్డిడువారు గల్గిరే?
వారకమున్న పెల్లుబికి,
    వచ్చిన హూణ కుహూను వాహినీ
వారము కాలవేగమున,
    భారత జాతి గభీర తీర్థ సం
పార విలీనమై నిలువ
    జాలిన దీర్ఘ శక్తి వశించి, గ్రీకుదో
స్సారము చంద్రగుప్త భుజ
    శక్తికి గానుక వెట్టె నాత్మజన్.

ఎన్నో సంస్కృతులేకమై యడగనీ
    హిందూమత ప్రోద్యుతిన్
మున్నీలాటియ సంగతంబయిన దో
    ర్ముల్లాట సాగింపలే
కన్నం జే ప్రభువర్తి వచ్చినను, రా
    జ్యేచ్ఛాభరతిన్ గల్పి చే
కొన్నన్, బుద్ధువారి భావముల నీ,
    కొంగ్రొత్త సిద్ధాంతముల్.

"తనకున్ దోచదు - అన్యమున్ వినదు మా
    దాయూదు" డన్నట్లు ప్రా
క్తన విశ్వ స్తవనీయ హైందవ కళా
    కల్యాణపుం సంస్కృతీ
ఘన హేవాకము కన్ను గుట్ట విలనో
    ద్ఘాతంబు సంధించు మూ
ర్ఖుని చిత్తంబును మెత్త జేయగల శ
    క్తుల్లేవు ఖడ్గం వినా!

* * * *

గతి మఱి యొండు లేక నయ
    గారమునన్ సులతాను దేవతా
ప్రతిమను ముట్టబోవని ఖ
    రా రోదనించిన జాలు, రత్న సం
గతి కనకాభిషేక పరి
    కర్మతు జేతుమటంచు నర్చక
ప్రతతులు కాల్ర వేలబడి,
    పల్కిరు ప్రెమొక్కిన - సుప్రహాసుడై.

హూదాపై బురమేగుచో గనక వ
    ర్షా ప్రభాల గల్పించి మా
హూదాకున్ దగినట్లు సత్కృతులు జే
    యుం డంతియే గాని మీ
సౌదా గర్లటు విగ్రహాల్ విలిచి రై
    శ్వర్యంబు నాశించు మ
ర్యాదల్ మాయెడ లేవు - పొండు, యిక నే
    లా విల్వ? క్యా ఫాయిదా?

వచ్చిన పేరు చచ్చినను,
    బాయదటందురు, దానికేమి? నా
పిచ్చిరియె నాకు మోదమిడు,
    విగ్రహనాశన కారుడంచు నన్
మెచ్చవలెన్ 'ఖుదామతి' వ
    జీగ్వ్రితు డీత డటన్న మాటకున్
హెచ్చుమదాగ్రహం బికస
    హింప నటంచు బురోగమించినన్.
సురడెలు ప్రీలిపోరు దళ
    కోటి సహస్ర శతత్రయీ పృథక్
ఖండములై, స్రవించె తొలి
    కారు ఘనంబటు నేత్రవారి, బ్ర
హ్మాండము దిర్దిరన్ దిరిగె
    నట్టులు దోచిన దెల్లవారి, కి
గండము దాటిపో వదను,
    గాఢ నిరాశ జనించినంత నే!

నూరుహయంబు, లుష్ట్రములు,
    నూరు, ఖరంబులు నూరు, మత్తకం
జారము లేనికిన్ ధరణ,
    సాధ్యముగాని ధనంబు వెండి బం
గారము లిత్తు మింక నప
    కార మొనర్పము, సోమనాథు హో
జారము ద్రొక్క బోకుమని,
    సాగిలి మ్రొక్కిరి భూసురాగ్రణుల్.

రాయి కరగిన నతని యు | ల్లము కరంగు,
ఇనువు శమియింప నతని క్రో | ధము శమించు,
కరడు కట్టిన కడు నహం | కార మూర్తి
కరయ మెయిలవి కర్ణగో | చరము లగునె?

* * * *

ఫెళ్లున గొడ్డలిన్ దిగిచి,
    వేసిన దారుణ ఘాత వృష్టికిన్
ఫెళ్లున నూరు చెక్కలయి,
    పార్శ్వయునంబను సోమనాథుపై

గళ్ళున హీరమౌక్తిక ని
    కాయపు జల్లులు రాలె కూలి, వే
కళ్ళ జిగాలవన్ ప్రళయ
    కాల మదెవ్వరి నేమనంగనో ?

హాహాకారము లుప్పతిల్లె సకలా
    శాంతాల, నాశాలతల్
స్వాహాయైనవి మ్లేచ్ఛభూపతి మహా
    హంకార సప్తార్చికిన్
మోహావిష్టుని కోర్కె చెల్లినది ని
    ర్మాల్యల క్రియల్ సాగె, హా
హాహా! ధర్మువు దచ్చిపోయినది, లే,
    దాలంబ మీ జాతికిన్.

దాసులు జేసికొన్న మగ
    రాల నిగారపు బంటలోన ము
ప్వాసము కొసులున్ గపటు
    పీడిన ముక్తెపు దొంతులేరు వా
యాసము గాఢమై చెమట
    లానిన మోమున దోచెనంత పే
రాసల హాసరేఖ తమి
    నందిన యా సులతాను మూర్తిలోన్.

కరిగిపోయిన దచటి బం । గారు రాశి
యతని కనుదృష్టి మఱిగిన । యట్టులల్ల,
కుడ్యముల ప్రేలు చొక్కంపు । కుందమణులు
నేలబడ్డవి వడగండ్లు । రాలినట్లు.

* * * *

రంగత్తుంగ తరంగ హాస్త నిచయ,
    ప్రాలంబ దంభస్పృతీ
సాంగత్యాగత సాభిషేక రచనా,
    సంతోషితోద్యన్మహా
లింగాకారము నేడు లేదిచట ద
    ర్శింపంగ; నోహో! తపో
భంగం బైనదొ? లేక స్వామిమది నె
    వ్వండేని నొప్పించెనో?

* * * *

# 3

స్తవనీయ శిల్ప సౌం । దర్యంబు పుష్పించు
    పెను కుడ్యముల పొదు । పెల్లగించి,
గగన వీథిమ సుధా । కరబింబ చుంబిత
    కాంచన గోపురాల్ । కదల ద్రోచి,
చెలువుగా మెఱుగు ప । చ్చలు దాపికట్టిన
    రమణీయ సోపాన । రాజి ద్రవ్వి,
పావనంబౌ స్వామి । పాద పంకజముల
    కమనీయ వజ్ర పీ । ఠము గదల్చి,
క్రమ శృంగారమయలక్ష్మి । కన్ను బొడిచి,
భూరి ధనసంపదలనెల్ల । దూరలాడి,
జనుల తలగొట్టి, సర్వ నా । శం బొనర్చి
కదలె గజనీకి మామూదు । కట్టకడకు!

* * * *

భారతి రాజ్యలక్ష్మి తల
    పై నలరించిన యట్టి దివ్యమం
దారము రాలిపోయె, కను
    దమ్ముల నుండెగదాచు శిల్పశృం
గారము గారిపోయె, తరు
    గం బడిపోయిన ధార్మ కీర్తి భాం
డారము, కాలచక్రిక యు
    ధాములు నైచె తమస్సమాధికిన్.

వేయేండ్లాటను విస్మృతిన్ బడిరొ నీ
    విఖ్యాతపుం గాథ స
శ్రేయః కాముల యల్ప శేముషి సయా
    ర! వీర రక్తారుణం
బై యీనాటికి గాంతి పీడని శిలా
    స్యమ్ముల్ మహోగ్రంథమై
యాయా ఘోరదురంతముల్ వినుచు న
    ధ్యాయ క్రమం బేర్పడెన్.

నేటికి వ్రథవీథి పయి
    వించుచు నచ్చటి కేగి మంను క
న్నీటిని గార్చుకైరవి, వి
    నీల వలాహక మోడ్చి యేడ్చు, నీ
నాటికి నూర్మిమాలి కరుణా
    మతి బాహువులల్ల చాచు, ము
మ్మాటికి సృష్టికున్న యభి
    మానము మానవజాతి కున్నదే?

విరిగిన గోడలందు ప్రభ
    వించిన నింబకదంబ భూరుహాం
తరసురు కోటరాల నిర
    తంబు వసించు శకుంత పంక్తిమున్
జరిగిన గాథలెల్ల తమ
    సంతతికిన్ వినిపించు మంజుల
స్వరమున చూడి, కన్నుగవ
    బాష్పకణంబులు రాల నేటికిన్.

ప్రేముడి రాతిలోన మెలి
    పించిన దివ్యకళాలతాళి పె

నేస్త్రముల హాసరేఖ కను
　　మూయదు నేటికి బాదువడ్డ, నే
నోములు నోచి పాదుకొనె
　　నో యిట-నే స్తవనీయ శిల్పమున్
గోముగ నోమెనో చిలికి
　　కొంచు నుదాత్త రసప్రపూరముల్.

కసవును మేసి క్రొవ్వి మద
　　గర్వమునన్ జిలు అంకె వేయువా
పసరము గిట్టెనన్ మెరకు
　　వారు తృణంబులు మోసులెత్తు, దు
ర్వ్యశసన జిఘత్సుకున్ బోలియు,
　　రమ్యకళారము కన్న జేని తా
రసపడు మంచిరోజులు ని
　　రాశకు దాసులు గారు హైందవుల్.

*　　　*　　　*　　　*

మును సులతాను కంట్లనిడి
　　పోయిన దుఃఖ నవాంజనాల తీ
రిన తమసాల పిండుల హ
　　రించి, స్వతంత్ర నవోదయ త్రయీ
తను తపనీయ దీధితులు
　　దారత జెందుచు నున్నవంచు, తే
నను జివురొత్తి భగ్న కళ
　　మాత్మ వికాసము బొంద క్రమ్మరన్.

కాలము తప్పివచ్చి తిరు
　　గంబడిపోయిన సోమనాథ దే
వాలయ భాగ్యరేఖ, చెర
　　లాడిన దింకొకమారు సత్కళో
జ్వలితమై విశృంఖలగ
　　తిన్ - మెరయించుచు ఘంటికానినా
దాల, స్వతంత్ర భారతి కు
　　దాత్త కుతూహల ముప్పతిల్లగన్.

ఈ జగమేలు సామి వసి
　　యించెడు నాలయ గోపురాగ్ర వి
భ్రాజిత హేమకుంభ పరి
　　రంభిణలాలస వృత్తి తారకా
రాజియనంగ రాజు నిశ
　　లన్ బయునించు వియత్ప్రధాన నీ
రాజన మిచ్చుచున్ శుభ క
　　రంబుగ వెన్నెల కప్పురాలతోన్.



# మధురనేలిన తెలుగురాణి



శ్రీ చల్లా రాధాకృష్ణశర్మ

భారతావనిలో రాజ్యము చేసిన నారీమణులు కొందరు కలరు. స్వయముగా రణరంగములకు వెడలి వైరివీరులతో సమరము సాగించిన బాహు బల సంపన్నలును వారిలో కొందరు లేకపోలేదు. అసాధారణమైన రాజనీతిని ప్రదర్శించి, రాజ్యము నందెల్లెడల శాంతి భద్రతలు సుస్థిరముగ నెలకొల్పిన రాజనీతి విశారదలును నున్నారు. అయినను రాణి మంగమ్మవలె వారిలో ఎవ్వరును శాశ్వతయశస్సు సముపార్జింపలేకపోయినారు. నేడును దక్షిణాపథములో మహారాణి మంగమ్మ పేరు మారుమ్రోగుచునే యున్నది. ఆమె నిర్మించిన సత్రములు, కట్టించిన భవనములు, త్రవ్వించిన తటాకకూపములు, చేసిన దానధర్మములు-నెందరైనవి మంగమ్మ మహారాణి పేరుప్రతిష్ఠలను దేశదేశాలవారికిని తెలియజేయుచున్న శాశ్వతకీర్తిస్తంభములు. క్లిష్టపరిస్థితులలో ఆమె సింహాపీఠి నలంకరించెను. అనాటి రాజకీయ వాతావరణము అప్రశాంతముగ నుండెను. అయినను ధైర్యము వీడక, ఆ విషమ పరిస్థితుల నెదుర్కొని తన రాజ్యమును శత్రువుల బారినుండి సంరక్షించి శాంతి భద్రతలు నెలకొల్పెను. రాణి మంగమ్మయే అప్పుడు లేకపోయినచో తంజావూరు నాయక రాజ్యమువలె, మధుర నాయక రాజ్యముకూడ త్వరలోనే పతనమై యుండెడిది. అనగా తెలుగువారి పరిపాలనాధికారము క్రీ. శ. 1706 తోనే అంతమై యుండెడిది. అట్లుకాక ఇంకను ముప్పది సంవత్సరములవరకు తమిళనాడులో తెలుగువారు పరిపాలింప గలిగి రన్నచో, ఆ కీర్తి మహారాణి మంగమ్మగారికి చెందుచున్నది.1

రాణి మంగమ్మ చొక్కనాథనాయనింవారి పట్టమహిషి. చొక్కనాథనాయనయ్య తంజావూరు పాలకుడు విజయరాఘవరాయలతో సఖ్యసంబంధము నేర్పరచుకొను తలంపుతో అతని కుమార్తెను వివాహము చేసికొన నిశ్చయించెను. తద్విషయమును చొక్కనాథనాయనయ్య ఒక ప్రముఖోద్యోగి మూలమున రాయలకు తెలియజేసెను. కాని రాయ లా యుద్యోగిని గౌరవముగ చూడలేదట! వాడు మిక్కిలి అతని నవమానించెనట! విజయరాఘవరాయలు తన కొమరితను చొక్కనాథునికిచ్చి వివాహము చేయ నిరాకరించుటచే, కడపట ఇరువురికిని యుద్ధము సంభవించెను. ఆ యుద్ధమునకు మరికొన్ని కారణము లున్నను, ఈ వివాహ విషయము కూడ ప్రబలహేతువులలో ఒకటియని విశ్వసింపబడుచున్నది. ఈ విషయమును కొన్ని చారిత్రక లేఖనములు కూడ స్పష్టము చేయుచున్నవి.2

విఫల మనోరథుడైన చొక్కనాథుడు విజయరాఘవరాయలతో యుద్ధమునకు సన్నద్ధుడై, ఆ యుద్ధభారమును దళవాయి సముఖము వేంకటకృష్ణప్ప నాయకుని పైనను, పేష్కారు చిన్నతంబి మొదలి పైనను వేసెను. సముఖము వేంకటకృష్ణప్పనాయకుని నాయకత్వముక్రింద మధుర సైన్యములు తంజావూరుకు జని తొలుదొలుత తంజావూరి దుర్గమును ముట్టడించెను. అప్పుడు వేంకటకృష్ణప్పనాయకుడు రాయలను సందర్శించి చొక్కనాథునితో సఖ్య సంబంధము నేర్పరచుకొనుట శ్రేయస్కరముగ నుండుననియు, లేదేని అనర్థములు వాటిల్లుననియు సవినయముగ విన్నవించెను. కాని పూర్వ వైరములను మనసు నందుంచుకొన్న రాయలు మధుర దళవాయి మాటలను పెడచెవిని బెట్టెను. అందువలన మరల మధుర సైన్యములు దుర్గమును ముట్టడించెను. తంజావూరి పక్షమున దళవాయి రంగప్పనాయుడు, వీరబాణం చిన్నరాజా-మున్నగువారు శత్రువుల నెదుర్కొనిరి. ఉభయులకు కడపట భయంకరమగు సంగ్రామము జరిగెను. ఇరుపక్షములందును విపరీతముగ నష్టమేర్పడెను. 'కొందరు

---

*1. Her vigour and diplomacy gave the Nayak kingdom a longer tenure of life than it would otherwise have had.*

*Satyanatha Iyer "The History of the Nayaks of Madura"*

2 తంజావూరి ఆంధ్రరాజుల చరిత్ర.

మధుర రాజైన తిరుమలరాయని చరిత్రము. (ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము, మదరాసు.)

# డన్‌లప్ టైరుగల ఎద్దు బండ్లకీ, ఇనుప చట్రాలుగల ఎద్దు బండ్లకీ గల వ్యత్యాసం



* ఖరీదేమో కొంత ఎక్కువే
ఇనుప పట్టాల ఎడ్లబండి డన్‌లప్ టైర్ల బండికంటె
వెల తక్కువే. కాని



* రెట్టింపు భారం మోయగలదు
ఎడ్లబండి సుమారు 25 మణుగులు మోయగలిగితే, డన్‌లప్
టైర్ల బండి 50 మణుగులు మోయగలదు.



* కాపాడడంలో ప్రయాస లేదు
డన్‌లప్ టైర్ల బండి, అందులోని టైర్ల కారణాన, రోడ్ల ఎగుడు
దిగుడుల్లో కదలదు. మొదట వెల కొంత ఎక్కువే అయినా,
దాన్ని కాపాడడం సులభంగనుక, తరువాత ఎంతో మిగల్చవచ్చు.



* ఎడ్లకు శ్రమ లేదు
'డన్‌లప్' బండ్లు సాఫీగా నడుస్తాయిగనుక, ఎడ్లకేమి శ్రమవుండదు.

**డన్‌లప్**  **ఎద్దు బండ్ల పరికరములు**

చాలా గాయాలు తీస్కొనివారు. కొందరు దప్పి తాళ లేక క్రిందపడి పొర్లాడుచున్న కాల్వలుగా వచ్చే రక్తాన్ని జలము అని భ్రమచేత పానం చేసినారు.'1 తుదకు తంజావూరు దుర్గము దళవాయి వేంకటకృష్ణప్ప నాయకుని హస్తగత మయ్యెను. అప్పటికిని మధుర దళవాయి అచ్యుత విజయరాఘవ రాయలను సమీపించి పెండ్లివిషయమును ప్రస్తావించెను. అపుడు రాయలు దైవధ్యానమున నుండెను. అతని కుమారుడు మన్నారుదాసుకూడ తండ్రి దగ్గర నే యుండెను. తంజావూరు ముట్టడింపబడినప్పటికిని రాయలు మాత్రము తన కుమార్తెను చొక్కనాథుని కిచ్చి వివాహము చేయ నిరాకరించెను. ఈ హేతువుచే భగవద్ధ్యానమున నున్న రాయలను మధుర సైన్యాధ్యక్షుడు తన కరవాలమునకు బలిగొనసాగెను. పిమ్మట మన్నారుదాసు కూడ హత్యగావింపబడెను. ఇటుల తండ్రీ కొడుకు లిరువురును చంపబడిరి. ఈ విషాద విషయాదికము తంజావూరి యంతఃపురాంగనలకు తెలిసెను. అంత రాచ కన్నియలందరు ప్రాణత్యాగ మొనర్చిరి.

ఇటుల త్రిశిరఃపురమువారితో యుద్ధము ముగిసిన పిమ్మట చొక్కనాథనాయనయ్య చంద్రగిరి దూపకల్ కు చెందిన దళవాయి తుపాకుల లింగమనాయని కుమార్తె మంగమ్మను వివాహము చేసికొనెను. ఈ విషయము 'మధుర రాజైన తిరుమలరాయని చరిత్ర' మునందు దీర్ఘముగ పేర్కొనబడినది. "చంద్రగిరి తుపాకుల లింగమనాయని వారి కుమార్తె మంగమ్మగారు మహా రూపయౌవన కళాసమేతలై యుండే వర్తమానం విని శ్రీ రాజా చొక్కనాథనాయనివారు తుపాకుల లింగమనాయని వారిక్కి తగు మనుష్యుల నంపించి......మంగమ్మను వివాహం చేసుకొని"నారు. ఈ వివాహము తంజావూరు యుద్ధానంతరము జరిగెననుట స్పష్టము కావునను, తంజావూరుయుద్ధము 1674 సంవత్సరమున జరిగినందువలనను, చొక్కనాథ నాయనయ్య మంగమ్మను 1674-75 సంవత్సర ప్రాంతమున వివాహము చేసికొని యుండవచ్చును. కాని యీ నిర్ణయము సంశయాస్పదముగ నున్నది. చొక్కనాథనాయని మరణానంతరము అతని కుమారుడు (మూడవ) ముద్దు వీరప్ప నాయనయ్య సింహాసనమునకు వచ్చెను. ఇతడు సింహాపీఠ మలంకరించునాటికి సుమారు ఏడేండ్ల వయస్సువాడు. ఏడు సంవత్సరములు మాత్రమే ముద్దు వీరప్పనాయుడు రాజ్యము చేసినట్లు తెలియుచున్నది.2 కనుక పదునాలుగు సంవత్సరములు మాత్రమే యితడు జీవించి యుండెనని చెప్పవలసి యున్నది. అయితే ముద్దు వీరప్పనాయడు మరణించు నాటికి, అతని పట్టమహిషియగు ముద్దమ్మ గర్భము ధరించియుండెను. అనగా పదునాలుగు సంవత్సరముల వయస్సు వచ్చునాటికే మూడవ ముద్దు వీరప్ప నాయనయ్య పితృస్థానము నలంకరింప నర్హుడయ్యెనని నుడువవలయును. ఇదియే నిజమైనచో, 1674-75 సం|| ప్రాంతమున వివాహము జరిగిన మంగమ్మగారికి 1675 - 76—ప్రాంతమున పుత్రోదయమైనట్లు పేర్కొనవలసి యున్నది. అసలు ముద్దువీరప్పనాయుడు మంగమ్మకు జన్మించినవాడు కాదేమో అని కొందరు తలచుచున్నారు. 1687 సం|| మందు వేయబడిన యొక శాసనమున ముత్తమ్మ యను నామె ముద్దు వీరప్పనాయని తల్లిగా పేర్కొనబడినది. కాని ముద్దు వీరప్పనాయనయ్య మంగమ్మగారి కుమారుడే యని యీ క్రింది యాధారమువలన సువిదిత మగుచున్నది.3

"చొక్కనాథ మహీశుఁడు దాఁ జచ్చిన
ప్రకటంబుగ నటు బలెఁ దన కొడుకగు
రంగకృష్ణ ముద్దు వీరాఖ్యుఁ డీల్గిన......"

ఏది యెట్లున్నను, మూడవ ముద్దు వీరప్పనాయని కుమారుడు విజయరంగ చొక్కనాథనాయనయ్య పసిబిడ్డగా నున్నందువల్ల ఆయన అవ్వయైన మంగమ్మ బిడ్డను ఒడిలో కూర్చుండబెట్టుకొని'4 సంరక్షణ కర్తగా మంగమ్మ రాజ్యము చేసెననుట సుస్పష్టము.

రాజకీయము లనిన మంగమ్మగారికిగల యాసక్తి నిరుపమానము. వస్తుతః చాల తెలివితేటలుగల మగువ ఆమె. తన తెలివితేటలతో గడించిన రాజకీయ విజ్ఞానమును జోడించి రాజ్యము చేసినది కావున, మంగమ్మ పరిపాలన దృష్ట్యా చిరయశస్సు గడించినది. చొక్క-

1 మధుర రాజైన తిరుమలరాయని చరిత్ర.
(చెన్నపురి ప్రా. లి. పు. భాండాగారము)

2. 7 సం||లు రాజ్యము చేసెనని 'మదురై త్తిల వరలారు' (తమిళము) నుడువు చున్నది.

9 సం||లు రాజ్యము చేసినట్లు మధుర రాజైన తిరుమలరాయని చరిత్రయందున్నది.

3 వికటకవి గోపాలరాయఁడు మంగమ్మపై నొక ప్రత్యేక గ్రంథము రచియించెను. ఆ గ్రంథమే 'మధురమంగాపుంశ్చలీలీలా విలాసము-' పయిపాదము లీ గ్రంథమునందలివి.

ప్రా. లి. పు. భాం. మద్రాసు.

4 ఈ విషయము 'మదురై త్తిల వరలారు'లోఁ గలదు. వివరములకు నా 'మధురానగర చరిత్ర'ను జూడుఁడు. (ఆగస్టు, 1952 భారతి)

నాథనాయని మరణానంతరము మంగమ్మ సహగమన మాచరింపకుండుటకు ఈ రాజకీయానురక్తియే ప్రబల హేతువని నుడువవచ్చును. కాని రాజకుటుంబములందు భర్తృ మరణానంతరము భార్య సహగమన మాచరించుట ఆనాడు పరిపాటిగ నుండెను. ఈ ఆచారము నుల్లంఘించి రాజ్యమేలినదన్న మంగమ్మగారు మహాసాహసురాలనియు, సంస్కరణాభిలాషిత్వము కలది నియు పేర్కొనుట అత్యుక్తికాదు. కానేరదు కూడ. గర్భవతిగానున్న తన కోడలు ముద్దమ్మ పతి మరణించినంతనే చితి నెక్కుటకు యత్నించినది. కాని మంగమ్మ యామెను వారించెను. అయినను పురుష సంతానము కలిగిన పిమ్మట, ముద్దమ్మ ఆత్మహత్య చేసికొని ప్రాణములు వీడెను. అనంతర మా శిశువునకు మూడు నెలలు రాగానే, అతనిని (విజయరంగ చొక్కనాథుడు) సింహాసనము నందధిష్ఠింపజేసి మంగమ్మ యతని పేరున రాజ్యవ్యవహారములు స్వయముగా పర్యవేక్షింప జొచ్చెను. పరిపాలన దృష్ట్యా ఆమె విశేష విఖ్యాతి నార్జించినను కలుషితశీల యని విఖ్యాతితో సమావస్థాయిలో నున్న దుష్కీర్తిని గూడ గడించెను.

మంగమ్మగా రధికారమునకు వచ్చునాటికే భారతావనిలో మొగల్ చక్రవర్తులు ప్రబలులై యుండిరి. దక్షిణాపథముకూడ వారి యధీనములో నుండెను. మైసూరు పరిపాలకుడును, హాగలు గగ్గోలు రాయడు వను చిక్కదేవరాయ లంతటివాడే మొగల్ చక్రవర్తులకు సామంతుడై రాజ్యాధికారము చేయుచుండెను. తంజావూరు పాలకుడును సామంతుడుగానే వ్యవహరించుచుండెను. అందువలన గత్యంతరము లేక మహారాణి మంగమ్మయు మొగల్ సార్వభౌముల యాధిపత్యమును శిరసావహించెను. 1697 సం॥న మొగల్ సేనాని జుల్ ఫిక్ఖాను దక్షిణాపథమున కేతెంచినపుడు మంగమ్మ యతనికి బహుమానములు విశేషముగా నొసగి అతని యాదరాభిమానములకు పాత్రురాలయ్యెను. తుదకు మొగల్ సైన్య సహాయముతో కోల్పోయిన రాజ్యభాగములను గూడ మంగమ్మ సంపాదించెను. ఈవిధముగ ఆమె రాజ్య విస్తీర్ణత నుద్దేశించి పాటుబడుచున్న సమయమున మైసూరు చిక్కదేవరాయలవారి యాజ్ఞానుసారము దళవాయి కుమారయ్య(1690-94 సం॥ల ప్రాంతమున) తిరుచిరాపల్లిని ముట్టడించుటకు యత్నించెను. కాని మహారాష్ట్రులు మైసూరును ముట్టడించుటచే దళవాయి కుమారయ్య స్వదేశమునకు మరలిపోవలసి వచ్చెను.

తిరుమలశౌరి నాయకేంద్రుని కాలమునుండియూ తిరువాంకూరు పరిపాలకులు పాండ్య (మధుర) మండలాధీశ్వరులయెడ వినయ విధేయతలు ప్రకటించుచు సక్రమముగ కప్పము చెల్లించుచుండిరి. ముద్దు వీరప్ప నాయని కాలమునగూడ వారు విధేయులై యుండిరి. కాని మంగమ్మగారి కాలములో తిరువాంకూరు నేలు రవివర్మ కప్పము చెల్లింప నిరాకరించెను. కావున మంగమ్మ దళవాయి నరసప్పయ్యను రవివర్మను శిక్షించుటకు తిరువాంకూరుకు పంపెను. నరసప్పయ్య చాల గొప్పవాడు. దళవాయి రామప్పయ్యవలె నితడును మహా స్వామిభక్తుడు. దళవాయి నరసప్పయ్య నాయకత్వము క్రింద మధుర సైన్యములు 1697 సం॥న తిరువాంకూరు ముఖ్యపట్టణమగు కోర్కుళమును ముట్టడించెను. రవివర్మ నరసప్పయ్యను ప్రతిఘటించెను. కాని లాభము లేదయ్యెను. ఈ విజయముతో తిరువాంకూరు మంగమ్మగారి హస్తగతమయ్యెను.

తిరువాంకూరు యుద్ధము ముగిసిన మూడు సంవత్సరములకు, అనగా, 1700 లో తంజావూరు పాలకుడు షహాజీ మధురకు చెందిన కొన్ని పట్టణములను ముట్టడించెను. ఈవిషయమును తెలిసికొన్నవెంటనే దళవాయి రామప్పయ్య ససైన్యముగ వెడలి తంజావూరు సైన్యములను ప్రతిఘటించెను. మంగమ్మ మొగలుల సహాయమునుగూడ పొందెను. ఈ యుద్ధములో తంజావూరి సైనికులు చాలమంది మృత్యువువాతపడిరి. తంజావూరి సైన్యము కొలరూన్ నదిని దాటునపుడు, దళవాయి నరసప్పయ్య యా సైన్యమును సంహరించి విజయమునుపొందెను. కడపట తంజావూరు పాలకుడు నరసప్పయ్యతో సంధి చేసికొనెను. మధుర వారికి విజయము లభించినను అచిరకాలముననే యొక విచిత్ర సంఘటన మూలమున మధుర, తంజావూరు పాలకులు మిత్రులయిరి. మైసూరి చిక్కదేవరాయలు విశేషవిఖ్యాతి నార్జించిన యుద్ధవీరుడేకాక బుద్ధి కుశలతగల పరిపాలకుడును. కావేరీనదీ జలమును తన దేశమునకు తెచ్చుకొన నభిలషించి ఆతడు కావేరిపై నొక ఆనకట్ట నిర్మించెను. ఇది మధుర తంజావూరు పాలకుల కాగ్రహము కలిగించెను. అంత వారిరువురును కలసి చిక్కదేవరాయలను ప్రతిఘటింపదలచిరి. అంతలో వర్షములు విరివిగ కురియుటచే వెల్లువలువచ్చి ఆనకట్టను ధ్వంసమొనర్చెను. కావున మధుర తంజావూరు పాలకులు యుద్ధమును విరమించిరి.

ఈవిధముగ అనేక పర్యాయములు శత్రువులబారినుండి మధురను మంగమ్మ సంరక్షింపగలిగెను. 1698 సంవత్సరమున తిరుమల సేతుపతి విరుదవిరాజితు

డును, యరవదేశాధిపతియునైన కిళవన్ సేతుపతి మధురను ముట్టడించెను. కాని దళవాయి నరసప్పయ్య ప్రదర్శించిన ధైర్యోత్సాహములకు ఫలితముగ యరవవీరులకు జయము లభింపలేదు. మరల 1702 లో మంగమ్మకును, కిళవన్ సేతుపతికిని యుద్ధము సంభవించెను. తంజావూరు పరిపాలకుడు ఈ యుద్ధమున మధురవారి పక్షము వహించెను. మధురను పలుమారులు యుద్ధములనుండి సంరక్షించిన దళవాయి నరసప్పయ్య యాధ్వర్యమున మధుర సైనికులు యరవవీరుల నెదుర్కొనిరి. కాని యరవవీరులు సామాన్యులు కారు. మహా బాహుబల సంపన్నులు. దురదృష్టవశాత్తు యుద్ధము ముగియకమునుపే దళవాయి నరసప్పయ్య వీరస్వర్గము నలంకరించెను. అంతిమవిజయము సేతుపతికే లభ్యమయ్యెను. ఈ విజయము ఫలితముగ కిళవన్ సేతుపతి పాండ్యమండలములో గల సంబంధ బాంధవ్యములను తెగత్రెంపులు చేసికొని, యరవదేశమగు రామనాథపురము స్వతంత్ర రాజ్యమని ప్రకటించెను. నాటినుండియు తిరుమల సేతుపతి యధికారము దక్షిణాపథమునందు బాగుగ వ్యాప్తము కాజొచ్చెను. రామనాథపురమునకు చుట్టుప్రక్కల నున్న పట్టణములను కైవసము గావించుకొని సేతుపతి తన రాజ్యవిస్తీర్ణమునకు పాటుబడెను. పిమ్మట 1709 సంవత్సరములో కిళవన్ సేతుపతి తంజావూరు సైన్యములతో పోరాడి విజయము పొందెను.

మంగమ్మగారి కపజయము కలిగినది ఒక్క సేతుపతితో గావించిన యుద్ధమునందే. దళవాయి నరసప్పయ్య సహకార సామర్థ్యాదులను సముపార్జించిన మంగమ్మ అపజయ మనుమాట నెరుగదు. ఒకతట్టు మొగలు చక్రవర్తులును, మరియొకవైపు మైసూరు పాలకుడు చిక్కదేవరాయలును, ఇంకొకప్రక్క తంజావూరు ప్రభువును, మరి యింకొకదెస యరవదేశాధిపతి తిరుమల సేతుపతి బిరుదవిరాజితుడు కిళవన్ సేతుపతియు, వేరొకవైపు తిరువాంకూరు ప్రభువు రవివర్మయు—మంగమ్మ కాలములో మధురను కబళింపవలయునని తలచిరి. కాని మంగమ్మ ప్రదర్శించిన ధైర్యోత్సాహములును, సమయానుకూలముగ సంచరించిన విధమును, సహజముగ నామెకుగల తెలివితేటలును, రాజకీయానురక్తియు శత్రువుల యాటల నరికట్టినవి. లేకున్నచో రాణి మీనాక్షి కాలములో గాక, రాణీ మంగమ్మ కాలమందే మధుర నాయక రాజ్యము పతనస్థితికి వచ్చియుండెడిది. అందువలననే రాజకీయముగా రాణి మంగమ్మకు శాశ్వతి యశస్సు లభించినది; ఆమె చరిత్ర వినువీధిలో ధ్రువతారవలె ప్రతిభాసించుచున్నది.

రాజకీయముగా మంగమ్మగారు సముపార్జించిన చిరయశస్సు ఒక యెత్తు, ఆమె చేసిన దానధర్మముల వలనను, ప్రదర్శించిన మత సహనమువలనను గడించిన శాశ్వతకీర్తి ఒకయెత్తు. ఆమె పొందిన రాజకీయ విజయములు కాలగర్భములో కలసిపోయినను, ఆమె కావించిన దానధర్మములు నేటికిని కీర్తిపతాకలై రెపరెపలాడుచు నెగురుచునే యున్నవి. ఈ హేతువును పురస్కరించుకొనియే భారతావనిలో రాజ్యము చేసిన నారీమణులలో మంగమ్మ సాటిలేనిదని నుడువ వలసి వచ్చినది. మధుర నాయక రాజు లందరివలెనె, మంగమ్మకూడ మత సహిష్ణుతను ప్రదర్శించిన విశాల హృదయ. దేవాలయములకు దానధర్మములు విరివిగా చేసినట్లే, ఆమె మహమ్మదీయ, క్రైస్తవ దేవాలయములకును దానధర్మములు చేసినది.

మంగమ్మ మత సహిష్ణుతను పురస్కరించుకొని క్రైస్తవ మత ప్రచారకులు మత ప్రచారమును బాహాటముగ చేసికొనుచుండిరి. మహమ్మదీయులు కూడ మంగమ్మగారి యాదరాభిమానములకు పాత్రులై యుండిరి. 1692, 1701—సంవత్సరములలో ఆమె కొన్ని మసీదులకు దానధర్మములు చేసినట్లు మన కామె వేయించిన శాసనములవలన విదితమగుచున్నది. ఇటుల మంగమ్మ మతసహనమును ప్రదర్శించుచు రాజ్యము చేయుచున్న కాలములో రామనాథపురమున నొక విచిత్ర సంఘటన జరిగెను. కిళవన్ సేతుపతి దగ్గరి చుట్టములలో నొకడు క్రైస్తవమతము స్వీకరించెనట! అతడే కిళవన్ సేతుపతికి పిమ్మట సింహాసనమునకు రావలసినవాడు. కనుక అతని మతస్వీకారము ప్రజకు మిక్కిలి అసభ్యముగ తోచెను. క్రైస్తవ మతబోధకులవలన ముమ్ముందు మరెట్టి యరిష్టములు సంభవించునోయని తలచి యరవలు క్రైస్తవ మత ప్రచారకుల నిర్బంధింపదొడగిరి. రామనాథపురముననున్న చర్చినికూడ ధ్వంసము చేసిరట! దీనిని బట్టి చూచినచో, మంగమ్మ ప్రదర్శించుచు వచ్చిన మతసహనము నిరుపమానమని తెలియుచున్నది.

ఇక మంగమ్మగారు దేవాలయములకు గావించిన దానధర్మములను ప్రజోపయోగార్థము నెలయింప జేసిన సత్ర సంతానములు ననేకములు. మధుర మీనాక్షీ సుందరేశ్వరాలయమునకును, ఉత్తమపాలెమునను కాళహస్తీశ్వర దేవాలయమునకును దానములు చేసినట్లు విదితమగుచున్నది. సోళవందమను స్థలమున మంగమ్మ యొక పెద్ద సత్రము కట్టించి దానికి భూదానముగూడ చేసెను. అటులనే శివలూరు, తడంపట్టె మున్నగు స్థలములందును సత్రములును, ధర్మ

చావడులును, నిర్మించెను. పెక్కు ప్రదేశములందు చెరువులును, బావులును త్రవ్వించినది. నేడు మంగమ్మగారు కట్టించిన భవనములలో కొన్ని ప్రభుత్వ కార్యస్థానములుగా నున్నవి. మధుర రైల్వే స్టేషను సమీపమునమున్న సత్రము మంగమ్మగారి పేరున వ్యవహరింపబడుచున్నది. ఇటుల తమిళ నాడులో మంగమ్మగారి నామము మాఱుమ్రోగుచు నుండుట ఎంతయు సంతసింపదగిన విషయము. ఈమె దాన నిరతిని సుస్పష్ట మొనరించుచున్న రుచికరము లగు కొన్ని కథలు నేటికిని ప్రచారములో నున్నవి.

"ఒకనాడు విడియము వేసికొనుచు మంగమ్మ పొరపాటుగ ఎడమచేతితో వక్కపొడిని నోటిలో వేసికొనెనట. చేసిన తప్పును గ్రహించిన పిమ్మట, ఆమె ప్రాయశ్చిత్తము చెప్పుడని పండితులను ప్రశ్నింపగా వారామెను విశేషముగా దాన ధర్మములు చేయుమనియు, అదియే ప్రాయశ్చిత్తమనియు నుడివిరట. నాటినుండియు మంగమ్మగారు దానధర్మములు చేయ దొడగెనట!" ఇది విశ్వాస్యము కాదు. ఏలయన మధుర నాయక రాజులెల్లరు దానశీలురు. ఇట్టి దాన నిరతి వారికి చిన్నతో పెట్టిన విద్య. అరువాన్నిబ్బర గండ బిరుద (డెబ్బది రెండు పాళెములను జయించిన వాడు) విరాజితుడగు శ్రీ విశ్వనాథ నాయనయ్య మొదలుకొని మధుర నేలిన కడపటి మహారాణి మీనాక్షి వఱకునుగల నాయక రాజులందరును దాన కర్తలుగా ప్రసిద్ధికెక్కిరి. కావున పండితులు చెప్పిన నాటినుండియు మంగమ్మగారు దానధర్మములు చేయ మొదలిడెననుట హాస్యాస్పదముగ నుండును. మఱియొక మధుర గాథనుగూడ నుదాహరించుచున్నాను.

"రాజకీయముగ విశేష విఖ్యాతి గడించిన మైసూరు చిక్కదేవకొరి ప్రతినిత్యము తన ధనాగారములో కొంత ధనమును పదిలపఱచిన పిమ్మటనే యతడు మఱియొక పనిని చూచెడివాడట. అతడట్టి దానశీలుడు. మరణానంతరము అతడు నరకలోకమునకు పోయెను. పిమ్మట కొన్నాళ్లకు యమభటులు లోకనిని తీసికొనివచ్చుటకుమారుగా మఱియొకనిని పొరపాటున నరకలోకమునకు తీసికొని వచ్చిరట. అతడు మైసూరు పౌరుడు. అంత చేసిన పొరపాటును గుర్తించిన యమభటులా పౌరుని మైసూరునకు పంప నిశ్చయించిరట. అప్పుడు చిక్కదేవరాయలా పౌరునితో తాను నరకమున పలుబాధలు పడుచుంటిననియు, అచిరకాలములోనే మధుర నేలుచున్న మంగమ్మగారు మరణించుననియు, ఆమె దాననిరతిని దేవలోకవాసులు వేనోళ్ళ పొగడుచున్నారనియు, కావున నామెకు ఘనమైన స్వాగతము లభించుననియు నుడివెనట. పిమ్మట నా పౌరుడు మైసూరునకువచ్చి యావద్వృత్తాంతమును చిక్కదేవరాయల కుమారునికి తెలియజేసెను. నాటినుండియు నతడు దానశీలుడై దానధర్మము లసంఖ్యాకముగా చేసి చిక్కదేవకొరికి స్వర్గలోకప్రాప్తియగునట్లు చేసెనట!"

ఈ కథయందలి సత్యాసత్యము లా సర్వసాక్షికే యెఱుక. ఈ కథ కేవలము కల్పితగాథయని నుడువ దగును. కాని మంగమ్మగారి దానశీలమును మైసూరు చిక్కదేవకొరిగారి లోభిగుణమును వ్యక్తము చేయు నుద్దేశముతో ప్రజలీ కథను కట్టియుందురు. కాళ్లు చేతులు లేని కట్టుకథయేనైనను, ఇది యానాటి తెలుగుల విశాల హృదయమును, దాన నిరతిని కన్నులకు కట్టినట్లుగా తెలియజేయుచున్న మధుర గాథ. కాని యొక్క విషయము మాత్రము సుస్పష్టము. మైసూరు చిక్కదేవకొరి మరణానంతరమే, అనగా 1706 లో మంగమ్మ మరణించెను.

ఈ దానగుణమువలననే మంగమ్మ చిరయశస్సును సముపార్జించినది. ఇంకను మంగమ్మగారి విశిష్ట గుణములలో ముఖ్యముగా పేర్కొనదగినది ఆమె సంఘ సంస్కరణాభిలాష. మూఢ విశ్వాసములకును, పూర్వాచారములకును పట్టుగొమ్మగానున్న ఆ కాలములో సంఘమును, సాంఘికాచారములను ప్రతిఘటించెనన్నచో మంగమ్మ మహాసాహసురాలనియు, పూర్వాచారములందు విశ్వాసములేని మహిళయనియు నూహింపవలసి యున్నది. పతి పోయిన వెంటనే చితి నెక్కుట యానాడు బహుళ ప్రచారము నందుకొనియున్న యాచారములలో నొకటి. దీనిని ముఖ్యముగ రాజకుటుంబముల వారాదరించుచుండిరి. తంజాపూరు విజయరాఘవరాయల మరణానంతరము, తంజాపూరి అంతఃపురాంగన లెల్లరు చితిచేర్చుకొని, అందులోపడి మరణించిరి. మధుర నేలిన ముద్దు తిరుమలకొరి నాయనయ్య (1623-59) మరణానంతరము, అంతఃపురమున నున్న అతని ఇన్నూరుమంది భార్యలును సహగమన మాచరించిరట! అటులనే మఱవ దేశాధిపతియగు కిళవన్ సేతుపతి (తిరుమల సేతుపతి) మరణానంతరము ఆతని నలుబదిరేడుగురు భార్యలును సహగమన మాచరించిరట. వీనిని పురస్కరించుకొని చూడగా చొక్కనాథుని మరణమునకు పిమ్మట మంగమ్మ సహగమనమాచరింపకుండ, తరువాతి కాలమున రాజ్యము చేసినదన్నచో ఆమె ఎట్టి సాహసురాలో మన మూహించుకోవలసినదే. మీదు మిక్కిలి

కోడలు ముద్దమ్మ (మూడవ ముద్దు వీరప్ప నాయడు) సహగమన మాచరింప సన్నద్ధముకాగా మంగమ్మ యామెను వారించెను. పిమ్మట పురుష సంతానము కలిగినతోడనే ముద్దమ్మ ఆత్మహత్య చేసికొని ఏకపత్నీవ్రతుడును,[1] మహా ధర్మపరుడునైన తన భర్తను కలుసుకొనెను. ఇటుల మంగమ్మ సహగమనమునకు తాను తిలోదకములు వదులుటయేకాక ఆ దురాచారమును రూపుమాపుటకును యత్నించెనని నుడువదగును.[2]

మంగమ్మ సంఘసంస్కారాభిలాషిత్వమును పై విషయములు చెప్పక చెప్పుచున్నవిగదా! ఈ చారిత్రిక విషయములేకాక జన సామాన్యము సతతము చెప్పుకొను కథ యొకటి మంగమ్మ సంస్కార ప్రియత్వమునకు మెఱుగులు దిద్దుచున్నది.

"మధురానగరంలో పట్టునూలుకరణులను చేనేతపారిశ్రామికులున్నారు. వారు సదాచార సంపన్నులు. వారి యాచార వ్యవహారములు చాల వఱకు బ్రాహ్మణుల యాచార వ్యవహారములను బోలి యుండును. బ్రాహ్మణులవలె, వారును ఉపాకర్మ మాచరించుచుండిరి. ఆ విషయము తెలిసిన మధురానగరాధికారి వారిని శిక్షింపనెంచెను. పిమ్మట పట్టునూలు కరణులు నగరాధికారి వైఖరిని మంగమ్మగారికి విన్నపము మూలమున తెలియజేసిరి. అప్పుడు పట్టునూలు కరణులుపాకర్మాధికారము కలిగియున్నారో లేదో యను విషయమును తెలిసికొను నుద్దేశముతో మంగమ్మ యొక పండిత పరిషత్తు నేర్పాటు చేసెను. పండిత పరిషత్తు పట్టునూలుకరణుల పక్షమే పలికెను. తోడనే మంగమ్మగారొక పత్రమును పండిత పరిషత్తు నిర్ణయమును వ్రాయించి యా పత్రమును పట్టునూలుకరణుల కొసగెనట." ఈ విషయములన్నియు మంగమ్మ సంఘసంస్కారాభిలాషను తెలుపుచున్నవనుట అత్యుక్తి కాదు.

ఇంతవఱకు మహారాణి మంగమ్మగారి రాజకీయ జీవితమును, సంఘ సంస్కరణోద్యమ కృషిని గమనించితిమి. ఆమె వ్యక్తిగత జీవితమును పరిశీలించితిమేని మంగమ్మ కలుషిత శీలయని నుడువవలసి యుండును. ఈమె జీవితము స్త్రీ జాతికే కళంకము నాపాదించునట్టిదిగా నున్నది. స్త్రీ మాత్రిగా తోచదు. నీతి నియమములను, సిగ్గు బిడియములను విడనాడిన కామరూపిణి!

వికటకవి గోపాలరాయడను నొక కవి 1650-1700 ప్రాంతముల తంజావూరు, మధుర, ఆనెగొంది మున్నగు రాజ్యములందు జరుగుచున్న ఘోరములను, అసభ్య ప్రవర్తనములను, నీతి విదూర కృత్యములను విపులముగ నభివర్ణించుచు నొక గ్రంథము వ్రాసెను. "మధుర మంగా పుంశ్చలీ లీలా విలాస" మని యా గ్రంథనామము.[3] ఈ గ్రంథమును వ్రాసినంత కాలము గోపాలరాయడు తద్రచనా పాప పరిహారార్థము శ్రీరామ మంత్రము జపించుచుండెనట! ఈయొక్క వాక్యమే చాలును ఈ గ్రంథమందలి యసభ్యత నూహించుటకు. ... ... నపకృతి నందిన చిన వెంగనయను కవి యొక్క డామెను బూతులు దిట్టుచు మధురమంగాపుంశ్చలీ విలాసమును, మంగమ్మ దిండికమును రెండు గ్రంథములను రచించెను. (జూలై భారతి, 1953 పుట 31.) కానియీ గ్రంథము వికటకవి గోపాలరాయనిచే వ్రాయబడినదని గ్రంథమందే యుండుటచే, దీని కర్త చినవెంగన కాడని నుడువవలసి యున్నది.

శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారు నుడివినట్లుగా మంగమ్మగారు మధురలో గ్రంథరచనకు కారణభూతురాలైనది. ఆమెకు భాషాభిమానమున్నట్లు

---

1. శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారు నుడివినట్లుగా నాడు "బహుకళత్ర గ్రహణము, వేశ్యాంగనా గమనమును సిరిగలవారి లక్షణములు -" ఇంక రాజుల విషయము చెప్ప నవసరమే లేదు. అట్టియెడ ఒక్క ముద్దు వీరప్పనాయకుడు మాత్రము ఈ అపవాదమునకు దూరముగ నున్నాడు. ఇతని ఏకపత్నీత్వమును నొక చారిత్రక లేఖనము స్పష్టము చేయుచున్నది. "ధర్మపరుడుగాను మహాశూరుడుగాను ఏకపత్నీవ్రతుడుగను వుండుకొని యీ తొమ్మిది సంవత్సరములు బహుధాన్యము మొదలు వ్యయ సం॥ వరకు రాజ్యం చేసి ఆపైని రాజారంగకృష్ణ ముద్దు వీరప్పనాయనివారు వైకుంఠప్రాప్తి పొందినారు ... ... ... పట్టపురాణి అయిన ముద్దమ్మగారు గర్భముగా నుండిరి....

2. సహగమనమును రూపుమాపవలయునని నిజముగా మంగమ్మ ప్రయత్నించెనని స్పష్టముచేయు నాధారములు లేవు. కాని గర్భవతిగానున్న ముద్దమ్మ చితి నెక్కినచో వంశాంకురము లేకుండ పోవునేమో యను భీతిచే మంగమ్మ యామెను వారించినది. అయినను నీ యాచారమును రూపుమాపవలయునని మంగమ్మ తలచియుండియు, తుదకు సంఘమునకు భయపడి యూరకున్నదేమో!

3. మధురమంగా పుంశ్చలీ లీలా విలాసము చిన వెంగన యను కవికృతమని శ్రీ నేలటూరు వేంకటరమణయ్యగారు పేర్కొన్నారు.

కనబడదు. కావున శిల్పాచార్యులను, నటవిట గాయకులను పోషించియుండిన మంగమ్మ కవుల కాశ్రయ మొసగి వారిని కావ్యరచనకు ప్రోత్సహించి యుండ లేదు. అయినను జీవితములో కష్టము నేతప్ప సౌఖ్యము నే యెఱుంగనట్టియు, నాటి రాజాస్థానములందు జరుగుచున్న ఘోరములనుజూచి భగ్నహృదయుడునైన గోపాలరాయకవి పుణ్యమా యని దుశ్చరిత యగు మంగమ్మకూడ ఏదో యొక విధముగ ఆంధ్ర వాఙ్మయములో సముచితస్థానము సంపాదించుకొన గలిగినది.

"రూప యౌవన కళా సమేత" యైన మంగమ్మ తుపాకులవారి చిన్నది. తుపాకులవారు తోళప్పాచార్యుల సంప్రదాయమువారు. మంగమ్మ తల్లియు కలుషిత శీలయని తెలియుచున్నది. 1 "మీతల్లి తిరువళూరు లంజెలకెల్లా మేటిగా ఉన్నది బాగిలిముచ్చో. నీవు దానికి పుట్టింది జగమరుగో." ఈ విషయము లట్లుంచి, మంగమ్మ వ్యక్తిగత జీవితమును పరిశీలింతము. ఈమెకు కోడెకాండ్రు చాలమందియుండిరి. వారిలో ముఖ్యులు నరసయ్య (దళవాయి నరసప్పయ్యయను పేరా) రంగయ్య, అచ్చయ్య (మంగమ్మ మంత్రి) మీనాక్షయ్య. మధురమంగా పుంశ్చలీ లీలా విలాసములో పేర్కొనబడిన విషయము లన్నిటిని నిచ్చట నుదాహరించుట సమంజసముగ నుండదు.

"శ్రీ రంగేశ్వర చింతిత దాయక !
సారంగ వరద శేషసువిధాయక !
......  ......  ......
......  ......  ......
తెలియగ నిప్పుడు త్రిశిరఃపురమున
వెలసెడి వింతలు వివరించెదనొక
మంజరి కృతిగా ......
......  ......  ......
చొక్కనాథ మహీశుఁడు దాఁజచ్చిన
ప్రకటంబుగ నటుబలెఁ దన కొడుకను
రంగ కృష్ణముద్దు వీరాఖ్యుఁ డేల్గిన
......  ......  ......
అంతఃపురమున వణకువ చేయక
చెంతటివారికి నింతా తెలియక
నరసని, రంగని, నయముగు తిమ్మని
నిరసపురాయస సాహసుల తెగల
వెంకని, యలగోవిందుని, నిమితపు
టింకవచ్చయను బిసకోమాత్యుని
రాఘవరావును రహిఁ వెంకోజని
......  ......  ......

మంగమ్మ శీలమును గురించి యింతకంటె నధికముగా వ్రాయ నవసరము లేదు. ఈ 'మధుర మంగా పుంశ్చలీ లీలా విలాస' గ్రంథము మధుర నేలిన మంగమ్మకు సంబంధించినది కాక, మధురయందలి మంగయను నొక వేశ్యకు సంబంధించినది అను నొక సంశయము గలదు. ఇదియే కనుక సత్యమైనచో మహారాణి మంగమ్మ సర్వ విషయముల సాటి లేని రాణియని నుడువదగును. కాని మంగమ్మ మరణవృత్తాంతము కూడ కొంతవఱకు నామె కలుషిత శీలను నే బలపరచుచున్నది.

మంగమ్మగారి మనుమడు విజయరంగ చొక్కనాథ నాయనయ్య పెద్దవాడైన పిమ్మట రాజ్య వ్యవహారములను స్వయముగా పర్యవేక్షింపసాగెను. అచ్చయ్య యను మంత్రికి మంగమ్మ వలపు నేస్తముగా నున్న విషయమును గ్రహించిన విజయరంగ చొక్కనాథు డామెను నామె నివసించుమందిరమునందే నిర్బంధించి బాధించెనట! తుదకా మహారాణికి పట్టెడన్నముకూడ కరవయ్యెనట. అన్నములేక కృశించిపోయి, మధుర నేలిన మహారాణి మంగమ్మ కడపటి దైనికము చెందెను. 'ఈ వృత్తాంతము మంగమ్మ కలుషిత శీలమును వ్యక్తమొనర్చుచున్నది గదా! కనుక మధురమంగా పుంశ్చలీ లీలావిలాసమున నుదాహరింపబడిన విషయములలో కొంత వఱకైనను సత్యముండు నేమోయని నుడువదగును.

మంగమ్మగారి వ్యక్తిగత జీవితమునువీడి, విశాల హృదయముతో నామె రాజకీయముగ సాధించిన విజయములను, సంఘ సంక్షేమదృష్టితో నొనరించిన మహత్కార్యములను (సత్రములు, చావడులు, మందిరములు మున్నగువానిని నిర్మించియు, చెఱువులను బావులను త్రవ్వించియు నామె సంఘమునకు చిరస్మరణీయమైన సేవ యొనర్చెను.) ప్రదర్శించిన మతి సహనమును - పరిశీలించితిమేని మంగమ్మ సాటి లేని రాణి యని నుడువదగును. ఏది యెట్లున్నను నేటికిని జనత సభక్తికముగ స్మరించుచున్న మధుర నేలిన మహారాణి మంగమ్మ నిజముగా ధన్యురాలే!

1. మంగమ్మ వ్యక్తిగత జీవితమునకు సంబంధించిన కొన్ని విషయములు నాకుఁ దెలియఁజేసిన శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారికిఁ గృతజ్ఞుఁడను.

1. చూడుడు : *R. Satyanatha Iyer The History of the Nayaka of Madura."*

# గోదావరి






శ్రీ బొడ్డు బాపిరాజు

తల్లీ! గోదావరి! నీ
పిల్లలపై నెన్నిపగలు ప్రేరేచినవో?
ఇల్లూ వాకిలి వెల్లువ
కొల్లలుగా నుడిసి నవ్వుకొని పొంగితివే!

అల్పుల్ మానవులెంత? వారల భవిష్యంబెంత? మున్నీటిపెన్
వేల్పుం బట్టపురాణి వీవలిగిరావే కాక, ఈయూళ్లు, ఈ
పొల్పుల్ పిచ్చుకగూళ్లుగా కరగిపోవో! ఈ మహానర్థ సం
కల్పం బేటికిగల్గె నేటికి? జగత్కళ్యాణ సంచారిణీ!

చల్లని తల్లి! నీ చెరగుచాటున నిచ్చట పాడిపంట వ
ర్థిల్లిన శ్రీ విహారములు, తిరములియ్యవి; నేడదృష్టముల్
చెల్లి, భవ జ్జల ప్రళయలీలకు రంగములై ఎటుల్ కుమా
రిల్లుచు నున్నవో, అవధరింపుము నీయ క్రూరథా కథానికల్!

అమృత స్తన్యములిచ్చి, కమ్మని ప్రవాహ శ్రావ్యగీతా నినా
దములన్ జోలలుపాడి, మంద పవనోద్యత్ క్రీడ జోకొట్టి, కూ
రిమిమై పెంచిన క్షేత్రపుత్రికల వీరిన్ అన్నపూర్ణావతా
రములన్ రాక్షసవృత్తి నీ వరదపాల్ సల్పన్ మనస్సొప్పెనే?

పసిపాపల్, ముదివగ్గులున్, పశువులున్, పక్షుల్ జలోద్రేక సా
ధ్వసులై, కూడును గూడులేక విపులాభ్రచ్ఛాయ బాష్పార్ద్ర మ్రా
ద్వసుధాంకమ్మున నిల్చినారదె విషాదవ్యగ్రమానా కృతుల్
అసువుల్ నిల్పిన సాక్షులౌచు భవదత్యాచారముల్ వాకొనన్.

కూలినకొంప కట్టుకొనగూడు నొకింతట; జీవనమ్ము లే
కూలిన యా కుటుంబములు కోలుకొనన్ బ్రదుకెల్ల చాలునో?
తేలవు పంటచే లిసుకదిబ్బలు త్రవ్వక; పోని, త్రవ్వినం
దేలిన దుఃఖదుర్దశలు తీరెనె, ఊళ్లవి వట్టి బీళ్లుగా!

వరుణ విరోధభావము లవగ్రహముల్ కలిగింప, కుంది వం
దురు టయినంతలో నిలువుదోపిడి దోచిన వీయపార దు
ర్భరములు నీ యనుగ్రహము లంబిక! ఎన్నఁడో రామపాద సా
గరమున నానకట్ట గలుగన్ మరిసాగునె నీ ప్రతాపముల్?

ఏ గ్రహకూటముల్ మొనసి ఇంత ఘటిల్లెనో! రాష్ట్రభోగ న
వ్యగ్రములైన ఈ శుభదినాను భవమ్ముల గుండెలాగు నీ
యుగ్ర తరంగతాండవ మొహో! ఎదురయ్యెను.—- సాధు దేవతా
నుగ్రహముల్ శమించెనె అనుంగు తెనుంగుల వార్ధి సుందరీ!

స్వాదుపయస్వి నీ! మధురసంస్మృతి తోచును భావవీధి, వి
ద్యాదయితుండు నన్నయయు - తత్కృతి భారత - ముజ్జ్వల
ద్రసామోదముతోడ. మా తెలుగు భూముల కేడుగడైన పెద్ద ము
త్తైదువ వీవు; పాడియె దురాగ్రహముల్? అనుభావతారికల్!

దుడుకుం గిన్నెరసానివో, శబరివో తోడై నినుం ద్రోయగా
నడుగుల్ సాగక, ఎంతజాలివడి యందందాగి యుప్పొంగినన్
కడకిట్లే స్వజనోగ్రమార్గములు ద్రొక్కన్ తప్పదోగాక, నిన్
గడు శాంతాకృతినిన్ ఎరుంగరటె అంకస్థాను లిన్నాళ్ళుగా!

జీవనమూర్తి వీవు తొలిజేసిన మేళ్ళవి కోటి గాలికిం
బోవగ, నిల్చిపోవునిక ముద్రగ నీ ఒకకీడు తల్లి, గో
దావరి! నీ కృపా మధురధారలలో విషబిందువట్లు.—— సం
భావన సేయ ఆంధ్రుల తపఃఫలరూపము లీవు, కృష్ణయున్.

నీ యడుగు పసిడి యందెలు
మ్రోయగ స్వర్గమును విలిచె మునుపానీమల్!
నీ యసివారుల నిపు డ
న్యాయముగా నలిగి నరకమైనవి జననీ!

———



అప్సరః కన్య

# సిత్తణ్ణ వాసల్ భిత్తి చిత్రాలు

శ్రీ వేలూరి రాధాకృష్ణ

భారతదేశంలో చిత్రలేఖనం అనేక విధాలుగా సాధన చేయబడింది. చిత్రాలు కాగితాల మీదనేకాకుండా, కాగితం అనేది స్వరూపంలోనికి రాని అనాదికాలంలో, గోడలమీదా, కొండగుహల్లోనూ భావసందర్శనంకోసం విరివిగా రచించబడినవి. ఈ గోడలమీద చిత్రించే రచననే భిత్తి చిత్రరచన (Fresco Painting) అంటారు. ముఖ్యంగా ప్రాచీన యుగంలో మన భారత కళావైదగ్ధ్యం శిల్పాలద్వారానే కాకుండా, భిత్తిచిత్రాలద్వారాకూడా ప్రపంచం నలుమూలలా పాకింది. పూర్వకాలంలో భిత్తిచిత్రాలు, సారస్వతసార్వస్వం కోసం రచింపబడేవని వినికిడి. అందువల్లనే కాబోలు రాజశేఖర పండితుడు ఆయా చిత్రకారుల్ని కవులుగానూ, పండితులుగానూ కొనియాడినాడట. ఆవిధమైన చిత్రరచనకు ఆయన 'చిత్రలేప్యకృతి' అని పేరు పెట్టాడట. రాజశేఖరుని సాహిత్యమీమాంసలో, ఈ 'చిత్రలేప్యకృతిని' గూర్చి ఎంతో వ్రాయబడిందిట.

'ముద్రారాక్షసము' అనే సంస్కృత నాటక గ్రంథంలో ఆకవి భిత్తి చిత్రరచనగూర్చి కొంత అపోహపడి 'సైవేయం మమ చిత్రకర్మరచనా భిత్తిం వినా వర్తతే' అని వ్రాసాడట! ఆ అపోహ ఎందుకు కలగవలసివచ్చిందో, అప్పటి పరిస్థితులకు ఒదిలివేయవచ్చును.

అసలు భిత్తిచిత్రాల చరిత్రనుగూర్చి మనం తెలుసుకోవలెనంటే, అజంతా, బాగ్, రామగర్ గుహాలలో రచించిన చిత్రాలే ప్రాతిపదికగా తీసికోవాలి. ఇంతకన్న ప్రాచీనమైనవీ ఉండవచ్చును. వాటి ప్రాముఖ్యత అంత వెల్లడికానందువల్ల, ముఖ్యంగా పైనుదహరించిన గుహాలలోని భిత్తి చిత్రాలవిషయమే మొదటగా ఎత్తవలసి వచ్చింది. మొదటిదైన అజంతా భిత్తి చిత్రాలశోభ, విన్నాణం మనకందరకూ ఎక్కువగా తెలిసినదే. మిగతా రెంటివిషయం నైపుణ్య విమర్శనలో తరువాత ప్రస్తావించవచ్చును. ఈ మూడూకాక దక్షిణాదిన వెలయించిన భిత్తి చిత్రాలు చాలా ప్రశంసాపాత్రమైనవీ అజంతా చిత్రాలతో సరితూచతగినవీను. అవియే సిత్తణ్ణ వాసల్ భిత్తి చిత్రాలు. ఇంకా పరిశోధన చేసి కనుగొంటే ఇలాంటి అద్భుత కళా పూర్వస్థలాలు పూర్వ దక్షిణాపథాన మగధ కళింగ రాజ్యాలలో ఎన్నైనా కనుగొనవచ్చునని నా ఆశ.

ఈవిధమైన భిత్తి చిత్రరచనకు భావపోషణ నిచ్చింది క్రీస్తుశకానికి కొన్ని శతాబ్దాల పూర్వం భారతదేశంలో ప్రచారమవుతున్న జైన, బౌద్ధ శైవ

మతాదులని తెలుస్తుంది. ఆయామతాల అలంబన కొరకు ఆలయాలు వెలసినవి, ఆలయాలలో శిల్పాలు వెలసినవి. అందుకొరకే చిత్రాలుకూడా రచించ వలసివచ్చింది. ఈ చిత్రరచనకు ఆయామతాల తాలూకు స్వాములే పూనుకున్నారనీ మంచి ప్రావీణ్యంతో భిత్తిచిత్రాలను రచించారనీకూడా అజంతా గాథను బట్టి విశదమౌతున్నది. అందుమూలంగా ముఖ్యంగా చిత్తన్న వాసల్ భిత్తి చిత్రాలుకూడా మంచి కుశలురైన మహావిద్యులచేతనే రచించబడినవని తెలుస్తోంది. ఈ చిత్రరచనను గూర్చిన ప్రశంస పాండిచ్చేరిలోని ఒక ఫ్రెంచి ప్రొఫెసరైన జోవియో డుబ్రీల్ అనే ప్రముఖునిచే ఆయన వ్రాసిన ఒక గ్రంథంలో ఉదహరించబడిందని విశదమవుతున్నది. దానినిబట్టి చిత్తన్న వాసల్ భిత్తి చిత్రాలు పల్లవ రాజుల పాలనలో రచించబడినవనిన్నీ ముఖ్యంగా మహేంద్రవర్మ భూపాలుని సమయంలోననిన్నీ తేట తెల్లమయినది.

భారతదేశం, ఏడవశతాబ్ది ప్రారంభంనుంచీ అనన్యసామాన్యులైన భూపాలుర చేత పాలించబడింది. నర్మదానదికి ఉత్తరభాగానవున్న దేశమంతా కనౌజ్ లోని హర్షవర్ధన మహారాజుచే పాలించబడింది. ఈయన చాలా ఉదాత్తభావాలు కలిగినరాజు. మోక్ష మహాపరిషదనే పేరుతో గంగా యమునల సంగమప్రదేశాన, తనరాజ్యంలో నిల్వగానున్న ధన రాసులనన్నిటినీ దానంచేసేవాడుట. ఈ మహా దానం తన మతప్రచారానికి కావలసిన విశేష గుణాన్ని అందరికీ తెలియటంకోసం, జరుగుతూవచ్చిందని చరిత్ర చెబుతుంది. నర్మదకు దక్షిణంగానున్న ప్రదేశమంతా చాళుక్యరాజైన పులకేశిచేత పరిపాలింపబడింది. కొన్ని వేల గ్రామాల విస్తీర్ణంకల 'మూడు మహారాష్ట్రదేశాల నేలిన మహారాజ'ని ఇతనికి పేరు! ఈ చాళుక్య రాజ్యపాలనగూర్చిన వైభవం భారతదేశందాటి ఇరాన్ దేశంవరకూ పాకిందనీ ఆ దేశానికీ ఈ దేశానికీ అందుమూలంగా రాయబారు లున్నారనీ గౌరవ మర్యాదలూ ఇచ్చి పుచ్చుకోవటాలూ అవిధంగా జరుగుతూవచ్చినవనీ చరిత్రాంశం. ఇంక దక్షిణపథాన ఆసమయంలోనే



దేవదాసి

ద్రవిడదేశాన్ని మహేంద్రవర్మ పాలించాడు. ఈయన రాజధాని కాంచీపురం. ఈ కాంచీపురానికి చాలా ప్రఖ్యాతిఉంది. నలందా విద్యాపీఠానికి ఆచార్యుడుగానున్న శీలభద్రునికి, ముందువాడైన మహాతత్త్వవేత్త ధర్మపాల బోధిసత్త్వనిజన్మస్థానమే కాంచీపురం. ప్రఖ్యాతనైనా యాత్రికుడు హియోన్‌సాంగు ఆయన ప్రచార విశేషాలలో "భారతదేశ దక్షిణ సముద్రముఖాన నిర్మించినట్టిదీ, సింహళదేశానికి సముద్రయానం మూడుదినాలుపట్టే దూరం ఉన్నటువంటిదీ" అని వర్ణించాడు. హియోన్‌సాంగు ఈ కాంచీపురంలో నరసింహవర్మ పరిపాలన సమయంలో చాలా కాలంగడిపాడు. ఆసమయంలోనే పల్లవరాజులపాలన అత్యున్నతస్థాయికి వెళ్ళింది.

మహేంద్రవర్మరాజు, సమకాలికుడైన కనౌజ్ పాలకుడు హర్షవర్ధనునిమాదిరిగానే చాలా ప్రజ్ఞకలవాడూ, సకలకళాకోవిదుడూను. అసలు పల్లవరా



పద్మపాణి గంధర్వుడు.

లకు 'లలితకళాకోవిదుల'నే బిరుదం అనుపూర్వంగా వస్తూఉన్న దేను. ప్రొఫెసరు జోవియో డెబ్రిల్ వ్రాసినప్రకారం మొదటగా తమిళ దేశంలో శిలలతో అత్యుత్తమమైన ఆలయాలను నిర్మించడం శిల్పాలనూ ప్రతిమలనూ మలచడం ఈ మహేంద్రవర్మ రాజే ప్రోత్సహించాడని తెలుస్తున్నది. గుహాలయమైన మండగప్పట్టులోని ఒకరాతి శాసనాన్ని చదివితే ఒక చిత్రమైన సత్యం బయటపడింది. అదే:

"ఏతత్ అనిష్టకమ్, అద్రుమలోహమ్ అసుధమ్ విచిత్ర చిత్తేన నిర్మాపితం నృపేణ బ్రహ్మ ఈశ్వర విష్ణు లక్షితాయతనం" అని "ఇటికలు లేనటువంటిన్నీ, కలప లేనటువంటిన్నీ లోహం లేనటువంటిన్నీ గచ్చు లేనటువంటిన్నీ ఈ దేవాలయం బ్రహ్మ, ఈశ్వర, విష్ణుమూర్తులకై విచిత్రచిత్తుని చేత నిర్మించబడినది" అని అర్థం. ఈ 'విచిత్రచిత్తుడ'నే పదం తనను గూర్చి చెప్పుకున్నప్పుడు ఉపయోగించే బిరుదాలలో ఒకటి. ఈయనకున తెలుగులోనూ సంస్కృతంలోనూ మరికొన్ని బిరుదాలున్నవి. అవి: 'చిత్రకారపులి' (అంటే చిత్రకారులలో బెబ్బులివంటివాడు!) అవని భాజనుడు, మత్తవిలాస, గుణభార, శత్రుమల్ల మొదలైనవి. ఈయన మహాకవికూడా. కంజీవరానికి ఏడుమైళ్ళ దూరంలోనున్న మామండూరు గుహాలలో ఒక రాతిశాసనంవుంది. ఆశాసనం ఈ మహీపాలుని మహాకవిగా, మహాగాయకుడుగా వర్ణిస్తుంది. ఈయన 'మత్తవిలాసప్రహసన'మనే సంస్కృత గ్రంథాన్ని 'ప్రహసన'రూపంలో వ్రాశాడు.

ఈసిత్తన్నవాసల్ ఆలయం పుదుక్కోటకు వాయవ్యంగా తొమ్మిదిమైళ్ళ దూరాన—పల్లవదేశంలో మధ్యగా—కృష్ణానదీ దక్షిణతీరాన నిర్మాణమైవుంది. పల్లవరాజుల పాలనా వైదగ్ధ్యాన్ని చాటుతూవున్న కొన్ని అతిముఖ్యమైన రాతిశాసనాలు ఈ సిత్తన్న వాసల్ నలువైపులా కొద్ది కొద్ది దూరాలలోనున్న నార్తమలై, మలైయాడిపట్టి కదిమియామలై, కన్నందార్ కోయిల్ అనే ఊళ్ళలో ఉన్నవి. వాస్తుశాస్త్ర సిద్ధాంతరీత్యా, ఈ సిత్తన్న వాసల్ మామండూరు గుహాలతో సమానమైన శిల్పవిజ్ఞానం కలది. ఈ గుహాలయం జైన మతరీత్యా నిర్మాణం అయింది అంటారు. కాని శైవేతిహాస రూపకంగా కొన్ని చిత్రాలు అందులో కానవచ్చినవి. ఈగుహాలయాన్ని ఒకేరాతినుంచి మలచినది,మహేంద్రవర్మరాజ బృం మైన మతగురువులూ స్నేహితులూను. ఆతరువాత మహేంద్రవర్మ అప్పార్ స్వామి బోధనలలో మ తరుడయ్యాడు.

అప్పార్ స్వామి మొదటిలో జైనమతంలో వాడు. ఆసమయంలో ఆయన 'దేవసేనుడు'గ పిలవబడుతూండేవాడు. తరువాత జైనమతంనుం-విరమించి, శైవమత గురువైన 'తిరుజ్ఞాన సంబంధర్' తో కలిసి జైనమతానికి వ్యతిరేకప్రచారం సాగి చాడు. కొంతకాలానికి అప్పార్ కూడా జైనమ గురువులలో ప్రథముడయ్యాడు.

ఆది మహా పరీక్షాసమయం. మతాలలో అ తిమైన సంచలనం కలిగింది. బౌద్ధమతం చా ప్రచారమైన, గణ్యమైన మతమైనా దానికి పత

వచ్చితీరింది. బ్రహ్మమతంలో నెమ్మదిగా ఐక్యమయింది. అలాగే శైవమత ప్రచారం తమిళ గురువర్యుడైన 'మాణిక్య వాసగర్' చేత విశేషంగా చేయబడింది. ఈ విశేష ప్రచారంవల్ల జైనమతం పతనం కావలసివచ్చింది. ఆసమయంలోనే నటరాజు ప్రాదుర్భావం జరిగింది. ఆశివదేవుడు మహాశిల్పరూపంలో వెలసి ప్రపంచానికే జ్ఞానోదయం కళోదయంకూడా కలగజేశాడు! ఉత్తరభారతంలో వైష్ణవప్రచారం ఎంత విశేషంగా జరిగిందో, అంతవిశేషంగానూ, దక్షిణాన శైవమత ప్రచారం జరిగింది. ఈ శైవమతం ప్రజల హృదాయాన్ని కరిగించేసింది. అప్పార్ సుందర మూర్తుల గానమాధుర్యంలో దక్షిణదేశమంతా పరవశమైంది. ఈ పరవశంలోని పరిణామమే దక్షిణాది కంచుప్రతిమల, కళారూపంలో గమనించవచ్చును. ఈకళాప్రతిభ ఈ మతౌన్నత్యం, మహేంద్రవర్మ పోషణ, పాలన, లోనే కలిగింది. మహేంద్రవర్మ తరువాత పాలకుడైన నరసింహవర్మకూడా కళనీ మతాన్నీకూడా ఎంతో పోషిస్తూవచ్చాడు. ఈ నరసింహవర్మ పాలనాసమయంలోనే అత్యద్భుత శిల్పాలతో విలసిల్లుతున్న ఇప్పటి 'మహాబలిపురం' అప్పుడు 'మహామల్ల'పురంగా నిర్మాణం అయింది. నరసింహవర్మకు మహామల్ల (గొప్పయోధుడు) అనే బిరుదం ఉంది.

సిత్తణ్ణ వాసల్ గుహాలయం సంపూర్ణంగా భిత్తిచిత్రాలతో ఒకానొకప్పుడు అలంకరింపబడినా ఇప్పుడు ఆ మహాఆలయపు పైభాగానమాత్రం వర్ణచిత్రాలు చెక్కుచెదరకండా యున్నవి—అనగా పైకప్పునా పై బురుజులమీదా రాతిస్తంభాల పైభాగాన పైకప్పున రచించిన చిత్రం ఎంతో వైశాల్యం కలది! అది పద్మమయ సరోవరం. ఆ పద్మాల మధ్య మత్స్యాలూ, హంసలూ, మహిషాలూ, ఏనుగులూ ముగ్గురు పద్మపాణులైన గంధర్వులూ చిత్రింపబడ్డారు. ఆముగ్గురి గంధర్వులలో ఇద్దరి శరీరవర్ణం ఎరుపుగా చిత్రించబడింది. మూడవ గాంధర్వునిది పసుపు పచ్చగా చిత్రించబడింది. వారి అభినయం పరివర్ణం, వారి ముఖాలలో ముద్రితమైన ఆనందము కళాకారుల నైపుణ్యాన్ని వేయినోళ్ల చాటుతున్నవి.



అర్ధనారీశ్వర.

మొత్తముమీద ఆ 'పద్మసరోవరం' వర్ణసంకలనంలోనూ రేఖాచిత్రణలోనూ, భావప్రదర్శనలోనూ, ఎంతో ఉత్తమమైనదిగా కొనియాడబడినది. ముఖద్వారాన ఉన్న పెద్ద రాతిస్తంభాల బురుజులమీద చిత్రించిన 'పినగొన్న పద్మాలు' ఎంతో సుందరమైనవి. స్తంభాలచుట్టూ అప్సరస్త్రీలతో అలంకరించారు. కుడివైపుననున్న స్తంభంమీద చిత్రాలు పూర్తిగా శీర్ణమైనవిగాని అదృష్టవశాన ఎడమవైపునవున్న స్తంభం మీది చిత్రాలుమాత్రం చెక్కుచెదరలేదు. దాని మీద చిత్రించిన 'దేవదాసి' చిత్రం అతిమనోహరంగా వుంది. బహుశః మతాచార్యులవారికళలో 'దేవదాసి'కి స్థానం ఇవ్వటానికి ఒప్పుకున్నట్లున్నారు!

జైనమత సిద్ధాంతాన్నే కళాకారులు చిత్రించదలచినట్లయితే 'అర్ధనారీశ్వర' చిత్రాన్ని చిత్రించేవారు కాదని నా అభిప్రాయం. ఈ మహాదేవుని చిత్రం అజంతా బాగ్ చిత్రాలతో పోల్చవచ్చును.

ఆచిత్రంలోని భావ సంపూర్ణత వర్ణసంకలనంలోని చేర్పూ, రేఖాగతిలోని శక్తి అట్టిది. మహాదేవుడు జటామకుటాన్ని ధరించినవాడు. రెండు చెవులకు రెండు వేర్వేరుకుండలాలు అలంకరింపబడినవి. ఆకన్నులోని భావం, అతినిగూఢంగా మహాదేవుని సహజ దివ్యత్వాన్ని తెల్పుతున్నవి. మరింకో చిత్రం గంధర్వుడు, పద్మపాణియై పైనుంచి పద్మసరోవరంలోనికి దిగుతున్నట్లు చూపబడింది. గంధర్వులనూ, అప్సరసలనూ చిత్రించటంలో ఆ కళాకారులకు అజంతా కళాకారులే సాటి! భౌతికం కానిదేదో ఆరేఖాగతిలో ప్రస్ఫుటంగా ద్యోతకం అవుతుంది. అప్సరసల జీవితమే ఒకనాట్యజీవితంగా అర్థమవుతుంది. ఆ సలలితమైన శరీరాలూ, ఆ అర్ధనిమీలిత నేత్రాలూ సంభ్రమపూర్వమైన అధరాలూ, నిగూఢమైన దివ్య తేజస్సూ పరచింతనకు పురిగొల్పే విధానాన్ని తెలియబరుస్తవి: అందువల్లనే ఆ సమయంలోని శిల్పులే 'నటరాజు'ని సృష్టించగల్గా రనిపిస్తున్నది. 'దివ్యనటన'కు ఆదర్శమే 'నటరాజు'!

చిత్రసరళినిబట్టి అవి జైనమతావలంబనకు పురిగొల్పేవి కావనేది ఇందుమూలంగా తేలుతున్నది. చరిత్ర జరిగినప్రకారం జైనమత సమయంలో చిత్రనిర్మాణం జరిగినా శైవమతానికి దగ్గరగా ఉన్నట్లు చిత్రకారుల వాక్కునుబట్టి తేలుతున్నది.

మతవిషయ భేదాన్ని చరిత్రకారులకు ఒదిలివేసి భిత్తి చిత్రశోధనే మనం కొనియాడదగినవారము. భిత్తి చిత్రశ్రేణిలో అత్యుత్తమమైన వాటిలో ఒకదానినిగా సిత్తన్న వాసల్ గుహాలయాన్ని చేర్చటంలో నాకేమాత్రం సందేహంలేదు...

---

# శుభాకాంక్ష

శ్రీ బులుసు వేంకటేశ్వరులు

సీ. సృష్టికిఁ బ్రతిసృష్టి చేసిన చండశా
 సనుఁడు గాధిజుఁ డాంధ్రజాతివాఁడు
గౌతమీనది నిచ్చి క్షామంబుఁ బోఁబుచ్చి
 చనిన గౌతముఁ డాంధ్రజాతివాఁడు
బహుసూత్రకర్త ఆపస్తంబుఁడు ఋషీంద్ర
 చంద్రుండు మన యాంధ్రజాతివాఁడు
వివిధ వేదవ్యాస విదుఁడు విద్యారణ్య
 సంయమి మనయాంధ్రజాతివాఁడు ।
గీ. అద్భుతావహ విజ్ఞాన లనుపమాన
 శక్తియుతులైనవా రాంధ్రజాతివారు
 వారి స్మరియించి యుత్సాహవంతుఁడ వయి
 స్వీయరాష్ట్రమ్ము నేలుకొమ్మోయి! ఆంధ్ర!

శా. దానత్యాగపవిత్రతా గుణమహోదారంబు నీజాతి, వి
 జ్ఞాని శ్రేష్ఠులు మానిరాట్టులు మహా శౌర్యప్రసిద్ధుల్ కృపా
 నూనుల్ నీ దగుపూర్వులెల్ల, మహిలో నొప్పారు నాంధ్రా! యనూ
 చానంబైన భవన్మహత్త్వము, స్వరాష్ట్రం బేలుకో మేలుగన్.

మ. నిను నీజాతిని నీదుసంస్కృతిని నీనిర్నిద్రచైతన్యమున్
 వినుతప్రక్రియ నిల్పి నీకును జగద్విఖ్యాతిఁ జేకూర్చి మే
 లొనరం జేసిన యాంధ్రభారతికి భక్త్యుత్సాహ సంపత్తితో
 ఘనరత్నస్థగితప్రపీఠము పయిన్ గావింపు పూజాదులన్.

మ. తమ సర్వస్వము రాష్ట్రసిద్ధికయి స్వార్థత్యాగులై ధారవో
 సి మృతింగన్న మహానుభావులకు, వాసిన్ మాతృసేవన్ మహో
 త్తములై చేసిన పూర్వనాయకులకున్, తత్సిద్ధిమైనట్టి యీ
 సుముహూర్తంబున నాంధ్రులీయుఁడు నమస్సుల్ భక్తి శ్రద్ధాంజలుల్.

మ. వెల యుంగావుత! మాంధ్రరాష్ట్రము జగద్విఖ్యాతమై నూత్నశో
 భల నీనం గని సత్యధర్మ బహుసంపద్వృద్ధియున్ గల్గ, ని
 చ్చలు నాదర్శకమై సుఖావహమునై సర్వాంగ సంపూర్ణమై
 యలరుంగాక! చిరంబునన్ ఘనవిశాలాంధ్రమ్ము నిక్కమ్ముగన్.







Rexona
Rexona

# నిన్న, నేడు, రేపు



'శార్వరి'

ఆ విషయం ఎవరికీమాత్రం ఏం తెలుసు! అది రహస్యం అనటానికికూడా ఆస్టే అవకాశాలు లేవు. రహస్యమే అయితే ఎవరో పసిగట్టివుందురు. అయినా రహస్యాలు దాగుతాయా. జీతం భత్యం లేకుండా రహస్యాల ఆరాకీ తీసేపెద్దలు సంఘంలో అనేకమంది వుంటారాయె! అందులోనూ ముఖ్యంగా పల్లెటూళ్లో! ఏబజార్న ఏం జరిగినా బయటకురాని ముసలమ్మకుసైతం పొద్దూకేవేళకు తెలియవలసిందే... రోజులు, నెలలు, సంవత్సరాలు జరిగినా ఎవరికీ తెలీలేదు గనక అది రహస్యంమాత్రం కాదు. కావటానికి పసేమీ ఆస్కారంలేదు. అంతమాత్రాన ఆవిడకే ఏదో రహస్యంలేదని అనుకోటానికి సుతరామూ వీల్లేదు....

సీతారావమ్మ ఒక్కర్తే ఆయింట్లో బిక్కు బిక్కుమంటూ కాలంగడపటానికి కారణం ఏమిటి? ఆమెకి మగదిక్కంటూ లేదా? వుంటే ఆవిడతో సంబంధం లేకుండావున్నారా? లేకుంటే ఆవిడ పోషణఏమిటి? వెనకెత్తు నలువాగుడవా వున్నదా? అని కొత్తవాళ్ళకి అనుమానాలు కలగొచ్చు ఆమె వొంటరిగా బ్రతకటం చూచి. కాని వూళ్లోవాళ్ళకు అలాంటి అనుమానాలు కలగటానికి అవకాశంలేదు. కారణం సీతారావమ్మను అంతా ఎరుగుదురు! అంటే అందరు ఆమెముఖం చూచివుండకపోవచ్చు. ముఖ్యంగా ఒక విషయం ఏమంటే పల్లెటూళ్ళలో ఎవరు ఎవరికి ఏమౌతారో తెలియకుండా ఎవరికీ వుండదు. ఫలానా వెంకమ్మ ఏనాడు బజార్న నడిచినపాపాన పోకపోయినా, మగవాళ్ళకంటపడ్డపాపాన పోకపోయినా ఆవిడగారి చరిత్రఅంతా ఆమెముఖం చూడని పెద్దమనుషులందరికీ తెలుసు. అలాగే ఫలానా వాంగ్రేదాన్నీ చూచివుండకపోయినా ప్రతిఅమ్మకు ప్రతిపిల్లలు, కొత్తకోడళ్ళకు సైతం అతని ప్రవర్తనను గురించి తెలుసు.

సీతారావమ్మ అలాంటి కోవలోని స్త్రీ. ఏనాడూ బయటకువచ్చి ఎరగదు. వెంకటప్పయ్య బ్రతికున్న రోజుల్లోగూడా అలాగే కాలం గడుపుకొచ్చింది. గౌరవాన్ని నిలబెట్టుకోగలిగింది. మొగుడు పోయేనాటికి 'నాగు' బొత్తిగా అయిదేళ్ళవాడు. మిగిలింది అయిదెకరాల కుంట. 'నా' అనే బంధువులంటూ లేకపోవటంచేత కొడుకుని పెంచి పెద్దవాణ్ణి చేసే భారం తనపైన వేసుకుంది.

నాగు పెద్దవాడై, చదువు సంధ్యలు పూర్తి చేసుకునేనాటికి వాళ్ళకు మిగిలింది శూన్యం. ఉన్న పొలం కాస్త చదువుకి హారతి కర్పూరంలా అయిపోయింది. అదిఒక లోపంకూడా కాదు. ఎందువల్లనంటే నాగు ఒకఉద్యోగం సంపాదించుకున్నాడు. యితరులపై ఆధారపడవలసిన అగత్యం లేదతనికి. నాగు ఉద్యోగంలో చేరి నాలుగు సంవత్సరాలయింది. ఈ నాలుగు సంవత్సరాల్లోను ఒక్కసారికూడా యింటికి రాలేదు. ఎందుకురాలేదో ఎవరికీ తెలీదు. కాని అందరూ అనుకుంటారు 'అతనికి రావల్సిన పనిమాత్రం ఏమిటి' అని. వూళ్లో పెద్దలంటారు 'ఈ కుర్రకారంతా అంతే. కాస్త ప్రయోజకులైతే సరి ఉన్న వూరు, తిన్న తిండికూడా మర్చిపోతారు.'

అదీ నిజమేనంటారు చాలమంది. అనేకమంది చదువుకునేరోజుల్లో అనేకమంది పెద్దల్ని ఆశ్రయించి, తిండికే డబ్బుకూ గూడా, ఉద్యోగాలు సంపాదించేసరికి వారిని మరచిపోవటంకద్దు. ఉదాహరణకు వారాలుచేసుకుని చదివే కుర్రాళ్లనే చూడండి. ప్రతివారం తప్పని అతిథిగా తయారై నాలుగైదు సంవత్సరాలు యింట్లో మనిషిగావుండి చివరకు మర్చిపోవటంకద్దు. అలా వారాలుచేసుకుంటూనే కంటికింపైన అమ్మాయిలు కనిపిస్తే ఏదో అవస్థపడటం, చివరకు చెప్పుదెబ్బలుదాకా వచ్చి, చదువులకు ఉద్వాసనచెప్పి వెళ్ళిపొయ్యేవారి విషయంకాదు. కాని 'నాగు' అలాంటి ప్రమాదాలకు లోనుగాలేదు ఏనాడున్నూ. అయితే ఉన్నది కాస్త పూర్తయింది'లేదు' అని అనిపించుకోకుండా చేసుకోవటంకోసం.

నిజంచెప్పాలంటే 'నాగు'కు ఆవూళ్లో ఏమిటి పని. పొలం పుట్రావుంటే నూచేందుకైనా వచ్చి వుండేవాడు. అలాంటి ఆమాంబోటు ఏమీ మిగలలేదు. ఎవరైనా పీక్కుతింటారనటానికి బాకీలుకూడా లేవు. స్నేహితులంటూ బహుశా వుండకపోవచ్చు. అతని మనస్తత్వం అర్థంగాదు. 'అసలు అతని తత్వమే అంతరా' అంటారు తలనెరసిన పెద్దలు. నాగుని చిన్నప్పటినుండి ఎరిగున్న వూరివాళ్ళు. చిన్నతనం నుండి నాగు ఎవరితోనూ పరిచయం పెట్టుకునేవాడు గాడు. బజార్న నడుస్తున్నా ఎవరితో జోక్యం కలిగించుకోడు. "ఏంరా! నాగూ ఏలా చదువుతున్నావ్" అంటే అదోలా మొఖం పెట్టి 'నీకెందుకేం అన్నట్టుచూచి' తలవంచుకు వెళ్ళిపొయ్యేవాడు చిరునవ్వుతో... ఈ మనుషులు ఎందుకు అనవసరంగా జోక్యం కలిగించుకుంటారా అని అనుకుంటో.

పెద్దవాళ్ళతో పరిచయాలు చాలమంది కుర్రాళ్ళకు వుండకపోవటం సాజం. అసలు కుర్రకారుకి పెద్దవాళ్ళనిచూస్తే భయం. తమ చదువుల విషయం ప్రశ్నిస్తారని. ఈ ముసలివాళ్ళు వేసే ప్రశ్నలుకూడా చాల గమ్మత్తుగా వుంటాయి. బియ్యే యంఏలు చదివిన వాళ్ళుకూడా సమాధానం చెప్పలేరు. 'అరే అబ్బాయిలూ మనవూరి కాలవదాటకండా, కొలవకండా వెడల్పెంతో చెబుతార్రా' అంటారా... మాకు తెలీదు అనటం ఒక్కటే సమాధానం. అయినా కుర్రాళ్లజోలి పెద్దాళ్లకెందుకు నాకు తెలీకడుగుతాను.

'నాగు'ని చూస్తే కుర్రకారుకి ఒకవిధంగా కోపం, ఒకవిధంగా గౌరవం. తమతో కలవడనీ తమ వూసే పట్టించుకోడని, బస్తీకివెళ్ళినా చూచీ చూడనట్టే తప్పుకుపోతాడని కోపం. కాని తమవూళ్లోకల్లా తమలాపల్లీలు కొట్టకండా, శ్రద్ధగాచదివి కాస్త గౌరవమర్యాదలతో, నాగరికతా ప్రపంచంలో బ్రతుకుతున్నాడు అని గౌరవం, నిజం చెప్పాలంటే అదీకూడాకాదు. కాలం ఖర్మంకలసిరాక ఎప్పుడైనా ఫలానా వెంకటసుబ్బయ్య మావాడేనని, రాఘవులు నాకు దగ్గర బంధువనో చెబుతాడుగదా, అంత గొప్పవాడు, చదువుకున్నవాడు ఆమాటఅంటే తమకెంత గౌరవం లభించినట్లు అని వాళ్ళవూహలు. అవి బైటకు చెప్పరు. ఎంత చదువులేనివారయినా తమ తక్కువతనాన్ని వొప్పుకుంటారా, ఎదుటివాడి గొప్పతనాన్నయినా తక్కువచేస్తారుగానీ.

వూళ్లో పిన్నా పెద్దా ఏం అనుకున్నా, అనుకోకపోయినా 'నాగు'కి మరేంబాధలేదు. అతను వాళ్ళలోకి ఎట్టాగూరాడు. వాళ్ళతోకలిసి తిరిగేదీ లేదు. ఫలానా నాగు అని చెప్పుకునే గర్వం,అదృష్టం వారికుండటం అతనికేం అభ్యంతరం! మొత్తానికి నాగు ఆవూరివాళ్ళలోకే—ప్రత్యేకం.

"ఊరందరిదీ వొకదారి వులిపికట్టెది వొకదారి అంటారు" ఊరువాడ ఏకమైతే మాత్రం సీతారావమ్మకు నాగుకి సంబంధంలేదని అనగలరా! ఎంతయిదయినా తల్లీ, కొడుకు.

సీతారావమ్మ తత్వం తెలిసినవాళ్ళు—చాలమందికి ఆమెతత్వం తెలీదు నిజానికి—ఆమె గర్విష్టి అనరు. అంటే వాళ్ళపాపాన వాళ్లేపోతారు. ఆమెకు ఏం జూదుకుని గర్వం. పెద్దఆసామీ పెళ్లాంగనకనా... పెద్ద అందమైనదిగనకనా. అదీలేదు యిదీలేదు. చాల సామాన్యమైన అందం.సంపద అంతకన్న సామాన్యం. ఎందరు వొప్పుకున్నా వొప్పుకోకపోయినా ఆమెకు ఒకవిధంగా గర్వం ఎక్కువే. 'నాగు' చదువు, ఉద్యోగంచూచిగాని మరే ఐశ్వర్యమూ చూచిగాదు. అయినామాత్రం ఆమెకొడుకు ఉద్యోగంచేస్తున్నాడు. ఆమె గర్వపడుతుంది... ఏ తల్లికైనా వుంటుంది. తన కొడుకు ఒక వ్యవహర్తయి, గౌరవంగా బ్రతుకుతున్నాడంటే ఆగౌరవం తనకే దక్కినట్టు సంతోషిస్తుంది. కాదని ఎవరన్నాఅంటే ఉద్యోగస్తుల తల్లుల్ని అడగండి తెలుస్తుంది?

నిజంగా, గర్వంకాకపోయినా, అదోవిధమైన ఆనందం ఆమెకి. తనకొడుకు ఫలానా 'నాగు' అనే స్పృహ వుండకపోవచ్చు. కాని వూళ్లో అందరుస్త్రీలు

పొంచే సంతోషానికి సీతారావమ్మ సంతోషానికి తేడా అక్కడే...ఆమె ఆనందం అద్వైతం.

'నీకేవమ్మా పిన్నీ..బంగారంలాంటి కొడుకు.. నిక్షేపంలాంటి ఉద్యోగం' అని ఎవరన్నా అంటే 'ఊ' కొట్టి ఊరుకునేది.

'సీతారావమ్మత్తయ్యా, నాగుబావ ఎప్పుడూ రాడేం' అని పెళ్లికాని పిల్లలు, కావటానికి పెద్దవాళ్ళే అడుగుతూండేవాళ్ళు; వాళ్ళవాళ్ళ మనసుల్లోని కోరికల్నీ, భావాల్నీ పదిలపరచుకొని. సీతారావమ్మ ఇట్టే వాళ్ళను అర్థంచేసుకుని మనస్సులో ఆశీర్వదించేది వారిని. ఏం సమాధానం చెబుతుంది. 'నాగు' రాకపోవటం ఎన్నివిధాల ఆలోచించినా తనకంటె తన చుట్టూ వుండేవాళ్ళకే ఎక్కువ బాధాకరంగా తోచేది. ఆ అమ్మాయిలు అడిగటంలో అంతరార్థం లేకపోలేదు. కారణం వుండనేవుంది. 'నాగు'కి పెళ్ళికాలేదనే విషయం రూఢిగా అందరికీ తెలుసు. పెద్దలు అనుకునేవాళ్ళు, ఏదో అన్నట్లు అవసరాలు తీరుతుంటే పెళ్ళెందుకు వాడికి' అని. వాళ్ళదృష్టిలో అతనో తిరుగుబోతని కాదుగాని, తమకు అందరాని పండుఅని.

ఒకసారి సీతారామమ్మ మనస్సు చివుక్కుమంది. అది ఏదో, ఎవర్నిగురించో అయితే ఆమెకంత బాధ కలక్కపోను. 'నాగు'ని గురించి యితరులు ఆడిపోసుకోవటం ఆవిడ పరిభాషలో. అతడు సుఖపడిపోతున్నాడని ఆదుర్దా. అసూయ, ద్వేషం. 'వాడింకా మనవాడు అవుతాడని నమ్మకంగేంటి...వాడిపోకలు, డాబులు చూస్తే ఎవరికైనా అంతే అనిపిస్తుంది' అని. "ఇంతకీ ఆ సీతారావమ్మ చేసుకున్న పాపంలే" అని. 'వాడికైవాడికి తోచాలిగాని ఒకళ్ళు ఎంతకాలమని చెప్తారు' అని రకరకాల ఊరివాళ్ళలా చెప్పుకోటం సీతారావమ్మ చెవినిబడ్డది. 'నాగు' చేసిన తప్పేమిటో ఆమెకు అర్థంగాలేదు. తెలివితక్కువవాడు అనటానికి వీల్లేదు. అవకతవకపనులు చేయటానికి. నెలనెల తనకు డబ్బు పంపుతూనే వున్నాడు. పెళ్ళి పెటాకులు లేకుండావున్నాడంటే అది నిజంగా తన అశ్రద్ధ. బుద్ధికుదిరి కావాలన్నప్పుడే చేసుకుంటాడు. వాడి పెళ్ళివిషయం నేనెందుకు కలగజేసుకోవాలి' అని అనుకునేది. కనకనే 'నాగు'కూడా అశ్రద్ధ చేయగలిగాడు. తనూ నిజంగా ఆ విషయంలో ఎప్పుడూ పట్టుబట్టలేదు. కారణం పెళ్ళయినవాళ్ళంతా ఏం బావుకుంటున్నారు గనక. పెళ్ళి ఆపైన పిల్లలు...సంసారం ప్రాణానికి సుఖంవుండదు. చూస్తూ లేవున్నాంగా... చూస్తూచూస్తూ వాడికెక్కడ ఒకగంతను అంటగట్టేది. కొన్నాళ్ళయినా లోకానుభవం చేసుకోనీ అని ఆమె అనుకున్నది.

ఇప్పుడు మరీ పూర్ణమ్మపోరు ఎక్కువైంది. పూర్ణమ్మకేంవెనక బాగావున్నది. సంసారాన్ని ఈదుకొస్తుంది. మొగుడుంటూ వున్నాడుకానీ పెత్తనం మాత్రం ఆమెదే. పైగా ఒక్కతే కూతురు కమల. ఆవిడది యిష్టారాజ్యం ఆవిడయింట్లో. అదేమని అనేవాళ్ళు లేరు. మొగుడ్ని దద్దమ్మనుచేసి కూర్చోబెట్టి, పెత్తనం చలాయిస్తుంది అని కానివాళ్ళు, గూనిలేని వాళ్ళు అంటే అనొచ్చు. పూర్ణమ్మకేంనష్టం. ఈ మధ్య పూర్ణమ్మకూతురు కమలకూ నాగుకూ చక్కని ఈడుజోడు అనే రహస్యం కనుక్కున్నది. చాలా కాలం ఆవిడకు ఆవిషయం తెలియనే తెలియదు. ఎవరూ చెప్పనైనా లేదు. ఒకరోజు కమలను చూస్తూ వుంటే చప్పున సీతారావమ్మ, వాళ్ళ నాగు తలపుకొచ్చారు.తన కమలంపక్కనే నాగు నిలబడివున్నట్లు, ఒడ్డూపొడుగూ బావున్నట్లు, ఈడూజోడూ సరిపోయినట్లు ఊహించింది. ఒక్కసారి ఒళ్ళు జలదరించింది ఆమెకి. ఆనందం పట్టలేకపోయింది. కమలను గట్టిగా కావిలించుకుని నుదుట ముద్దెట్టుకుని 'నాబంగారం' అని కళ్ళు చెమర్చుకుంది. అదంతా ఆయోమయం అయింది కమలకు. కొంచెంసేపు తల్లిపోల్లోంచి తెప్పరిల్లలేకపోయింది. కమలకు ఆక్షణం ఏదో బాధకలిగి, వెంటనే పట్టలేనంత ఆనందం కలిగింది. తొరతొరగా నిలువుటద్దంముందుకు పరుగెత్తి తనకుతాను ఒక్కసారి చూచుకొని చప్పున నవ్వులో పమిట సరిచేసుకుంది పిచ్చిపిల్ల.

ఆ అనుభూతితోటె పూర్ణమ్మ కూతుర్ని సీతారావమ్మ యింటికి అనేకసార్లు పంపడం జరిగింది. కారణం ఆమెదృష్టిలోకి తనకూతుర్నిగూడా తీసుకురావాలనే. తనూ అపనీ, ఈపనీ వొంకపెట్టుకుని వెళ్ళేది.ఒకసారి మాటమీద మాటవచ్చి పూర్ణమ్మ అడిగింది'ఏడి వొదినా,అల్లుడు ఎప్పుడూ రాడేం..అయినా వొస్తేమాత్రం మాలాంటిబీదవాళ్ళం కనపడతామటలే' అని ఎబ్బెట్టుగా.సీతారావమ్మను అవహేళన చెయ్యాలని పూర్ణమ్మ మనసుకాదు.ఎట్లాగైనా ఆ సంభాషణ పెంచాలని. తనమనసులోముక్క కాస్తా చెప్పెయ్యాలని. నిజంచెప్పాలంటే పూర్ణమ్మకంటె సీతారావమ్మ ఏవిధంగా గొప్ప. యాభయ్ ఎకరాల ఆసామి పెళ్ళాం తాను...సెంటుభూమీ లేనిది సీతారావమ్మ...

'ఏమిటోలే వొదినా...మావాడు అదృష్టమే బావుంటే నీవు అల్లుడూ అని పిలుచుకునే రోజులు

వస్తాయేమో ఎవరు చెప్పగలరు అన్నది. ఎంతయిదయినా యాభై ఎకరాలు. సీతారామమ్మకు ఒక నోములాగా అవుపించింది. నిజం ఆమెకి కమల కోడలు కావడం ఒకవరం, కమల అందమైంది. చూడ చక్కనిది. కలవారిబిడ్డ.

'ఆఁ ఏదో మాటవరసకి అన్నాలే వొదినా... మా అమ్మాయిని మీరు చేసుకోబొయ్యారట్లే...మీ అబ్బాయికి ఎవర్తె కోరకవలసివుందో!' అన్నది పూర్ణమ్మ తనకూతురుకాక ఇతరులైతే 'ఎవర్తో' అయినట్లు...

"ఏం ఎగతాళిచేస్తావే పూర్ణమ్మా.....నీకంటె నాకు అయినవాళ్ళు ఎవరే!"

మొత్తానికి మాటలుకలవటం సంబంధాలు స్థిరపటం కూడా జరిగింది. 'నాగు'ని చూచి పూర్ణమ్మ నాలుగేళ్ళయింది. చదువుకునే రోజుల్లో సెలవులకు వొచ్చేవాడు అంతే. ఈమధ్య రావటమే మానేశాడు. పోనీ ఒక్క ఉత్తరంముక్కన్నా రాసి పిలిపించ కూడదూ. చూచి శానాళ్ళోజులైంది అన్నదిపూర్ణమ్మ.

"ఉత్తరాలకు వొచ్చేవాడటే తల్లీ.....అలా రాడు" అన్నది సీతారామమ్మ...

చివరకు నిశ్చయించుకుంది తానేవెళ్ళి 'నాగు'ని చూచిరావాలని. వీలైతే అన్నివిషయాలుచెప్పి వెంట తీసుకుని రావాలని. చాలమంది అనుకోటమే గాని కొడుకు ఉద్యోగంగురించి ఆమెకేమీ తెలీదు అమాయకురాలు. అంతా గొప్పగా చెప్పుకుంటారు కాని. అనేకమంది చూచివచ్చినవాళ్ళు అలాగేఅంటారు.తను పోవటానికైతేపోగలదు కానీ మగతోడంటూలేకుండా ఎలా పోవటం...ఏం మర్యాద! ఈ అనుమానం పూర్ణమ్మకు తెలిపి మొగుణ్ని పురమాయించింది ఆ పనికి. మహానుభావుడు కదలక తప్పేదేముంది. ఇతరులెవరైనా అంటే కాదన గలడేమోకాని తనపెళ్ళాం అంటం తను కాదం టంకూడానా...అతనితో పోవటానికి సీతారామమ్మ వెనకాముందు చూచింది. కాబోయ్యే వియ్యంకుడారాయెను! తప్పనిసరి. ఎవరో వొకరు తోడు. ఆపదితేణాలు కాదనుకుంటే తీరిపోదు.

మనస్సు స్థిమితంచేసుకుని బైలు దేరింది. పూర్ణమ్మ తృప్తిగా ఆశీర్వదించింది సుఖంగాపోయి లాభంగారమ్మని. కమల తల్లిచాటునుండే కలలు గన్నది. బయల్దేరవమ్మా అక్కయ్యా బండికి టైమయింది అన్నాడు పూర్ణమ్మ భర్త.

బెజవాడ స్టేషనులో బండి మారాల్సివచ్చింది బందరువెళ్ళే బండికి కొంచెం ఆలస్యవుంది. అక్కడే అనుకుంది తనకొడుకు ఎలావుంటాడో. ఎలాముస్తాబై వుంటాడోనని. బందరు బండీలో కూర్చున్నదేగానీ ఆలోచనలు అంతులేకుండా కలుగుతున్నయ్. 'నాగు' రైల్వేలో ఉద్యోగం చేస్తున్నాడు. అదేటికెట్ కలెక్టర్ పని. నిజంగా 'నాగు' కలెక్టరేననుకుంది సీతారామమ్మ. ఒక్కసారి తనను చూచి గుర్తుపట్ట గలడా! ఆశ్చర్యపడుతాడు ఉత్తరం ముక్కైనా రాయకండా వచ్చినందుకు. అతనికి అంతఆశ్చర్యం కలగాలనేగా తను ముందుగా తెలియపరచకండా వుంది.

గుడివాడస్టేషన్‌లో బండీఆగింది. యింకా అర గంట టైం వుంది. బండీదిగింది ఏవన్నా పళ్లు కొందామని...కొడుక్కు తనుకొనటం ఏమిటి. పిల్లా జల్లా వున్నారు అఘోరించిపోతారు అనుకోడానికి యింకా పెళ్ళి కాకపోయె...అయినా ఎందుకైనా మంచిది అవసరంవొస్తుంది అనుకుని పళ్ళుకొనాలని బండీదిగింది. సంచీ చేతిలోనేవుంది. బండిలో వుంచితే ఎవరైనా కాజేయగలరు అయినా ఈ రైలు ప్రయాణాలను నమ్మేదెవరు? దొంగలుంటారు జాగ్రత్త అని వ్రాస్తారుటగూడ.

పండ్లదుకాణం దగ్గరకొచ్చి బేరంసాగించే సందర్భంలో ఒకదృశ్యం కంటబడ్డది. వొచ్చేపోయేజనం హడావిడిగావుంది. అందులో రాత్రిపూట....జన సమ్మర్దం అట్టే లేకపోయినా ఆచీకట్లో, లైటు వెలుతుర్లో అందంగావుంది ఆజనం చూట్టానికి. రైలు ప్రయాణాలు చేసేప్పుడుగూడా ఆడాళ్ళు అందంగా తయారవుగారెందుకో...మరీ ఆ అమ్మాయి పెళ్లికూతురులా తయారైంది. బండీదిగింది కాబోల్సు హడావుడిగావెళుతూంది. సీతారామమ్మకళ్లు ఆ అమ్మాయి మీదికి పోయినయ్. వెనకాముందూ ఆ అమ్మాయికి సంబంధించినవాళ్ళు ఎవరూలేరల్లేవుంది. తోలు సంచీ చేతవూపుకుంటూ వుంది. లైటువెలుతుర్లో మెరిసిపోతోంది పచ్చటి శరీరం. వొంటిపైన చీర వున్నా వొంటికాంతి బయటకు అవుపిస్తోనేవుంది.. తల అదేదోరకంగా దువ్వుకుని నిజానికి తల దువ్వ కుందో లేదో సీతారామమ్మకు అనుమానంగానేవుంది. దువ్వుకుంటే అంత గుబురుగా ఎట్లావస్తుంది చెప్మా. ఆనడక, వొయ్యారం, అంగాల్ని విరజిమ్ముకుంటో ఈఅమ్మాయిముందు కమలఎంత? నిజానికి ఎన్నోవంతు అందం కమలది...ఎందుకోగాని ఆ అమ్మాయిని

యింకా యింకా చూడాలని బుద్ధివేస్తోంది. కాని వెంటబడిచూస్తే ఏమనుకుంటుంది, ఛీ! ఆ వే వ్యూహాలు తనకిమాత్రం. దూరంగా ఆగింది జనానికి దూరంగా...అక్కడ గేటుదగ్గరగా గుంపు. పెట్టుకుంటో తోసుకుంటో అవతలగా తెల్లటోపీ ఆయన దబాయిస్తున్నాడు. తానేదో ఘన కార్యంచేస్తున్నట్లు. తన 'నాగు'కి అదే ఉద్యోగం అలాగే అందరిమీద పెత్తనం చలాయిస్తాడు కామాల్ను. ఎంతగొప్పవాళ్ళయినా, ఎంత డబ్బుగలవాళ్లయినా, ఎంత చదువుకున్న వాళ్లయినా ఆ గేటుదగ్గర అతను ఆగమంటే ఆగాల్సిందే. పొమ్మంటే పోవాల్సిందే! ఏందకే! ఏందకే! అయినా తన 'నాగు' అట్టా అథారిటీ చలాయిస్తాడేం. ఎంతో అమాయకుడు నోట్లో నాలుక లేనివాడు నిజానికి...దయాదాక్షిణ్యాలు కలవాడు తననాగు. అలా చెయ్యడు. ఎన్నటికీ చెయ్యడు.

టికెట్ కలెక్టర్ ఎవరో మెడమీద చెయ్యివేసిలాగి అవతలగా నిలబెట్టాడు. దిక్కుమాలిన వెధవలా వున్నాడు. ఏమిటి అలా బ్రతిమలాడుతాడు. మెడబెట్టి గెంటించుకుంది చాలక. ఆ దిక్కుమాలినవాడు ఎదురు తిరిగి ఆ టికెట్ కలెక్టరిని కొడతాడేమో ననిపించింది. కాని అలా జరగలేదు సరిగదా బ్రతిమలాడుతున్నాడు. అతనో కసురుకుంటున్నాడు. రెండుచేతులా జేబిలో టిక్కెట్లు కుక్కుకుంటున్నాడు. జనం పల్చబడ్డారు. ఎంతో శ్రమపడ్డవాడిలా అతను చెమట తుడుచుకుని మళ్లా పనికి ఉపక్రమించాడు. ఇంకా ఆ అందాలరాసిఅక్కడే నిలబడివుంది. ఎంత ముక్కువ. వాళ్లతో కలిసి తనూ పోకూడదా! కానీ ఆపెది. గొప్పింటివారి ఆడబడుచు అయివుంది. కలవారి కోడలై వుంటుంది. ఆ అమ్మాయి నిగారింపు, చక్కదనం, అణకువ చూడ ముచ్చటగావుంది సీతారావమ్మకు. ఇంకాఅక్కడే వుంది. వెళ్లి తనివితీరా చూద్దామా అనే ఆదుర్దా కలిగింది కాని...కాని!?

జనంఅంతా పోయ్యారు. ప్లాటుఫారంమీద జనంలేరు. ఆ అమ్మాయి అక్కడ్నుంచి కదిలింది. టికెట్ కలెక్టర్ చెయిజాపాడు. ఆమె టికెట్ యిచ్చింది. అదేమిటి పాడు! టికెట్ పుచ్చుకోటానికిబదులు ఆమె చెయ్యిపుచ్చుకున్నాడు. చెయ్యి లాక్కుని రెండడుగులు వేసింది అందాలరాణి. కొటాచి కూచి. సీతారామమ్మ గుండె చల్లబడి తేరుకుంది. పొరపాటున అలా జరిగివుంటుంది అనుకున్నది. ఆ అమ్మాయివెళ్ళిపోయ్యేది తిరిగి ఆగింది. ఏవరికోసం? అక్కడ యింకెవరున్నారు గనక...టికెట్ కలెక్టర్ ఆ అమ్మాయివెంటనే పోతున్నాడు. అదేమిటి. పాడు! అలా వెంటబడటమే. మగాళ్లు ఎవరూ లేరు! ఎవరు ఏమీ అనరు...పోలీసాళ్లతో చెబుతామనుకున్నది. కాని...

అలా ఆలోచిస్తోంది. తన కొడుకు 'నాగు'కి మిగతావాళ్లకు ఎంత తేడావుంది. పుల్లి పుల్లీ, మల్లి మల్లీ నటిగారు. తన 'నాగు' అలాంటిపని చెయ్యగలడా! చస్తే చేయడు. తాను బ్రతికుండగా చెయ్యడు. ఈ టికెట్ కలెక్టర్ల బ్రతుకులే యింతా అని అనుమానం కలిగిందికూడా. కాని తన నాగుని సమర్థించుకుంది.

చెట్టుకింద సిమెంటుదిమ్మపైన కూర్చుని ఆలోచిస్తోంది సీతారావమ్మ...మగాళ్లు ఇంతదండాలంగా ప్రవర్తిస్తారేమా అని. తన జన్మలో తను చూళ్ళేదు ఇలాంటి దగుల్బాజీ వెధవల్ని. మరీ అలా కుక్కలా వెంటబడటంలో అర్థంవుందా. పరువు మర్యాదగల పిల్లలవెంట ఒక్కర్తె వొచ్చినంతమాత్రాన వెంటబడటమే...అయినా అలా ఒక్కర్తెనూ పంపినవాళ్లకు బుద్ధిలేదు. యిన్నేళ్ళు వొచ్చినతనే ఒకర్తె రావటానికి మనసొప్పక తోడు తెచ్చుకుంది. లోకమే మారిపోయింది...అనుకుంటూ తన 'నాగు' ఇలాంటి పాపాలకులోను గాకుండుగాక అని ఆశీర్వదిస్తో ఆ గేటు వేపే చూస్తోంది.

అతను, ఆమె వొస్తున్నారు. ఆమె చెయ్యి ఆయన చేతిలో. ఏమేమిటో నవ్వులు. విపరీతపు చేష్టలు. ఆమె భుజంమీద చెయ్యివేశాడుకూడా... ఇద్దరూ నవ్వుకుంటో వొస్తున్నారు. సీతారావమ్మకు తలకొట్టేసినంత పనయింది. స్త్రీజాతికే అవమానం కలిగినట్టు భావించింది. ఆవిడ ఆ అందాలభరిణను కన్నెత్తి చూడలేకపోయింది. కులాసాకబుర్లు చెప్పుకుంటో రాసుకుంటో వస్తున్నారు ఇవతల తను వున్నాదనే పరిజ్ఞానమైనా లేకుండా. దగ్గరగా... ఇంకా దగ్గరగా వచ్చారు. అతను ఆవెధవ టికెట్ కలెక్టర్ నీతి నియమంలేని కుంక. తలపైన టోపీ తీశాడు గర్వంగా...చేత్తోబట్టుకొని విసురుకుంటో నడుస్తున్నాడు.

సీతారావమ్మకు కాళ్ళు వొణికాయి. వొళ్ళు ఒక్కసారి గగుర్పొడిచింది. తనకళ్లను తానే నమ్మలేకపోయింది. నిజం. అది విధివైపరీత్యం. కాకపోతే నిజంఅవునా, కాదు...బాగా ఆలోచించింది.

సరిగ్గా పోల్చింది. ఎంతకీ కాదనలేకపోతుంది. నిజం అతనే. మనుషుల్ని పోలిన మనుషులు వుంటారా...? కాదు అతనే నిక్కచ్చిగా తనకొడుకు 'నాగు' అతను.

ఏమీ తోచిందిగాదు. తను ఎవరికోసం ఆశలు పెట్టుకుని పోతోందో ఆకొడుకు...ఎవడ్ని ఇంద్రుడుగా, చంద్రుడుగా, నలకూబరుడుగా ఊహించుకుందో ఆమూర్తి. ఎవడు నిర్మలహృదయుడని, అమాయకుడని న్యాయస్థుడని భావించుకుందో ఆ నాగు...ఆ అమ్మాయితో...అందాలరాణితో వెళుతున్నాడు. అలాగే వాళ్లవెనకనే చూస్తోంది. ప్లాటుఫారం చివరవరకు పోవటం చూచింది. తర్వాత చీకటిలో కలసిపోయ్యారు. ఆ తర్వాత వూహించుకోవడం అనవసరం...ఆమెకు అసహ్యం చిరాకు కలిగింది.

'బండి కదిలే టైమయింది రా అక్కయ్యా అక్కడేకూచున్నావేం'అన్నాడు పూర్ణమ్మ మొగుడు. వులిక్కిపడి ఈలోకంలోకి వచ్చింది ఆమె. కళ్ళ వెంట నీటిబొట్లు రాలాయి. 'ఏమిటి' అన్నది.

"బెజవాడ బండి ఎప్పుడు?" అనడిగింది అతన్ని.

"మనం పొయ్యేది బందరు...బెజవాడకాదు" అన్నాడు ఆయన.

"అదికాదబ్బాయ్...మనం బెజవాడ పోవాలి, అక్కన్నుండి ఇంటికి వెళ్ళాలి. నాకేమిటోగా వుంది."

"కారణం?"

"అదంతా అనవసరం...బెజవాడ టిక్కట్టు పుచ్చుకురాపో" అనిగదమాయించింది సీతారావమ్మ.

కుక్కిన పేనులా వెళ్ళిపోయాడు. అతనికేమీ అర్థంకాలేదు. సీతారావమ్మ అదోరకంగా వుంది. ఎందుకో అంత కోపం. ఆమెతత్వం ఆ స్థితిలో అర్థంచేసుకోలేక పొయ్యాడు పాపం. ఎందుకోగాని కొంత భయంకూడా కలిగింది ఆమెను చూస్తూంటే, గత్యంతరంలేక వెళ్లాడు. కొడుకును చూడాలనే ఆకాంక్షతో బయల్దేరిన సీతారావమ్మ ఇలా అకస్మాత్తుగా మారిపోవటానికి కారణం ఏమిటి చెప్మా అని ఆలోచించాడు. కాని అతని బుర్రకు కారణాలు చూపగల ఆలోచనలు ఏవీ కనపడలేదు. తిరిగి బండిలో ఇంటిచేరుకున్నారు.

దోవపొడవునా పూర్ణమ్మ భయం, ఆమె మొగుడికి లేకపోలేదు, ఇంటికిపోగానే పతాయిస్తుంది. "ఆ సీతారావమ్మకు తోచకపోతే మానె నీకైనా బుద్ధి వుండక్కర్లేదుటయ్యా ఎందుకు వొచ్చినయ్ ఏళ్ళు?" అని పూర్ణమ్మ అడిగితే తనేం సమాధానం చెప్పగలడు కల్లబొల్లి కబుర్లకు లొంగేఘటం కాదాయె ఆమె. 'లేదు నాగు దోవలోనే ఎదురయ్యాడు పని అయింది గదా' అని తిరిగొచ్చాం అంటానికి దమ్ములు చాల్లేదు. అబద్ధం ఆడటం అంటే సామాన్యమా అమాయకులకు. మధ్యలో ఒకటి రెండుసార్లు సీతారావమ్మను కదిపి చూచాడు. ససేమిరా సమాధానం రాలేదు సరిగదా 'నీకు తెలీదులే అన్నయ్యా నామనస్సు ఏం బాగోలేదు...ఇప్పుడు నన్ను పలకరించకు' అన్నది. ఇంకేం మాట్లాడగలడు. ఆమె మొత్తానికి బాధపడుతున్నది అనిమాత్రం గ్రహించగలిగాడు. ఆబాధ ఎందువల్లనో, దానికిగల కారణాలు, సాన్నిహిత్యాలు ఏమిటో మాత్రం తెలీలేదు. ఏమిటి తెలుస్తాయి గనక.

సీతారావమ్మ స్థితి మరీ అధ్వాన్నంగా వుంది. చావు బతుకులమధ్య ఉన్నట్లుగావుంది. ఒక వేపునుండి మమకారం పెనవేసుకుంటూంటే రెండో వేపునుండి రోతపుట్టుకొస్తోంది. పూర్ణమ్మ సంగతి దేనుకు చూచాడు. ఎవరు ఎన్ననుకుంటే తనకేం కాని తన 'నాగు' యిలా అయిపోయినందుకే ఆమెవిచారం. అతను ఇంతకాలం ఇంటికేసి చూడకపోవటానికి, పెళ్లివిషయం తెలపెట్టక పోవటానికి కారణం తెలిసింది. వూరిపెద్దలు అన్నారంటే అనరూ! ఇలాంటి పనులు చేస్తుంటె...

సీతారావమ్మకు 'నాగు'తనకొడుకేనని గర్వంగా చెప్పుకునే క్షణాలు ఉదయంతోనే గతించినయ్. తాను గుడివాడస్టేషనులో దిగేవరకు 'నాగు' అక్షరాలా ఆమె కొడుకే అందులో అనుమానం లేదు. అది ఆమెకూడా వొప్పుకుంటుంది. కాని అడంగుకు చేరకుండా గుడివాడనుండి తిరుగముఖం పెట్టినప్పుడే అనుకుంది 'ఇసిగెవ నాకొడుకుకాదు. అయితే యిలాంటి పనెందుకు చేస్తాడు. చేశాడు గనక నా కొడుకుకాదు'అని. లోకం ఆవిషయం వొప్పుకోకపోయినా ఆమెమాత్రం వాచా, మనసా విశ్వసించింది. తనకు తనకొడుక్కీ ఋణంతీరిపోయిందని ఎవరితో చెబుతుంది. అప్రతిష్ఠ పైగా. గప్‌చిప్‌గా వూరుకుంది. ఒక్కటే ఆమె నిర్ణయించుకుంది.

అందులోవున్న నెయ్యిఅంతా అన్నంలో వంచేసుకుని గిన్నె దూరంగా విసిరివేసి, 'నీకు అంతే కావాలి' అని కోపంగా గర్జించేను. మాబామ్మ గోడమూలకు పోయి బిక్క మొఖంవేసుకు నిలిచి పోయింది. ఆవిడ తన పరాజయాన్ని సహించలేక చిన్నపిల్లలాగ ఏడవటం ప్రారంభించింది.

ఇదివరకల్లా మాబామ్మకూ నాకూ జరుగుతూ వుండిన ఘర్షణఅంతా చూస్తూవుండినా మా నాన్న ఎప్పుడూ జోక్యం కలుగచేసుకోలేదు. బామ్మా, మనమడూ చెలగాటంగదా అన్నభావంతో నిర్లక్ష్యంగా ఊరుకునేవాడు. కాని యీ పర్యాయం మాత్రం ఊరుకోలేదు. పైగా, ఊరుకుంటూవున్న కొద్దీ అంతకంతకు పెంకితనం లావయిపోతూవుంది. అని తాను భోంచేస్తున్న చోటునుండి లేవకుండా, వంగుకుని, నన్ను గట్టిగా నాలుగు చరుపులు చరిచింది. దెబ్బలునాలుగూ తగిలిన తరువాత, మాబామ్మ నామీద అభిమానం చూపిస్తూ "పోనీద్దూ, వాడికేం తెలుసు, కుర్రవాగమ్మ, వాడిని అలా కొట్టుకుంటూ రుట్రా, నీకు మరీ మతిపోతోంది.' అని మా నాన్నను కసిరింది. అది వినగానే, ఊరుకున్న మా నాన్న మళ్లీ కోపం తెచ్చుకుని 'వెధవకి, యిప్పటినుంచీ యింత పంతనొట్టుతినమా?' అంటూ నన్ను మరిరెండు తగలనిస్తుంటే, మా అమ్మ అడ్డువచ్చి, "చాల్లెండి, తల్లీ కొడుక్కీ యీ సుంటవెధవే అనువుగా దొరికేడు.' అంటూనన్ను కౌగలించుకుని, అవతలికి తీసుకువెళ్ళి, నా చెయిగకడిగేసి, గదిలోకి తీసుకుపోయింది.

మాబామ్మమీద నాకు కోపంగా వుండడానికి యింకా చాలా కారణాలు వున్నాయి. మాబామ్మని ఎప్పుడు అప్పచ్చిలు చెయమన్నా కొయ్యచెవుగోడీలు, జంతికలూ, 'కొయ్యరొట్టెముక్కలూ యివి తప్ప మరేవీ చేసేదికాదు. మానాన్న హోటలునుండి అప్పుడప్పుడు దూద్ పేడాలు, జహంగీర్లూ, బనారస్ కాజాలూ తెచ్చి, మాబామ్మకి భయపడి, దొంగతనంగా మాకు యిస్తూవుంటే, మాబామ్మ యీసంగతి ఎలాగో పసికట్టి, మామీద మండిపడేది. మానాన్న యిలాంటివి యింటికి తేవద్దన్నా, మేము కిలకిల లాడుతూ తినడమన్నా, మాబామ్మ ఎంతమాత్రమూ చూచి ఓర్చలేక పోయేది. ఎప్పుడైనా పరిహాసానికి 'బామ్మా, దూద్ పేడాలుసెయ్యి బామ్మా' అని మేము అంటే, 'అవేమిటో మాఅబ్బనాడూ తాతనాడూ ఎరగమురా బాబూ! అవి నేనేం చెసిపెడతాను.' అని కోపం దిగమింగుకుంటూ వ్యంగ్యంగా జవాబు చెప్పేది. ఒక నిమిషం ఊరుకుని, 'వెధవలుకి దూద్ పేడాలూ, గేదిపేడాలూ కావాలి! - పెద్దవెధవలకి బుద్ధిలేకపోతేసరి! తెచ్చిన నాలుగుడబ్బులూ యిలాగ తగలబెట్టేస్తుడంమే తెలుసు యీ కాలపువాళ్ళకి. ముందుచూపులేదు, వెనుకచూపులేదు - గేదె పద్దలు గడ్డితిన్నట్టు ఎంతసేపూ తిండి మాలోకవేం. ఇలాగైతే మారోజుల్లో గంపెడు పిల్లలతోటి యింత లేసి సంసారాలు తీగా యీడుచుకురాగలిగే వాళ్లమేనా? ఆయనతెచ్చే నెలకు పదిరూపాయలు జీతంతోటి యింత సంసారం, యింటిగుట్టు బయటపడకుండా, ఎదుటివాళ్ళకి చెయ్యిచాచకుండా, కలోగంజో తాగుతూఉన్నంతలో ఉన్నంత కాలక్షేపం చేస్తూనే, పిల్లలకి పెళ్ళిళ్ళూ పేరంటాలూ చేయించేం, పిల్లలకి చదువులూ సంధ్యలూ చెప్పించేం. ఈకాలపు వాళ్ళకి పొదుపులేదు, చదుపులేదు. చెప్పేవాళ్లు వెర్రివాళ్లు. పోనీలెండి నాకేం పోయింది. కాటికి కాళ్ళు చాచుకొని కూర్చున్నదాన్ని, వింటే బాగుపడతారు, వినకపోతే పోతారు! ఎవరి కర్మకి ఎవరు కర్తలు!" అని ఒక లెక్చరుకొట్టేది. మాకు వొళ్ళు మండుకొస్తుండేది. ఆవిడ ధోరణి. తాను చెయ్యకపోతే పీడా పోయె, మేము తిన్నా చూచి సహించలేదుగదా అని నాకు చాలా కోపంగా వుండేది.

ఎప్పుడో ఎట్టకాలాని కొకమారు మా బామ్మ పిండివంటలకు తయారుపడినా అవే జంతికలు, చెవుగోడీలు, చక్కిలాలు! ఎవడికి కావాలి, రుచా, పచా! పళ్ళునొప్పి దండుగకాని! మమ్మల్ని అతి ఆప్యాయంగా పిలిచి కూర్చోబెట్టి, ఆకువేసి, చెవుగోడీలు తినమని మా బామ్మ బతిమాలేది. నేను ఒక్క ముక్క కొరికి, 'ఏం బాగులేవు బామ్మా!' అంటూ లేచి గంతుకుంటూ వెళ్ళిపోతూవుంటే, "రాజుని చూచిన కళ్ళకి, మొగుణ్ణిచూస్తే మొత్తబుద్ధి" అన్నట్టు, అడ్డమైన గడ్డీ హోటేళ్ళలో తినమరిగిన సుంటలుకి, యీ ముసలిముండ చేసినవి ఏమి నచ్చుతాయి నా బాబూ!' అని వ్యంగ్యంగా దీర్ఘంగా అనేది.

చేసిన చెవుగోడీలు ఖర్చవలేదన్న బెంగ మా బామ్మకి ఎప్పుడూ ఉండేదికాదు. ఈపండుగకు చేసిన పిండివంట మళ్లీ ఏదైనా పండుగవచ్చేవరకూ నిలవ ఉండాలి. ఈ మధ్యలో, ఎప్పుడైనా, చుట్టమూ పక్కమూ వస్తే వాళ్ళని గౌరవించడానికి 'రెడీ మేడ్' ఫలహారము వుండాలని మా బామ్మ ఉద్దేశము. కనుక జాగ్రత్తగా బుట్టలో పెట్టి మూతపెట్టి దాచేది. దీనంతకూ నాకు కోపంలేదు. ఎప్పుడైనా నాకు బాగా ఆకలివేసినప్పుడు, 'బామ్మా, రెండు చెవుగోడీలు యివ్వవూ?' అని అడిగితే 'నాయినా అవి

పైనిలేవు మడిలో వున్నాయి. ఆనక స్నానంచేసి మడి గట్టుకున్నాక తీసి యిస్తానులే' అనేది. అటువంటి అవకతవక పదార్థం, పాడయిపోకుండా, మేము ఖర్చుపెడతా మనడమే మహాభాగ్యంగా తలుస్తూ వెంటనే యివ్వమనగానే యివ్వడానికి బదులు నిర్లక్ష్యంగా జవాబు చెప్పేది. అందుచేత మా బామ్మ మీద నాకు కోపంగా వుండేది.

అంతే కాదు, నాకు మా బామ్మమీద ఆ రోజుల్లో, కోపంగా వుండడానికి మరో కారణం కూడా వుంది. మా బామ్మ నామీద ఎంతో ప్రేమగా వున్నట్టు పైకి నటిస్తున్నట్టుగా నాకు కనిపించేది. నేను అందమైన సుభ్రమైన గుడ్డముక్క కట్టుకుంటే చూసి సహించలేకపోయేది. అలాగని ఊరుకునేదీ కాదు. నా పుట్టినదినం వారం రోజులుకి వస్తుందనగా దగ్గర నుండీ నాకు కొత్త గుడ్డముక్క కుట్టించమని మా నాన్నకి తనే, రోజూ జ్ఞాపకం చేస్తుండేది.

మా నాన్న బజారునుండి మంచిమంచి సిల్కు గుడ్డలు రంగు రంగులవి, తళతళ మెరిసిపోతూవున్నవి మచ్చు చూపించడముకు యింటికి తెచ్చేవారు. నేను అవి చూసి మురిసిపోయి, ముచ్చటపడి, ఒక్కొక్క రకానికి ఒక్కొక్క చొక్కా కుట్టించాలి గదా అని పట్టుపట్టేవాడిని. అయితే ఏమి లాభం? ఆ ముసలిదానిమాట జవదాటడం మా నాన్నకి శక్యం కాదు. మాబామ్మ వచ్చి, 'ఇవి ఎలాగరా అబ్బాయీ ఖరీదు?' అని ప్రశ్నించేది. మానాన్న కొంత ధర తగ్గించి యిది గజం రూపాయి, రూపాయిన్నరా, యిలా గుంటాయి. ఖరీదుమాట కేమిలే, గుడ్డలు బాగున్నాయా లేవా అది చెబుదూ.' అని అడగగానే మా బామ్మ, 'బాగుండడాని కెక్కడికి వాయినా? పిండికొద్దీ రొట్టె. మన తాహతెంతో తెలుసుకుని నడుచుకోవాలి కాని, తలకుమించిన పరుగులు పరిగెత్తి బోర్లాపడడము ఏంలాభం? ఏదో, పుట్టినదినం కనక కొత్త గుడ్డముక్క కొనమన్నాను. ఓ, రూపాయి డబ్బుల్లో యిమిడేలాగ ఒక లాగూ లాల్చీ కుట్టించు గాని, యీ గుడ్డలన్నీ మోసుకొచ్చె వెందుకు?' అని చల్లగా చెప్పేది. మా నాన్న ఎప్పుడైనా సరదా కొద్దీ నాకు పంట్లాము కుట్టించి తెస్తే మా బామ్మ సహించలేక, 'పాదాలమీద పడుతూ, బురదలో యీడుచుకుపోతూ యింతపొడుగు పరాయి ఎందుకు? ఆ వెనక తోకలేమిటి? చిన్న లాగు కుట్టిస్తే చాలదూ? బురదలో దేకిరీ సుంటలకి తెల్లటి గుడ్డలు ఎందుకు? ఏదో కాస్త గట్టిదీ, మాపోట్టిదీ, చెక్కు గుడ్డ కుట్టించకూడదూ? అంటూ అడ్డుతగిలేది. నాకు మా బామ్మమీద వళ్ళు మండుకొచ్చేది.

ఇంకా చిల్లర కారణాలు ఎన్నో ఉండేవి మా బామ్మమీద నాకు కోపంగా ఉండడానికి. మా నాన్న ఎప్పుడైనా మమ్ముల నందరినీ సరదాగా సినిమాకు ప్రయాణంచేస్తుంటే, మా బామ్మ అడ్డుతగిలేది. గడియ గడియకూ సినిమాలూ, నాటకాలూ అంటూ డబ్బు తగలబెట్టడం నేర్చుకున్నారు. కానీ డబ్బు చేతులో వుంటే తేలు కుట్టినట్టు అనిపిస్తుందికాబోసు. అంత కంతకు వెర్రులూ వికారాలూ ఎక్కువైపోతున్నాయి మీకు. అని సాధింపు ప్రారంభించేది. మా ప్రోగ్రామంతా కేన్సిలు అయిపోయేది. మరో కారణం ఏమిటంటే, ఉదయాన్నే మాఅమ్మ కాఫీ చేసి మానాన్నకు యిచ్చి, నాకుకూడా యివ్వబోగా మాబామ్మ ప్రత్యక్షమై, "వాడికి కూడా తక్కువొచ్చిందా ఏమిటి యీ మహాసౌభాగ్యం? ఈనీళ్లు తాగితే యిక వాడు చద్దిఅన్నం ఏమితింటాడు?" అని మా అమ్మని గసిరి, నాకు కాఫీ యివ్వకుండా చేసేది. ఈ కారణము లన్నిటిచేతా, ఆకాలంలో మా బామ్మ నాకు ఒక శనిగ్రహంలాగ అనిపించేది.

## 2

నేను క్రొత్తగా గృహస్థాశ్రమంలో ప్రవేశించిన దినములవి. నాకు మా బామ్మమీద కోపం ఎక్కువవుటకు గల క్రొత్త పరిస్థితు లేర్పడినవి. క్రొత్తగా కాపరానికి వచ్చినపిల్ల. ఇంట్లో పనిపాట్లు చేయగలిగిన పెద్దవాళ్లువుండగా చిన్నపిల్ల చేత ఎందుకు పనులుచేయించి శ్రమ పెట్టాలి? మా అమ్మకుమాత్రం కోడలుమీద అభిమానమే. కోడలుని ఏపనీ చెయ్యనిచ్చేది కాదు. మా బామ్మమాత్రం యిందుకు వ్యతిరేకం. ఈపిల్ల వట్టి సెకక్క నిమిషం కూర్చోవడంఅంటే ఆవిడకు యిష్టంలేదు. సరదాగా పుస్తకం పట్టుకు కూర్చుంటే మా బామ్మకు కళ్ళు మంటగావుండేది. పుట్టి మునిగిపోయినట్లు తెల్లవారుఝామున నాలుగు గంటలకే తాను లేచి కూర్చోవడమే కాకుండా, యింటిల్లిపాదినీ లేపేస్తేనేగాని ఊరుకునేదిగాదు. రాత్రి పన్నెండుగంటల యీ వరకు ఏదో టక్కు టెక్కే. పోనీ ఆవిడ ఖర్మం ఏదో ఆవిడ చూసుకుంటే బాగానే వుండును. తన వెనకాల తక్కినవాళ్లు కూడా తనతోపాటు తిరుగుతూ ఉండాలి. ఆడవాళ్ళ భోజనా లవగానే, 'ఏమమ్మా, యీ పనులు మేము చూసుకుంటాములే, నీవు వెళ్ళి పడుకో.' అన్న ముక్క ఎప్పుడూ మా బామ్మ నోటంట వచ్చిన పాపాన్ని పోయేదిగాదు. ఆవిడమీద నాకు పట్టరాని కోపం వచ్చేది. కాని, యీ విషయం ఆవిడతో ఏమని చెప్పను? నాకు అప్పటికి కొంచెం మర్యాదా, పెద్ద

మనిషి లేనమూ, అలవాటయినవి. వాటితో భయం, సంకోచం, సిగ్గు అభివృద్ధి అయినాయి. గట్టిగా చిన్నప్పటిలాగు ఏమీ అనలేక పోయేవాడిని. మా బామ్మ చర్యలు చూస్తే అరికాలుమంట నెత్తి కొస్తుండేది. కుటుంబంలో యిటువంటి ముసలివాళ్లు వుండటం అన్నివిధాలా బాధే అనిపించేది. అయితే మాత్రం ఏం చెయ్యగలను? ఈ బాధనుంచి తప్పించుకొనుటకు ఉపాయం ఆలోచించేను. ఇంతవరకూ నిష్పూచీగా, వేళకు యింత తిని పోయిగా తిరగడం నాకు చాలా బాగానే వుండినా, అదొక స్వేచ్ఛగా తోచలేదు. మే మిద్దరమూ దగ్గరగా నిలబడి మాట్లాడుకుంటుంటే చూసి బామ్మ సంహించేదికాదు. 'ఈ కాలపువాళ్లకి బొత్తిగా సిగ్గూ, లజ్జా లేదు; పిన్నా పెద్ద అన్న సంకోచం లేదు. విరగబడి పళ్ళికిలించడం నేర్చుకున్నారు యీ కాలపు ఆడకుంటలు. మా కాలంలో యిలాటి విడూరా లెరగమమ్మా' అంటూ వుండేది. నేను దీర్ఘంగా ఆలోచించాను. ఈ యింట్లో వుండి మనం వీళ్లని ఏమన్నా లాభంలేదు. కనుక ఏదైనా ఉద్యోగం సంపాదించుకుంటె పట్నవాసంలో మా ఖర్మాన్ని మేము స్వేచ్ఛగా జీవించవచ్చును. అని ఆలోచన సాగించేను.

అతి ప్రయత్నంమీద పట్నంలో ఉద్యోగం దొరికింది. మాకు సంరక్షణకుగాను మా నాన్న మా బామ్మని నాతో పంపుతానన్నారు. స్వర్గానికి వెళ్లినా సవతిపోరు తప్పదన్నట్టు మా ఖర్మాన్ని మేము సుఖంగా వుండకుండా మా వెనకాల మళ్ళీ యీవిడ కూడా ఎందుకు ? అంత్య నిష్ఠురంకంటె ఆది నిష్ఠురమే మంచిదనుకుని, బామ్మని మాతో పంపవద్దు అని నిర్మొహమాటంగా, కచ్చితంగా చెప్పివేసేను.

పట్నంలో యాభైరూపాయలు జీతంతో స్వేచ్ఛగా వుండవచ్చును. బీచికి షికారు వెళ్లవచ్చును. సినిమాకి వెళ్లవచ్చును. అన్ని విధాలా సుఖంగా వుండవచ్చును అని ఉవ్విళ్లూరేను. కాని మొదట్లోనే కథ ఎదురుతిరిగింది.

'ఇల్లు ఇరకటం ఆలు మరకటం' అన్నట్టు మొదటిదిమాత్రం వెంటనే అమల్లోకి వచ్చినది. పదిహేను రోజులు కాలు కాలిన పిల్లిలాగ వూరంతా తిరగ్గా తిరగ్గా అతి కష్టంమీద, ఒక చిన్న కొట్టూ, బొమ్మరిల్లంత పంచాది, గల భాగం పదిహేను రూపాయలకు అద్దెకు దొరికింది. ఆ కొట్లోనే బొగ్గులు బస్తా, ఆ కొట్లోనే పిడకలబుట్ట, అందులోనే పట్టీ పట్టకుండా మంచం, పరుపూ. నేను సాయంకాలం ఏదైనా మీటింగుకు పోదలచి బయలుదేరితే మా ఆవిడ "వేగం రండేం, చీకటి పడితేనా ఒక్కర్తెకూ భయం" అని హెచ్చరించేది. ఒకరోజు టౌన్ హాలులో గొప్ప ఉపన్యాసం. సాయంకాలం 6 గంటలకు ప్రారంభమయినది. పది నిముషములు వినిపోదామని కూర్చుంటిని. ఉపన్యాసం చాలా ఆకర్షణీయంగా నుండుటచే అక్కడినుండి కదల బుద్ధిపుట్టలేదు. పక్కా ఒకగంట కూర్చుంటిని. ఉపన్యాసం సాగుతూనే వుంది. ఇంతలో, ఇంటివద్ద మా ఆవిడ యిచ్చిన వార్నింగు జ్ఞాపకం వచ్చింది. విధిలేక యింటిముఖం పట్టేను.

ఒకరోజు నేను యింటికి వచ్చేసరికల్లా మా ఆవిడ యింట్లోకి రాదు. కాని ఇంట్లోనే కూర్చుని వుండెను. పట్నవాసపు ఆచారానికి అది తప్పులేదని ఆ యింటివాళ్లు మాకు నచ్చచెప్పేరు. నాకు వంట రాదాయె. పల్లెటూరు కనకనా, యిరుగమ్మనో పొరుగమ్మనో బ్రతిమాలి పిడికెడు బియ్యం అత్తెసరు పడేసి పెట్టమని బ్రతిమాలడానికి. పట్నవాసంలో 'ఎవరికి వారే యమునాతీరే' సాయంత్రం ఆరుగంటలకి వచ్చి చెడీ యింటికి చేరుకునేసరికల్లా యీ గండం ! నేను ఏపనైనా చేయగలనుగాని వంటమాత్రం బొత్తిగా రాదు. ఈ మూడురోజులు గండం ఎలాగ గడుస్తుందిరా దేవుడా అని బెంగపట్టుకుంది. ఆపూటకు సద్యాన్నం తాలూకు అడుగూ మడుగూతో కాలక్షేపం చేసేము. తక్కిన రెండురోజులూ విధిలేక హోటలు నుండి కేరియరులో అన్నం తెప్పించేను. కేరియరు మీల్సు మా ఆవిడకు ఎంతమాత్రం యిష్టం లేదు. తినినవెంటనే వాంతి చేసుకొనేది. హోటలుకు 5 రూపాయలు ఖర్చవడమూ తిండి సహించక పోవడం జరిగింది. నవ్వుతూ మా ఆవిడ అంది—'మీ బామ్మను తీసుకురాకూడదూ'. ఆ సలహా మొదట్లో బాగున్నట్టే కనిపించింది కాని, ఒకరోజు భాగవతానికి మీసాలు గొరిగించుకున్నట్టు, యీ మూడురోజుల యిబ్బంది కోసమూ ఆవిడను తీసుకువస్తే, తక్కినరోజులు ఆవిడ వల్ల మనకి అనేకవిధాలు యిబ్బందిగా వుంటుంది అన్నాను. "గడుసువాళ్లు పాపం" అయితే ఆవిడ ఏ తిథి సంధిముహూర్తమునకువచ్చి మీ గండం గట్టెక్కించి వెళ్ళిపోతూ వుండాలి కబోసు." అంది.

మేమువున్న ఇంటికి ఎదురుగావున్న ఒక పెద్ద ఆఫీసరుగారి భార్యతో మా ఆవిడకు పరిచయం కలిగింది. దాని ఫలితంగా, ఆవిడకట్టుకున్న చీరవంటి చీర, ఆవిడ రాసుకునే హెయిరాయిలు, వాడుకునే సబ్బు, మాఆవిడకుకూడా కొనమని రిక్వెష్టు-డిమాండు

చేస్తుండేది. మనలో మనమాట. ఆవిడంటే పెద్ద ఆఫీసరుగారి భార్య, ఆమెకు కావలసినవి కొనిపెట్టుటకు ఆమెభర్త సమర్థుడు. పులినిచూచి నక్క వాతపెట్టుకున్నట్టు మా ఆవిడకూడా ఆవిడని యిమిటేట్ చెయ్యాలంటే ఎలా కుదుర్తుంది! అయితే నేను నా అసమర్థతను ఆవిడదగ్గిర ఎలా వెల్లడి చేయగలను. డిగ్నిటీకి లోపం కాదూ! ఏమైనా అంటే చిన్నబుచ్చుకుంటుందని భయం. కనుక అటుంచి సరుక్కు రమ్మన్నట్టు, తెచ్చిన డబ్బుతో ముందు ఆవిడకు కావలసిన వస్తువులు కొనిపెట్టక తప్పేదికాదు. క్రొత్త సినీమా వస్తే వెళ్ళక తప్పేది కాదు. ఐదురూపాయలు కట్టెలు వేయిస్తే మళ్ళీ ఐదురోజులకే డిమాండు! ఈవాళ నెయ్యి పోయించుకుంటే మళ్ళీ ఎల్లుండికే 'నెయ్యి జోర్తిగా అయిపోయిందండీ' పాలు, పెరుగు, కాఫీ గింజలు, పంచదార-ఇద్దరు మనుష్యులుగల కుటుంబానికే యింత యిబ్బంది అవుతూవుంటే పదిమంది పిల్లా పాపా ఉన్నవాళ్లు ఎట్లు కాలక్షేపం చేస్తున్నారు చెప్మా! అని నాకు ఆశ్చర్యం కలిగేది. కోమటి కొట్టుమీద హిసాబు-క్రమంగా పాపం పెరిగినట్టు పెరిగింది. మరి అరువు ఇవ్వనన్నాడు షాహుకారు.

పట్నవాసం అగుటచేత కోర్టుపనిమీద, తెల్లవార్తే ఎవరో ఒకరు మా యింటికి వస్తుండేవారు. మా యిద్దరికీ ఉడకబెట్టుటకే మాఆవిడ ఏడుచెరువుల నీళ్లు త్రాగుతుంది. దానికితోడు చుట్టాలకూ పక్కాలకూ కూడా ఎక్కడ వార్చి వడ్డించగలదు? కాని, ఏమిటి చేయటము! వచ్చినవాళ్ళంతా మాకు కావలసిన వాళ్లు, పెద్దవాళ్లు. మా మీద అభిమానం వుండబట్టే కదా వస్తున్నారు. వాళ్ళని రావద్దనగలమా? వద్దంటే వాళ్లు మానరు కూడాను.

ఒక సంవత్సరము గడిచింది. నాకు, వేరింటి కాపురంలోనున్న కష్ట సుఖాలన్నీ అనుభవంలోకి వచ్చేయి. చిల్లర చిల్లరలన్నీ కలిపి రెండువందలు అప్పు పెరిగింది. ఈ పరిస్థితులు మా ఆవిడకు ఏమి తెలుసు పాపం! పరిస్థితులు యిలాగే వుంటే ఒక్క దినమైనా కాలక్షేపం జరగడం అసాధ్యంఅని తెలుసుకున్నా. బడ్జెట్ సరిపుచ్చడం ఎంత ప్రయత్నించినా అసాధ్యం అయిపోయింది. ఏ ఖర్చు తగ్గింపవలెనా అని ఆలోచనలోకి దిగేను. అనవసరమైన ఖర్చు నాకేదీ కనిపించలేదు. కాఫీ మానేద్దామా? - అమ్మయొయ్యో.! అన్నమైనా మానగలంగాని, కాఫీనీళ్లు పడందే ప్రొద్దుట మంచంమీదినుంచి లేవనైనా లేవలేము. సినీమాలు మానివేస్తే? నెలకు పదిరూపాయలు మిగల్చవచ్చు. హెయిరాయిల్సు, స్నోలు మానేస్తే అయిదు రూపాయలు మిగులుతాయి. కాని, ఆ ఖర్చులజోలికి అసలే పోడానికి వీల్లేదు. కొన్నాళ్ళవరకైనా మా ఆవిడకు ఆపాటి వినోద విలాసాలు, సమకూర్చకపోతే ఆమెకు నాయందుగల గొప్ప ఆదరభావం సన్నగిల్లిపోతుందేమో, నా అసమర్థత ఆమెకు తెలిసిపోతుందేమో! అని లోపల భయం. మరి తక్కిన ఖర్చులన్నీ అసలే ముఖ్యం.

నాడు-నా చిన్నతనంలో-నెయ్యి ఎక్కువగా వేయనందుకు మా బామ్మమీద కోపగించేవాడిని. నేడు నెయ్యి ఎక్కువగా దిమ్మరించేస్తున్నదని మా ఆవిడమీద కోపం తెచ్చుకుంటున్నాను. తనవరకూ వస్తేగాని తెలియదుగదా! మా ఆవిడతో ఏదైనా మెల్లగా చెబితే పరిహాసం క్రింద కొట్టిపారేస్తుంది. గట్టిగా చెబితే ముఖం యిట్టె పెట్టుకుని మొదటికే మోసం తెస్తుంది. అయితే అతివృష్టి-లేకపోతే అనావృష్టి. ఇట్టి పరిస్థితుల్లో మా బామ్మగాని వుంటే కొద్ది రోజుల్లో యీ చిక్కులన్నీ తొలగిపోయి వ్యవహారం చక్కబడుతుందని నాకు గట్టిగా నమ్మకం తోచింది. అయితే మొదట మా బామ్మని రావద్దన్న పెద్దమనిషిని నేనేకదా, యిప్పుడు మళ్ళీ ఏ ముఖము పెట్టుకుని ఆవిడను రమ్మని పిలవగలను? పిలిస్తేమాత్రం ఆవిడ వస్తుందా? దీర్ఘంగా ఆలోచించేను. పది రోజులు సెలవు పెట్టి మా గ్రామం వచ్చేసేం. నా ప్లానంతా నా భార్యకు రహస్యంగా బోనపరిచేను.

## 3

"ఏమమ్మా, విశాఖపట్నం కాపరం ఎలాగుంది?"

"ఏం చెప్పమన్నారు బామ్మగారూ, ఎలా గుండాలో అలా గుండనుకోండి నిజంగా."

"ఏమమ్మా, అలా గంటున్నావు? నీ మొగుడు పెద్ద ఉద్యోగస్థుడాయెను. నీకేమిటి లోటు?

"బామ్మగారూ, ఎన్నుంటేమట్టుకు ఏమి లాభం? కొత్తకాపురం, కొత్తచోటు, నేను కుర్రదాన్ని, వేరు దక్షతలేదు. మీలాంటి పెద్దవాళ్ల చాటుని మసులుకోవలసిన దాన్నిగాని, ఒక్కర్తెనీ ఏమిచేసుకోగలను చెప్పండి?"

"అమ్మా, నువ్వింకా పత్తికాలపు మాటలే ఆడుతున్నావు. ఈకాలపు కోడళ్ళకి స్వతంత్రం కావాలి. అత్తగారి అదుపులూ, మామగారి పొదుపులూ వాళ్ళకి పనికొస్తాయా? మాలాంటి ముసలిముండలమి చావు రాక యిలా ఏడుస్తున్నాముకాని, మేము బ్రతికివున్న లాభమేమిటమ్మా, మమ్మలిని చూసేవాళ్లెవరు?"

"బామ్మగారూ, నీ మనమడు చాలా విచిత్రమైన మనిషండీ. వారి తత్వం తెలుసుకోవడం ఎంతటి వారికీ అసాధ్యం. ఎవరిమీదనైతే చిర్రు బుర్రు మంటూ వుంటారో, వాళ్లనే మనస్సులో ఎంతైనా మెచ్చుకుంటూ వుంటారు. అది ఆయన నైజం. ఇక్కడ ఉన్నప్పుడు ఒక్కమాటైనా మీదగ్గర కూర్చుని కష్టమూ సుఖమూ మాట్లాడారా; అలాంటిది, విశాఖ పట్నంలో ఉన్నప్పుడు ఇరవైనాలుగు గంటలూ మిమ్మల్ని గురించే పలవరిస్తూ వుంటారు. చిన్నప్పటి నుంచీ పెంచి పెంచి పెద్దవాళ్ళని చేశారుట ఆయన్ని మీరు. వాళ్ల అమ్మా బాబూ ఎప్పుడైనా కొట్టబోయినా అడ్డువచ్చి తన వంటిమీద దెబ్బపడకుండా మీరు కాచుకువచ్చేరుట. మిమ్మలిని వదిలి ఉండడం చాలా కష్టంగా ఉంటుందంటారు.

"ముసిలిముండని నన్ను తలుచుకునే దాకా వాడికేం అవసరమమ్మా! అంత అభిమానం ఉన్న వాడు ఒక్కమారేనా కొత్తకాపరం చూద్దువు గాని రమ్మని మాటవరసకైనా అన్నాడా? పోనీ, ఏదో మీరు సుఖంగా వుంటే అంతే చాలు. మాకు అంతకంటే కావలసినదేముంది?"

"బామ్మగారూ, నేను ఒట్టువేసుకుని చెబుతున్నాను నమ్మండి. ఆయనకు అందరికంటే మీమీదనే అభిమానం ఎక్కువ. అయితే, ఆయనలో ఉన్న పెద్ద లోపమేమిటంటే ఆయనకు తన అభిమానాన్ని పైకి తెలియపర్చడం చేతగాదు. మిమ్మలిని, విశాఖ పట్నం తీసుకువస్తానని నాతో యామైమార్లయినా అన్నారు. అంటే, నేనే వెనక్కిలాగేదాన్ని, నిజం చెప్పాలిగా మరి,—ఎందుచేతనంటే, మేమే అక్కడ నానా బాధలూ పడుతున్నాము. దానికి తోడు ఇంత పెద్దకాలంలో మీకుకూడా శ్రమకలిగించడం నాకు యిష్టంలేదు. మిమ్మల్ని తీసుకువెళ్ళి మీకు సేవచేయడం అంటే మాకు చాలా యిష్టం. అయితే, మీరు వచ్చేక ఊరికే కూర్చోరు. చేసివున్న చెయ్యి, వట్టినే కూర్చోమంటే కూర్చోరు. మిమ్మల్ని తీసుకువెళ్లి మీ చేత పనిపాట్లు చేయించుకోవడం మాకు యిష్టంలేదు. అయితే, మిమ్మలిని తల్చుకోని రోజుండదనుకోండి.

"అయితే పోనీ, మా కిష్టప్ప చిన్నప్పటిలాగా ఆకతాయి వ్యవహారంగానే ఉన్నాడా, ఏమైనా కొందం తగ్గిందయేడా? చిన్నప్పుడు మహా పెంకితనం చేసే వాడులే."

"చిన్నప్పటి సంగతి నాకేం తెలుసునులెండి. కాకపోయినా చిన్నప్పుడు ఎవరుమాత్రం పెంకితనం చెయ్యరు చెప్పండి."

"అమ్మ గడుసుబుర్రా! అప్పుడే మొగుణ్ణి వెనకేసుకు రావడం నేర్చేవూ?"

"వెనకేసుకు రావడంకాదు బామ్మగారూ, ఉన్నమాట అన్నాను అంతే."

"అయితే యిప్పుడేం కిసిమిసి సెలవలా ఏమిటి, వచ్చేరు?"

"ఇప్పుడే సెలవలూ లేవు. సెలవుపెట్టి వచ్చేను."

"వట్టినేనా?"

"వట్టినే ఏమిటిలెండి. మిమ్మలిని చూసి చాలా రోజులైంది. ఒకసారి వెళ్ళి చూసివద్దామని రెండు నెల్లనుంచి ప్రయాణం చేస్తున్నారు. ఇక ఉండబట్టక, సెలవుపెట్టి నన్నుకూడా బయలుదేరించి తీసుకొచ్చేరు. మిమ్మలిని ఎలాగైనా విశాఖపట్నం తీసుకువెళ్లటాని కని వచ్చేరు తను. అదీ, అసలు సంగతి."

"అయితే నాతో ఆ ముక్కైనా అనలేదే వాడూ!"

"నేను చెప్పేను కాదూ మొట్టమొదటే, ఆయనకు మహా గొప్ప మొహమాటం. అడిగితే, పని పాట్లు చేసిపెట్టడానికి రమ్మంటున్నారని, మీ రెక్కడనుకుంటారో అని భయం ఓమూల."

"అయితే నువ్వు వాడితరఫున వకాలత్తు పుచ్చుకున్నావా?"

"ఆయన అభిప్రాయం మీకు చెప్పేనండీ."

"అయితే అది ఆయన అభిప్రాయమే గాని నీ అభిప్రాయం కాదన్నమాట. అంతేనా?"

"ఎంతమాటన్నారు బామ్మగారూ! నాకీ ఉద్దేశం మొదటినుంచీ ఉందనుకోండి. ఎలాగైనా మీరు మీ మనమడిమాట వింటారు గాని నా మాట వింటారా?

## 4

బామ్మగారూ మీ రెండుకు మడి కట్టుకోడం, నేను స్నానంచేసి వంటచేసేస్తాను వేగం. మీరు రామా కృష్ణా అంటూ ఓచోట కూర్చోండి."

"లేని అలవాట్లు యిప్పుడు ఎక్కడినుంచి తెచ్చుకోమన్నావు. ఉట్టినే కూర్చోడం నాకు ఎప్పుడూ అలవాటు లేదమ్మా. ఏదో బతికివున్న నాలుగు రోజులూ యింత వుడికబెట్టి నా చేత్తో నలుగురికి యింత వడ్డించడం తప్పించి నేను చెయ్యగలిగింది అంతకంటె ఏముంది. కాక, నే కాదని కాళ్ళా వేళ్ళాబడి బ్రతిమలాడితే, ఏదో, కాదనలేక వచ్చేను. రావడం కాళ్ళు జాచుకుని కూర్చుని మీచేత చాకిరీ చేయించుకోడానికా ?"

ఆఖరుకి మా ఆవిడను మడికట్టుకో నివ్వకుండా మా బామ్మే మడికట్టుకొని వంటచేసింది. నేను అంటకముందు పాచిగుడ్డలతో నే భోజనంచేసే వాడిని కాని, యీదినం మా బామ్మ ఎదుట అందుకు సాహసించలేకపోయేను. మడీ, తడీ, ఆచారంలో నాకు నమ్మకము లేకపోయినా, మా బామ్మ వడ్డిస్తుంటే, కట్టుగుడ్డలతో కూర్చోడానికి ధైర్యం చాలింది కాదు. పెట్టెలోనున్న బరంపురం పట్టుపంచ తీసి కట్టుకొని భోజనానికి కూర్చున్నాను.

"ఏమిరా బాబూ! పట్టుపంచ రోజూ కట్టి యీడిచేస్తే ఎందుకేనా పనికొస్తుందీ. బోలెడేసి ఖరీదులు పెట్టి కొనుక్కున్న బట్టగదా అవి రోజూ వాడేస్తే మూణ్ణాళ్ళకే ముక్కలయి పూరుకుంటాయి. ఏదో పండుగా పర్వమూ, పెళ్లీ పేరంటం విందులూ వియ్యాలూ వచ్చినప్పుడు కట్టుకోవలసిన బట్టల్ని యిలా నలిపేసుకుంటే ఎలాగరా! ఏదో రెండో మూడో యిచ్చి, రోజూ వాడకానికి పనికివచ్చిన పాత్తుపంచ ఒకటి కొనుక్కుని కాలక్షేపం చెయ్యాలి. ఉన్న వస్తువుల్ని పూర్జితం చేసుకుంటే కొత్తవి కొన్నంత ఫలం."

మా బామ్మ నోట్లోనుండి వెలువడిన మాట నాకు అమృతవర్షంగా అనిపించింది.

"నువ్వు చెప్పినట్టే చేస్తున్నాను బామ్మా! ఈ వాళ నువ్వు వచ్చేవుగదా అని సరదాకొద్దీ యిది తీసి కట్టుకున్నాము గాని రోజూ దీనిని వాడడం లేదు."

మా బామ్మ పప్పూ అన్నములో నెయ్యి వెయ్యడానికి నేతిగిన్నె తెచ్చి అందులోని గరిటె చూచి ఆశ్చర్యపడింది.

"ఇదేమిట్రా! ఇది గరిటా బ్రహ్మరాక్షసా!

ఎక్కడ సంపాదించేవురా నాయినా యీ గరిటె? పులుసు వేసుకునే గరిటంత ఉందిగదా, దీనితో నా నెయ్యి వేసుకోడం? ఇలాగైతే సంసారం ఎంతకాలం సాగుతుంది. ఉన్నదాంట్లో ఉన్నంత మట్టుకు పూర్జితం చేసుకొని గౌరవంగా కాలక్షేపం చేసుకోవాలి గాని, ఉన్నకాడికి రోంతా ఊడిచేసుకొని పీథిపడితే ఏం లాభం ?"

మా బామ్మ మమ్మలిని యిలాగు చీవాట్లు పెడుతూవుంటే, అవి నిజముగా నేను ఆశీర్వచనములుగా భావిస్తూ తలవంచుకుని కూర్చున్నాను.

"అంతకంటె చిన్న గరిటెకోసం ప్రయత్నం చేసేను కాని దొరకలేదు బామ్మా. అంచేత అందాకా యీ గరిటె వాడుతున్నాము.

"పోనీ యిలారా, నేను తెచ్చిన మూటవిప్పి అందులో మిల్లిగరిటె వుంటుంది తీసి యిలాగ పట్టుకురా! నేను యింటిదగ్గర అనుకున్నట్టే వుంది మీ కాపరం అచ్చంగా, గరిటె మూటలో పడేసుకుని రావడం మంచిదే అయింది."

నా చిన్నతనంలో నాడు ఏ మా బామ్మ ఏ మిల్లిగరిటెలో వడ్డించి నా కోపానికి పాత్రురాలైందో నేను ఆ, మా బామ్మయే ఆ మిల్లి గరిటెతో నే ఈ నెయ్యి వడ్డించి నా గౌరవానికి, నా భక్తికి, నా ఆదరాభిమానాలకీ పాత్రురాలైంది. దృక్పథం మారగానే దృశ్యాలు కూడా మారుతాయిగదా! తనవరకూ వస్తేనేగాని తత్వం బోధపడదు ఎవరికైనా. నెయ్యి వడ్డిస్తూ మా బామ్మ అన్నది. 'నాయనా! మీ సంసారాన్ని బాగుచేయగలిగింది యీ మిల్లిగరిటే, నేను బ్రతికి ఉన్నా, లేకపోయినా మీరుమాత్రం యీ మిల్లి గరిటెని భద్రంగా దాచుకుని మీ మనమలకీ మునిమనమలకీ అందజెయ్యండి.

---

# నాటకరంగ స్మృతులు



## శ్రీ గోవిందరాజుల సుబ్బారావు

"Life is but an empty dream,
A poor player that struts and
Frets his hour on the stage
And then is heard no more
It is a tale told by an idiot
Full of sound and fury
Signifying Nothing"

—Shakespeare

ఈ జీవితమే ఓ విచిత్రమైన మహానాటకం. ఈ భూలోకమే దానికన్న మించిన విచిత్రమైన రంగస్థలం. "జలజాత ప్రభవాదులున్ మనములోఁ జర్చించి భాషావళిన్, పలుకన్ లేని జనార్దనాహ్వయ పరబ్రహ్మంబ" నే జగన్నాటక సూత్రధారి ఆధ్వర్యం క్రింద ఆడింపబడుతున్నది. అఖిలాండ కోటి బ్రహ్మాండాలలో ఈలాంటి భూలోకాలు కాదులే అసంఖ్యాకములు గా ఉండుకున్నవను నవీన శాస్త్రజ్ఞుల విశ్వాసాదులను పురస్కరించుకుంటే మన భావనాశక్తి చిన్నపుచ్చుకుని పుక్కిళ్ళాది మునిగి ఉక్కిరి బిక్కిరి అయిపోతుంది. ఇటువంటి సందర్భంలో నాబోటివాడిని "నీ నటనా జీవితంలో కొన్ని స్మరణలు పాఠకులకు పోదిచెప్పవయ్యా" అని అడిగితే నేను కొంత వెనకడుగు వేసికొని, వెనక్కు తిరిగిచూచుకొని "ఈ అనుభవాదులన్నీ నావా అతగాడివా అని ప్రశ్నించుకొని, చివరి"కిదంతా అతడిలీలే"యని జ్ఞానం తెచ్చుకొని ఈ చిన్న వ్యాసాన్ని వ్రాయటానికి ఉపక్రమించాను.

పూర్వజన్మంలో ఏ తలితండ్రుల కడుపున పుట్టానో, ఏ సుఖదుఃఖాల ననుభవించానో, ఏ ఏ కర్మపరంపరలలో స్రగ్గిమగ్గానో, ఏఏ ఆటలాడానో, ఏఏ పాటలపాడానో, ఏ వేవి చేశానో, ఏ వేవి చెయ్యక బాకీపడ్డానో, చివరకు ప్రాణాలుపొయ్యే అవసరంలో ఏ అనుభావాలను జ్ఞప్తికి తెచ్చుకొన్నానో, ఏఏ తీరని కోరికలతోను తీరరాని కోరికలతోనూ "హరీ" అన్నానో నాకు దైవం తెలియనీయకుండా ఘటించాడు గాని, ఈ జన్మంలో మాత్రం ఇంతవరకూ జరిగిన నా జీవితచరిత్ర చాలవరకు జ్ఞాపకంవుంది. ఇటీవల మొన్న మొన్న జరిగినవి కొంచెం జ్ఞాపకం తక్కువగాని అతి బాల్యావస్థలో జరిగినవి మరీ జ్ఞాపకం ఎక్కువ. అందులో నాది చిత్రాత్మక స్మృతి కాబట్టి కళ్ళకు కట్టినట్లుగా ఉంటుంది.

నేను చూచిన మొదటి నాటకం సారంగధర— అది బందరు బుట్టయ్యపేట హాలులో నా మూడవ యేట సారంగధరుడు ఎర్ర చెమ్కీ దుస్తులతో తళుకుతూండినట్లు, చిత్రాంగి ఆకుపచ్చని బనారసు చీరతో నడయాడి పలికినట్లు ఇప్పటికీ కళ్ళకు కట్టినట్లుంది నాకు. ఎందుకో చెప్పలేను. ఇప్పుడుకూడా ఎవరైనా చిత్రాంగి వేషం వేస్తే ఆకుపచ్చని చీరకడితేనే ఆహార్యం సరిగ్గా ఉంటుందని వేరుచీరకడితే అది కుంటుపడిపోతుందని నా ఉద్దేశ్యం. చిన్ననాట మనలోపడిన అభిప్రాయబీజాలను పెరగనియ్యకుండా అణిచిపెట్టడం మనతరంగాదని నా జీవిత అనుభవాలనుబట్టి నాకు దృఢతరమైపోయింది.

విద్యార్థిదశలో (అంటే స్కూలు ఫైనలు క్లాసువరకు) దాదాపు నేను నాట్యకళలో సాహస మొదలు పెట్టలేదని చెప్పవచ్చు. కాని నాటకాలను చూడటమంటే అతి ఉత్సాహంగా ఉండేది. టిక్కట్టు డబ్బువిషయమే వచ్చేది గట్టిచిక్కు. చదువు చెడిపోతుందని సదుద్దేశ్యంతో మా అమ్మగారు ఒక్క దేవకాసైనా యిచ్చేదికాదు, ఆమేటు క్లాసు కొనుక్కుందామన్నా. మా నాయనమ్మగారి దగ్గర అచేతే డబ్బులూ సంగ్రహించి అప్పుడప్పుడు నాటకాలకు పోతూండేవాణ్ణి. ఆమెకుపడ్డ ఋణం తీర్చుకోలేకపోయ్యాను, చచ్చి ఏ స్వర్గానవుందో. ఆదినాల్లో మా తెనాలిలో ఒక కంపెనీ ఉండేది. దాని యజమానిని ఆయన స్త్రీ జనాన్ని ఆశ్రయించి కష్టపడి చాయంగల విన్నపములై మేటుక్లాసులోకి

మారిపోతూవుండేవాళ్ళం. నేనూ నా స్నేహితులిద్దరూ, పుండరీకాక్షయ్య, నరసింహారావులు. మాకున్న ఈబలాటాల్ని అణగ్రదొక్కినకొద్దీ, నాటకాలు, వాట్లో వేషధారణమీద, వెఱ్ఱి మరింత హెచ్చిపోయింది. అందులో ముఖ్యంగా నాకు.

నాటకాలే చూట్టానికి వీల్లేకుండా అదుపాజ్ఞలు ఉంటే వాట్లో వేషాలువెయ్యటం నాకో ఎండమావులుగాను గగన కుసుమాల్లానూ ఉండేది. కాని దైవసాహాయ్యంవుంటే ఏపని చెయ్యలేం—ఆ పరమేశ్వరుడిమీద నమ్మకం కుదరదు గాని!

ఆకాలంలో తోట వేంకటచలంగారు దావులూరి శేషాచలంగారు *2nd Company* లో ప్రధాన పాత్రలు (నాయక నాయకి) ధరిస్తూవుండేవారు. వారివద్దనుంచి మొదట్లో నేను నేర్చినరాగం శహాన. తర్వాత ఆనందభైరవి, తోడి, భూపాళ, సావేరి, మొదలైన రాగాలు పట్టుబడ్డయి. ఇంకేం? నేనుకూడా ఒక వేషానికి ఏనాటికైనా పనికిరావచ్చునని ఆశాబీజం లోలోపల వృద్ధిపొందింది. మరి అవకాశం దొరకొద్దూ? అదీ దేవుడే చూపించాడు.

ఫిఫ్త్ ఫారం క్లాసు చదువుకుంటూవున్నా. సాయంకాలం తెలుగు మేష్టరు పీరియడ్ లో మా లెక్కల మాష్టారు గురుస్వామి అయ్యరుగారు వచ్చి నన్ను లేచినిలబడమని "స్కూలు వదలినవెంటనే నాగదిలోకివచ్చి నన్ను చూచిపో" అని ఆజ్ఞాపించారు. గుండెలో రాయిపడ్డది. "తెలుగు మేష్టరు ఏదో రిపోర్టు చేసివుంటాడు—దినమూ నేను వారి పీరియడ్ లో అల్లరిచేసే బుద్ధిమంతులలో అగ్రగణ్యుణ్ణి గనుక" అనుకొని, క్లాసు వదలింతర్వాత బిక్కుబిక్కుమంటూ వారిదగ్గరకుపోయి నిలబడ్డాను. ఎందుకో గాని నా అవస్థనుచూచి ఓ చిరునవ్వు నామీద విసిరారు. కొంచెం ధైర్యంవచ్చింది. "రాబొయ్యే స్కూలు *Anniversary day* కు నీవు ఓ ఇంగ్లీషు నాటకంలో వేషంవెయ్యాలి" అన్నాడు.

"నే నేమెరగనండి - నాకేం చేతకాదండీ. *Excuse me Sir*"అన్నట్లు బాగా జ్ఞాపకం. కాని వేషమే నిర్ణయంచేస్తే ఒక తడాఖా చూపించలేకపోతానా అన్న ధైర్యం లోపలవుంది.

"నీ చేతవుతుంది. ఏం భయంలే"దన్నాడు మళ్ళా గట్టిగా.

"అలా అయితే సరే"నన్నాను.

"నీకంటె కొంచెం పెద్దవాడు మరొకడు కావాలి. ఎవర్ని తీసుకోమని సలహా ఇస్తా"వన్నారు.

నా స్నేహితుడూ, తెలుగు మేష్టరును ఏడిపించటంలో నా సహాధ్యాయిఅయిన దావులూరి నరసింహారావు పేరు చెప్పాను.

"సరే! నీవు వెళ్లు" అన్నారు.

దీనిఫలితంగా *merchant of Venice* లో *launcelot scene* వేశాం-ఇది మహాబాగావుందని అందరూ అనుకొన్నారు. ఏది ఎలా అయినా 'బ్రతుకు జీవుడా! గండం తప్పింది" అనుకొన్నాను. మా అమ్మగారు "ఇది మనకువద్దు" అని అడ్డుచెయ్యటానికి వీల్లేకుండా పోయింది, మాష్టరుగారే నాచేత వేషం వేయించాడు గనుక. ఇంకేముంది నేనూ ఓనటుణ్ణయిపోయాను.

తర్వాత సంవత్సరంలో *George Vth Coronation* సందర్భంలో ఓ పెద్ద *English* నాటకంలో (*Handy Andy*) *Andy* వేషం - హాస్యరసం భూయిష్ఠం- వేశాను. కాని, అప్పటికింకా తెలుగు నాటకాల్లో వ్రేలు పెట్టలేదు. ఎందుకంటే, ఆ కాలంలో పద్యాలు, కీర్తనలూ రాగస్వర, తాళయుక్తంగా పాడలేకపోతే వట్టి జనవాయి క్రింద కట్టివేశేవారు. రాగాలు పాడగలిగినప్పటికీ—పదిహేను, యిరవై రాగాలదాకా నాకంఠం అవేదండీ- చాలమంది నా స్నేహితులకు ఈ రహస్యం తెలుసుకూడాను. కొంచెం హైస్థాయిలో అపస్వరంవల్ల, శాస్త్రీయతాళాన్ని లయను ధిక్కరించి స్వంతబాకడలు పోవటంవల్లా, నాకు తెలుగునాటక ప్రవేశం "అందరాని పండు" అయిపోయింది. దాని రోజులింకా రాలేదు. నేనెంత ఉత్సాహపడితే నేం లాభం?

కాని మా మేష్టరు D. C. కృష్ణయ్యగారు అప్పుడప్పుడు,- వారు వసుతః నెల్లూరు వాస్తవ్యులు కనుక—'ప్రతాపరుద్రీయం' నాటకంలో పేరిగాడి సీనులు, పిచ్చివాడి సీనులు, మాలో కొంతమందికి శిక్షణయిచ్చి ఆడిస్తూ వుండేవారు. నా స్నేహితులు కీ. శే. పిల్లలమర్రి సుందరరామయ్యగారు పిచ్చివాడివేషం, నరసింహారావుగారు సుల్తాను వేషం వేస్తూవుండేవారు. నాకు లోపల కంటుగా వుంటూవుండేది. నాకూడా ఒకవేషం ఎందుకు నిర్ణయించలేదని! అందుచేత ఆ చిన్ననాటినుంచే ప్రతాపరుద్రీయం నాటకంమీద నాకు అఖండమైన గౌరవం ఏర్పడింది.

తరువాత దేవుడు చాలా మేలుచేస్తే - నేను తెలుగునాటకంలో మొదట్లో వేలుపెట్టింది మా *old boys association* లో. ఆరోజుల్లో గయోపాఖ్యానానికి అఖండమైన పేరు ప్రఖ్యాతులు ఉండేవి. సుందరరామయ్యగారు కృష్ణపాత్ర, నా మిత్రుడు పెద్దిభొట్ల చలపతిరావుగారు అర్జునపాత్ర. (దానికవి ఒక పెద్ద గాండీవం చేయించాడండీ తనపొడుగు సరిపొయ్యేది; నిజంగా అర్జునుడా అనిపించేవాడు!) పురుషులే స్త్రీపాత్రలనుకూడా ధరించి తీరవలసిన రోజులు గనుక మా లో ఎవరూ తెగించినవారు ఎక్కువమంది లేనందున ఆ రుక్మిణి, చిత్రలేఖ పాత్రలను వెంకటాద్రి అనే ఓ తెంపరి ధైర్యంచేసి వేసేవాడు. నేను ఇటు యాదవులవైపు సాత్యకి, అటు పాండవులవైపు భీముడిపాత్ర ధరిస్తూ వుండేవాణ్ణి, కొంచెం కసరత్తు, కుస్తీచేసి, ఖట్ మస్తీమీద ఉండేవాణ్ణి గనక. "తొల్లి సురుకుమారులు" అన్న పద్యం శహానరాగంలో సాగతీసి అనేవాణ్ణి. "తొల్లి" అని అనేవాణ్ణి-భావాన్ని, రాగాన్ని మేళవించటానికి. అదివొక విశేషంగా అందరికీ తోచేది. దాన్నే "తొల్లికొట్టటం" అని నన్ను వెక్కిరిస్తూవుండేవారు. "గంధగజేంద్రతుల్య" అనేపద్యం మహాభీకరంగా చదివేవాణ్ణి; సవసవగా *Shouts* కూడా తీస్తూవుండేవాణ్ణి. ఇంతెందుకండి; "నిజకరవాల విక్షేపణ మాత్రి" అన్న వచనాన్ని మహా అఖండంగా చెప్పేవాణ్ణి. ఒకసారి ఈ వచనానికి *once more* కొట్టేరుకూడా. వచనానికి *once more* ను సంజ గలిగిన అఖండులలో మొదటివాణ్ణి నేనేమో అని నా నమ్మకం.

అయ్యో! ఈ నాటకసందర్భంలో నే ఓ మరువరాని విషయాన్ని మనవిచేస్తాను. స్త్రీపాత్రధరించే మా వెంకటాద్రి, చీరెధరించకముందు తనచుట్టు చెంగావిదోవతిని వెనక్కి బిగతీసి కట్టుకునేవాడు. రుక్మిణివేషం విప్పేసి, చిత్రలేఖ వేషం వెయ్యటానికి చీరెమార్చుకున్నప్పుడు అని నా అనుమానం, లోపల దోవతి సడలిపోయింది. గయుడి *scene* లో నిష్క్రమణంపడ్డతరువాత కృష్ణభగవానుడు చేసేప్రతిజ్ఞకు హడలిపోయి, చిత్రరేఖ నిలువున నిలారుగా "హా! నాథా!" అని మూర్ఛపోయింది. ఈ దెబ్బలో చుట్టు చెంగాయ ధోవతి చీరెకిందుగా జీరులాడటం మొదలు పెట్టింది లేచి నిలబడ్డతరువాత. అందరూ ఘొల్లుమన్నారు. తెరదించి, వేషగాణ్ణి లోపలికి తెచ్చి మళ్ళా గట్టిగా గోచీపెట్టి చీర సరిదిద్ది, *stage* మీదికి తోయవలసివచ్చింది.

ఇలా వ్రాయటం మొదలుపెడితే ఎన్నెన్నో జ్ఞాపకం వొస్తున్నాయి. "అదిరేమి, అయ్యమునా తరంగణి, త్రిలోకైక ప్రపూజ్యంబు" అన్న కృష్ణుడి పద్యంలోని భావాలు స్ఫురణకు వస్తున్నవి. తర్వాత ఇప్పటికీ ఎంత దుఃఖసమయంలోనైనా నాకు నవ్వు తెప్పించే విషయం వొకటి వ్రాస్తాను. చెరువు సుబ్బయ్య అనే స్నేహితుడు గయుడిపాత్ర ధరించేవాడు. *Creephair* లేని రోజులుగనక పన్నెండు అణాలకే నాటకానికి కావలసిన అన్ని రంగులూ దొరికేరోజులుగనుక, ఆ నల్లరంగుతో మీసాలుదిద్దేను. కొంచెం స్థూలకాయుడు కావటంలో చెమటవూరికే పడుతూవుండేది. సీను జరుగుతూండగా ప్రేక్షకులు ఎందుకో నిరుత్సాహపరిచేరు. నేను *Prompt* చేస్తున్నాను. వీడికి, మరింత చెమటపోయటం మొదలు పెట్టింది. ఆ భయంవల్ల, సిగ్గువల్ల, చేతి గుడ్డతో మొహం తుడుచుకున్నాడు, ఈ అడావుడిలో. ఒక వేపు మీసంపోయి అర్ధనారీశ్వరుడిలాగ తయారు అయినాడు: గందరగోళం చేశారు. వున్న జీవంకూడా కుంగిపోయింది దాంతో వీడికి. తెరదించారు. "లోపలికిరారా ఆ మీసం పోయింది" అంటే వొక దెబ్బవ రానే! ఏంచేసేది? పూరికే తిట్టటం మొదలుపెట్టాడు నన్ను. ఆడలేక మద్దెలవోటన్నట్లు చివరకు వొచ్చాడు, మీసం సరిదిద్దాను, తెరఎత్తించి మళ్ళా రంగంమీదికి నెట్టాను. కాని వాడు నన్నుఎందుకు తిట్టాడో నాకీ దినంవరకూ అర్థం కావటం లేదు. ఇతగాడు కీర్తిశేషుడైనాడు, చాలాకాలం క్రితం. అతని తిట్లే నాకు దీవనలు. తిట్లు, తిట్లుగా వుండేవి కావు ఆరోజుల్లో. మైమరచి అవ్యక్తమైన స్నేహపాశాల్లో ఉండేవాళ్ళం మేమందరం. ఆ రోజులు మళ్ళావస్తాయా, నేనెంత వేలుకొరుక్కున్నా! ఇప్పుడు ఆ తిట్లు నన్నెవరైనా ధైర్యంచేసి తిట్టగలరా? కొన్నాళ్లు గడచిన తరువాత, మాకు కొంచెం పేరు ప్రతిష్ఠలు వచ్చింతరువాత, మా *Old boys association anniversary* కి ధైర్యంచేసి బొబ్బిలి నాటకం ఆడటానికి సమకట్టేరు. సుందరరామయ్య 'పాపారాయుడు" నేను 'హైదరుజంగు' మా కుటుంబశాస్త్రి 'రంగారాయుడు'. కొన్ని *Rehearsals* కూడా అయినాయి. మాలో కొద్దిగా పార్టీలు వుండటంవల్ల ఎవరి దుర్బోధవల్లో తాను పాపారాయుడు వేషం వెయ్యదలచలేదని, బిగిసి ఏకుమేకులయి కూర్చున్నాడు, మా సుందరరామయ్య. ఏం చేస్తాం? నాటకం ఆడితీరాలి. లేకపోతే మా సంఘం సంపాదించుకున్న పేరు ప్రతిష్ఠలు మంటకలిసి పోతవి. నాకొక యుక్తి

తోచింది. నేనే పాపారాయుడి వేషం వేస్తానని ధైర్యంచెప్పి, రెండు రోజులలో *Portion* అంతా చదివి ఆ పద్యాలు నా సొంతధోరణులలో *Practice* చేశాను. 'నాకు చెయ్యకపోతే, నేను వున్నానురా' అని నిలబడ్డాను. రిహార్సల్స్‌కి హాజరు కావటం మొదలుపెట్టా. "మా సుబ్బారావు, ఏదో విధాన మాయ మంత్రమైనా చేసి ఈ వేషాన్ని నిర్వహిస్తాడురా" అని అనుకున్నారు నా స్నేహితులు. ఎక్కడైనా కొంచెం అపస్వరం పోయినా, ఆఖరుకి కట్టుకొయ్యకి లాక్కొస్తాడు అని అనుకున్నారు. వెయ్యటానికి బిర్రబిగిసిన మా సుందరరాముడు *Rehearsal* కి వొస్తూండేవాడు "నేను లేకుండా వీళ్ళు ఎలా నిర్వహిస్తారో గమనిద్దా"మని. నాలుగు రోజులు చూశాడు, నేను వేషం పట్టుదలగా వేసి తన *Chance* పోగొట్టేస్తానని లోపల డిక్కపడ్డాడు. హటాత్తుగా నా దగ్గరకొచ్చి "ఒరే సుబ్బారావ్ - నేనే వేస్తానులేరా పాపారాయుడు, నీ కెందుకురా! ఈ బాధ" అన్నాడు మానవుడు. సరేలేరా! నువ్వే వెయ్. నీకని మొదట మేము నిర్ణయించింది" హర్షంతో గాఢంగా కౌగలించుకొన్నాను. ఇప్పటికీ మరుపురాదు, ఈ విషయం. ఆనాటి ఆలింగనసౌఖ్యం, మై మరుపు, అవ్యక్తత, ఆ గాఢమైన ప్రేమపాశం ఈ దినంవరకూ మరుపురాకుండా వుండి నాకు పునర్జీవనాన్ని కలుగ జేస్తూ వుంటాయి.

నేను, బొబ్బిలిలో హైదరుజంగు పాత్రే వేస్తూ వుండేవాడిని మొదట్లో. తరువాత కొంత కాలానికి దీన్ని నా దగ్గరనుంచి మా చలపతిరావు కొట్టేశాడు. ఎందుకో మొదటినుంచి ఈ బొబ్బిలి అంటే వొట్టి అరపులూ, బొబ్బరింతల నాటకం అనీ, ఇంతకన్నా దాంట్లో ఏమీ లేదు అనీ అనిపిస్తూవుండేది. కాని మా వాళ్లు దీనికిగొప్ప పేరుతెచ్చారు. తాము తెచ్చుకున్నారు. అదేమి ఖర్మమోగాని నేను వేద్దామని ఉత్సాహపడి వేషం వొకటి తీరావచ్చేసరికి, వేసేది యింకొకటిగా పరిణమిస్తూ వుండేది మొదటినుంచి. మా చలపతిరావు హైదరుజంగు వేయటం మొదలుపెట్టిన తరువాత నేను బొబ్బిలిలో వేషం వేయటం మానేశాను. కాని తరువాత కొంతకాలానికి తెన్ను చేతికి తెచ్చుకున్న రాజు కథలా అయింది నా పని. బుస్సీ వేషం నాకు సంక్రమించింది. ఏమైందంటే - మా రామవిలాస్ సభ ఒక సంవత్సరం తోట్లవల్లూరులో మా నాటకాల భాగవతం కటటానికి పోయింది, ఏవో ఉత్సవాల సందర్భంలో. ఆ రోజున బొబ్బిలి నాటకం.

బుస్సీ పాత్రకు తయ్యారు అయిన మా బాబురావు, 'ఎగవేశాడు' ఎందువల్లనో. మా భాగోతుల రాజగోపాలం, ప్రొప్రయిటరు గనుక వూరికే తహతహపడుతూ కూర్చున్నాడు. నేను నిద్రపోతున్నాను, నాటకాల బడలికవల్ల. మెళకువ వచ్చింది. "ఏమిటయ్యా హడావుడి" అన్నాను. బుస్సీ వేషానికి మనిషి లేడు, ఏమిటి చెయ్యటం అన్నాడు. వెధవ బుస్సీ వేషం వేయటానికి మనుష్యులు తక్కువ అవుతారా, నేను వేస్తానులే పొమ్మన్నాను. వెంటనే రాజాగారి దగ్గరకు పోయి *Cross belts* మొదలైనవి సేకరించారు. *Portion* కొద్దిగా చూశాను. *Prompter* కి కొంచెం హుషారు చెప్పాను. వేషం వేశాను. ఆ దినం చాలా బాగా చేశానట. అప్పటినుంచి ఈ వేషం నన్ను వెన్నాడుకుంటూ వస్తూనేవుంది, ఈ నాటకం అంటే నాకు అంత ఇష్టంలేక పోయినప్పటికీ. ఖర్మ అంటే ఇలాగే వుంటుంది అనుకోండి. మనం దాన్ని బాగా అర్థం చేసుకోవటంలేదు గాని.

ఏముందీ... ఇలా సాత్యకి, భీముడు, హైదరుజంగు పాత్రలతో నాకు తెలుగు నాటక ప్రపంచంలో కొంచెం సుస్థిరమైన ప్రవేశమే కలిగింది అని చెప్పవచ్చు. తరువాత నేను మద్రాసులో డాక్టరు చదువుకు వొచ్చేశాను. కాని *Old Boys Association* నాటకాలకువెళ్ళి నా వేషాలను అప్పుడప్పుడూ వేస్తూవుండే వాణ్ణి. ఇలా కొంతకాలం జరిగిపోయింది. కొంతకాలం కింద ఈ వూరిలో *Northern Circars Progressive Union alias* పకోడీ *Union* అని వొకటి వుండేది. ప్రతి సంవత్సరం పట్టభద్రులైన ఆంధ్ర విద్యార్థులకు వొక చిన్న '*At home*' ఇస్తూ వుండేది, *Convocation* రోజున. పేరుకు చాలామందివున్నా చివరకు ఖర్చు యావత్తూ విశ్వదాత దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు భరిస్తూవుండేవారు. కంఠాభరణ నాటకం *Publish*అయినసంవత్సరమే దాంట్లో 'సుబ్బిశెట్టి' *Scene* ఇక్కడ ప్రదర్శించాం. డాక్టర్ గుళ్ళపల్లి నారాయణమూర్తిగారు సుందరిపాత్ర ధరించారు. కొల్లూరి సత్యనారాయణగారు కృష్ణారావు పాత్ర ధరించారు. ఆ *Scene* అఖండ రసవత్తరంగా వుంది ఆదినం. ఇప్పటికీ నా స్నేహితులు దీన్ని జ్ఞప్తికి తెస్తూవుంటారు. మరో సంవత్సరం కన్యాశుల్కం నాటకం ఆడాము. దానికి ఆధ్వర్యం వహించింది, కీ. శే. కె. తాతాచారిగారు. నేను చూచినంతవరకు వారే ఈ గిరీశంపాత్రకు అన్నివిధాలా తగిపోయిన వారని ఇప్పటి నా అభిప్రాయం. కాని ఏవిధమైన వేషధారణకు ఆయన వొప్పేరు కారు. నాచేతిలోంచి

తప్పించుకొని పోయ్యారు, నేనెంత వేడుకొన్నా. ఇ. వి. ఆర్. సుబ్బారావుగారు, గిరీశం, సత్యనారాయణగారు రామప్పపంతులు, నారాయణమూర్తిగారు మధురవాణి, కీ॥ శే॥ డాక్టరు రాఘవరావుగారు, బుచ్చమ్మ, మీనాక్షీపాత్రలు ధరించేరు. నేను సూత్రధారుడు, ఫొటిగ్రాఫు పంతుల బంట్రోతు, కరటకశాస్త్రి, పోలిశెట్టి, అశిరిగాడు, మొత్తం అయిదు పాత్రలను ధరించేను. నాటకం అఖండమైన రసవంతంగా ఆడాము. బందరు జాతీయ కళాశాలకు దీనికివచ్చిన డబ్బు పంపించాము. మూడో సంవత్సరం -అంటే నా *Final Year* పరీక్ష తర్వాత ప్రతాపరుద్రీయం ఆడాము. దీనికని కోపెల్ల హనుమంతరావుగారు, బందరునుంచి వచ్చి ఈ వూళ్ళోనే మకాం వేశారు. నాటకం పెద్దదికనుక, జిల్లాలవారిగా ఆయా వేషాలను పర్దవలసి వచ్చింది. నేను పేరిగాడి పాత్రను చదివేశాను. ఎందుకంటే మొదటినుంచి ఆవేషంఅంటే చాలా మోహంకనుక. కాని చూడండి దైవఘటన ఎలా పరిణమించిందో! యుగంధరపాత్ర చదివిన స్నేహితుడికి నేను కొన్ని కొన్ని సలహాలు ఇవ్వటం మొదలు పెట్టాను. కొన్ని *Rehearsals* అయ్యేటప్పటికి అతగాడికి విసుగుపుట్టి యుగంధరుడివేషం నా మొహానకొట్టాడు పట్టెడు విసుగుతో. అలా సంక్రమించింది ఈ యుగంధరపాత్ర నాకు. ఈ రహస్యం ఎవరికీ తెలియదు. మాలో విద్యానాధుడిపాత్ర ధరిస్తున్న ఆచార్లగారు (నెల్లూరు వాస్తవ్యులు) నాతో ఏంచెప్పారంటే "ఒరేయి - సుబ్బారావ్ ! నువ్వు నాటకాన్ని నీ స్వంతవిధంగా కత్తిరించి, అందరిని శిక్షణలో పెట్టావ్; గ్రంథకర్త వెంకటరాయశాస్త్రి గారు, ఈ వూళ్ళోనే వున్నారు. వారిని పిలిచామా అన్నీ తప్పులే పడతారు. నాటకం రోజుకుతప్ప ఈలోపుగా వారిని మనం దర్శించవద్దు అని ఒక రహస్య సలహా చెప్పాడు. అదేప్రకారంగా చేశాను. నాటకం విక్టోరియా హాల్లో వేశాం. పేరిగాడు మా డాక్టరు చాగంటి సూర్యనారాయణ వేశాడు. తదితర పాత్రలు ఇతర స్నేహితులు వేశారు; వారి పేర్లన్నీ జ్ఞాపకం రావటంలేదు. క్షమించాలి. నాటకానికి రెండువేల రూపాయలు వచ్చింది. అయిదువందల రూపాయల టిక్కట్లు వాపసుచేశాము. అనన్య సామాన్యమైన రసవంతంగా నాటకం ఆడాము గ్రంథకర్తగారి సమక్షంలో. "ఢిల్లీసుల్తాన్ పట్టుకు పోతాన్" అని నేను రంగంమీదికి గంతువేసేటప్పటికి పిల్లలంతా ఘొల్లుమన్నారు, నా ఆకారంచూసి. తరువాత "నారాజును" నేను చేజిక్కించుకుని వోరంగల్ సింహాసనంమీద మళ్ళా పట్టాభిషిక్తుణ్ణి చేసే సందర్భంలో, ఆనందం పట్టజాలక వెర్రిగాలేచి *U.L. Sastry* గారు, కోలవెన్ను రామకోటీశ్వరరావుగారి భుజంమీది ఖద్దరు శాలువను ధరుణ తీసుకొని *Stage* మీదికి ఎక్కి నా భుజంమీద కప్పారు. ఆసాంతాన నేను గ్రంథకర్తగారివద్దకు వచ్చి పాదాభివందనం చేశాను. మనసారా దీవించాడు ఆ మహానుభావుడు, ఆ కళాప్రపూర్ణుడు. "ఇందుకురా అబ్బాయీ! నన్ను పిలవకుండానే, నా సలహాలేకుండానే, నాటకం ఆడావ్ ? ఎంత సాహసివిరా ? నా నాటకానికి సార్థకత తెచ్చావ్ - ఈ నాటకాన్ని నీఇష్టంవచ్చినట్లు ఆడుకోవలసింది - నాకు చాలా సంతోషం అయింది" అని నన్ను దీవించినట్లు బాగాజ్ఞాపకం. ఆ మహాపండితుని దీవనాప్రభావమే నాకింత భిక్ష పెట్టింది.

తరువాత నాలుగైదు రోజులన్నా వ్యవధి లేకుండా, నా స్నేహితుడు పాకూరి సూర్యనారాయణ తెనాలినుండి ఏకాఏకివచ్చి, రాత్రి పన్నెండు గంటలవేళ (అప్పుడు నేను కన్ను ఆస్పత్రిలో *House-Surgeon* గా వున్న రోజులు) నేను గాఢ నిద్రలోవుండగా వచ్చి లేవకొట్టి "ఏమిటి ఇలా పడుకున్నారు-కొంపలంటుకుపోతే! మీ ప్రతాపరుద్రీయ నాటకం అఖండంగావుందని పేపర్లలో అంతా మోగిపోతూన్నది: మన రామవిలాస సభ కూడా ఈ నాటకాన్ని వెంటనే ఆడితీరాలి" అంటూ ఏవేవో ఆవేశాలతో, ఆనందాలతో నాతో మాట్లాడాడు. ఆరోజున వళ్ళు ఝల్లుమంటూ లేచినవిషయం ఈ దినంవరకూ జ్ఞాపకంవుంది. మరి వెంటనే మాసభవారు ప్రారంభించి ఏడురోజుల్లో ఇంత మహత్తరమైన నాటకాన్నీ ఆడటానికి తయ్యారు అయినారు. ముందు తెనాలిలో మా హాల్లో వేశాము. తరువాత మైలవరం హాల్లో వేశాము. అంతే.తరువాత ఆంధ్రదేశంలోవున్న పట్టణాలన్నింటిలోను ఆడాం. నాకెంతో పేరు ప్రతిష్ఠలను తెచ్చింది, తాను తెచ్చుకున్నది. మా చలపతిరావు ప్రతాపరుద్ర, పేరిగాని పాత్రలకు అనన్య సామాన్యమైన పేరు తెచ్చుకున్నాడు. మాసభకు వొక వున్నత స్థితినిచ్చింది ఈ నాటకం. అంటే ఇతరనాటకాలు ఏమంత తీసిపోయ్యేవని నా అభిప్రాయంకాదు. మా వెంకటరామయ్య, స్థానం నరసింహారావు, రోషనార నాటకానికి గొప్ప పేరుతెచ్చారు. ఆంధ్రదేశమంతటా బాదిపారేశారు ఈనాటకాన్ని. అనసూయ, బొబ్బిలి, నరకాసుర, సోరాబ్ - రుస్తుం మొదలైన నాటకాల్ని ఎన్నింటినో ఆడుతూవుండేవారు మా

సభ్యులు. ఒక తారాజువ్వలాగ వెలిగిపోయింది మా రామవిలాససభ. గొప్ప గొప్ప ఆదర్శాలతోను, ఆశయాలతోను ప్రారంభించాము. సంగీతంకంటె వచనానికే ఎక్కువ ప్రాధాన్యమిస్తూవుండేవాళ్ళం. సంస్కృత నాటకాల ఆంధ్రీకరణలను ఎక్కువగా ప్రచారంలోకి తేవాలని వున్నత ఆశయాలను పెట్టుకున్నాము. రత్నావళి, మృచ్ఛకటిక, ముద్రారాక్షసం, వేణీసంహారం, మా దృక్పథంలో ఎప్పుడూ వుంటూవుండేవి. కాని మాసభ స్వల్పకాలమే జీవించగలిగినందువల్ల ఎన్నిటినో కొనసాగింపలేక పోయ్యాం. నేనూ మా దలపతిరావు మాత్రమే ఈ సభలో గౌరవ సభ్యులం. మిగతా వారందరికి కూడా నెలకు దాదాపు పన్నెండువందల రూపాయల జీతాలు ఇస్తూవుండేవాడు రాజగోపాలం గారు. ఏవూరు పోయినా నాకున్న బంధువర్గం, నాటకాలకని నన్ను చుట్టుముట్టేది కనుక, నన్ను గురించి కంపెనీ, ఫ్రీ టికెట్టుకింద వ్యయపెట్టింది దాదాపు 18 వందల రూపాయలు అని నాజ్ఞాపకం. మా పెద్దతలలలో అభిప్రాయభేదాలవల్ల రామవిలాససభ బాల్యదశలోనే అంతరించిపోయింది. కాని ఒకసంగతి మరిచాను. కన్యాశుల్క నాటకాన్నికూడా మేము చాలా విజయవంతంగా ఆడి దేశదేశాలు తిప్పాం. మమ్మల్ని దేశదేశాలు తిప్పిందికూడాను. స్థానం నరసింహారావు అభినయకౌశలానికి ఈ నాటకంలో మధురవాణి పాత్ర ఎంతో వన్నె తెచ్చి, హద్దుపద్దులను చేర్చి విస్తరింపజేసింది. నా కర్తవ్యవిషయం ఇంతకుముందే మనవి చేశాను. మొదట్లో నేను రామప్పంతులు వేషమో, మరేదో వేద్దామనుకొన్నాను. కాని అప్పటికే నాకు యుగంధరపాత్రలో చాలా పేరువుండటంవల్ల (కన్యాశుల్క నాటకానికి చివరకు నాయకుడెవరని మనం తేల్చుకున్నా) గిరీశంపాత్ర కుంటుపడితే నాటకమే చెడవచ్చునని అభిప్రాయాలవల్ల నేనే గిరీశంపాత్రను వేయవలసి వచ్చింది. వెయ్యటం మొదలుపెట్టింతరువాత దానిని ఆరాధించటం మొదలుపెట్టానుకోండి - అది వేరేసంగతి. తొమ్మిదిన్నర నుంచి తెల్లవారుఝాము నాలుగున్నరవరకు ఆడినట్టు జ్ఞాపకం మా మొదటినాటకాన్ని. వెయ్యిరూపాయల కెప్పుడూ తక్కువరాని మాసభ నాటకాలకు, ఈ నాటకం *exception* గా పరిణమించి, 89.0-0 రూ. వచ్చినట్టు జ్ఞాపకం మొదటిసారి. కొంతకాలానికిగాని (ఈ నాటకంతో మేము రాటు తేలింతరువాత) ఏడు, ఎనిమిది వందలదాకా మేము తీయలేకపోయ్యాం. మా మాష్టర్ అంజి, మా ముద్దుల అంజి, అసామాన్య ప్రతిభావంతంగా నటించేవాడు రామప్పపంతుల పాత్ర. "వెండిగిన్నెకోసం వచ్చాను" అని మధురవాణి అంటే "తీసుకెళ్ళు" అని వాడచేస్తాయాల మేళవింపు ఈదినంవరకు నా చెవిలో ధ్వనిస్తావుంటుంది. వాడే బ్రతికివుంటే వాడి విశాల నేత్రాలతో, వాడి అభినయకౌశలంతో చలనచిత్రాలలో పాడిచేసివుండేవాడు. మా సభలాగానే వాడూ అకాలమరణంవాతపడ్డాడు.

ఒక్కసంగతి - ఎందుకోగాని ఎప్పుడూ జ్ఞాపకం వస్తూవుంటుంది - మాసభ సంచారం బయలుదేరి అప్పటికి మూడునెల్లు అయింది. చివరకు అమలాపురం చేరుకుంది. పిల్లా, పీకా కలిగినవాళ్ళు కనుక మా కుటుంబశాస్త్రి, పులిపాటి, దెందుకూరి, కొకమాను మొదలైన సభ్యులు "ఎప్పుడు ఇంటికి పోదామా, ఎప్పుడు పెళ్లాంబిడ్డలను చూద్దామా" అన్న స్థితిలోకి వచ్చారు. ప్రతాపరుద్రీయ నాటకం ప్రకటన చేశారు కనుక నేను తెనాలి నుంచి పోవాల్సివచ్చింది. పొయ్యాను. పొయ్యేటప్పటికి, వీళ్ళందరూ నన్ను ముట్టుముట్టి "నాన్నా, నాన్నా! ఎప్పటికి మాకు విముక్తి! తిండికి చస్తున్నాం!" అంటూ వాళ్ళ వాళ్ళ సొద నాకు చెప్పారు. "పదండిరా కాఫీ హోటలుకి తీసుకెళతా"నని ఒక బ్రాహ్మణ కాఫీహోటలుకి తీసుకెళ్ళాను. ఆరోజుల్లో కాఫీమీద అంత మోజా వుండేదికాదు మాకు. ఎంతసేపటికి *Solids* లోపలికి పోవాలని అనిపిస్తూ వుండేది. అందరికీ ఇడ్డెన్లు ఆర్డరు చేశాను. గుప్పున ఘూర్పు. ఆవకాయసంగతి జ్ఞాపకం వచ్చింది. "అయ్యా, మీ అమలాపురం ఆవకాయ వంజటానికి వడ్డించయ్యా" అని బతిమాలుకున్నాను. అంతే. ప్లేట్లమీద ప్లేట్లు ఎగిరిపొయ్యాయి. నేనున్న రెండురోజుల్లోను ఆ ఆవకాయజాడీ ఖాళీచేశారు మావాళ్లు. మొన్న మొన్న నేను అమలాపురం వెళ్ళినప్పుడు, ఆ కాఫీ హోటల్ ఇంకావుందేమోనని ఆశతో పరిశీలించి చూశాను. కాని అది మాయమయిపోయిందండీ! ఆ బజారు లేదు! వూరికే మారిపోతూ వుంటుందండీ ఈలోకం, ఎందుకోగాని!

ఆనాటి రామవిలాససభ అంతరించింది. కాని ఆ పేరుతోనే కొద్దిమంది నటుల యాజమాన్యంక్రింద, ఇంకా కొంతవరకు జీవించివున్నదనే చెప్పవచ్చు. నాతోడి నటులెంతమందో చనిపోయినారు. చాలామంది అకాలమరణంవాత పడ్డారు కూడా. ఈసంగతి తలచుకున్నప్పుడల్లా గుండె ఝల్లుమంటుంది. కళ్ళు నీరు కమ్ముతాయి. ఒంటరినైపోయి బిక్కు బిక్కుమంటూ

ఓ చీకటిలో జీవయాత్ర సాగిస్తున్నానా అనిపిస్తూ ఉంటుంది. అనురాగబంధాలు, వాటివల్ల మనలో కలిగే మార్పులు ఇదేవిధంగా వుంటాయి కాబోలు. ఒకసారి ప్రతాపరుద్రీయ నాటకం ఆడుతున్నాము. మాలో నృత్యానికి అఖండమైన పేరు సంపాదించిన మా బసవలింగం స్ఫోటకంవల్ల ఆదినం చనిపోయినాడు. హాలు ముందుగా శవాన్ని తీసుకువెళుతున్నారని అప్పుడే తెలిసింది. మా విషాదాన్ని బలిపుచ్చుతూ నాటకాన్ని కొంతకాలం ఆపుచేసాము. పోయ్యేవారిలా పోతూ వుంటే ఆడేవారు మాలాగ ఆడుతూవుండటం ఈ జగన్నాటక ధర్మం కాబోలు అనిపిస్తూవుంటుంది.

మృచ్ఛకటిక నాటకంలో చారుదత్తుడి వేషం వెయ్యడానికి చాలాసార్లు ప్రయత్నించాను. శకారుడు వేద్దామా అనికూడా వుంటూవుండేది. ఒక వేషం వేస్తూ, మరొకదానిమీదకి రుచిపోవటం నాకు తీరరాని వొక వెర్రికోరికా అనిపిస్తూ వుంటుంది. ముద్రారాక్షసంలో, వేషానికి నాస్థౌల్యంవల్ల నేను తగకపోయినా, చాణక్యుడి వేషంమీదకి ఆవేశం పరుగెత్తుతూ వుండేది. నిజంగా రాక్షసుడి వేషానికి తగుతానని నాకు తెలుసు! ఈ నాటకను మేమెప్పుడూ ఆడలేదు. ఇలా తీరనికోరికలు నా నటజీవితంలో ఎన్నో వున్నాయి. ఈలాంటివిలా పొందుపడివుంటూ వుంటేనేకాని జీవితం జీవితంకాదేమోననిపిస్తూ వుంటుంది.

కొన్ని కొన్ని ప్రాంతాలలో నేను డాక్టర్ నని చాలామందికి తెలియదు. నాకు తగిలింపబడ్డ ఆ శబ్దానికి ఏమీ అర్థంలేదనుకుంటూ వుంటారు. కాని నటవావృత్తి నాకు ఓ *Hoby* కంటె ఎక్కువగా నా తలపైకెక్కి నన్ను ఆడించలేదు. తిరువాత నా అనుభవాలలో పెద్ద కాళీలున్నాయని చెప్పవచ్చు, అప్పుడప్పుడు నేను రంగస్థలంమీద కనపడుతూ వున్నప్పటికీ. కొంతకాలం అద్యోపరికి నేను సినిమానటుడిగా కూడా పరిణమించాను. కారణం నేను మొదటిసారి సారధివారి 'మాలపిల్ల'లో సుందరరామశాస్త్రి వేషం వెయ్యటం. చాలామంది నాకు మొదట్లో భయం పెట్టారు, Stage నటనకూ, సినిమా నటనకు హస్తిమశకాంతర భేదంవుందని. నేనుకూడా కొంత జంకుతోనే ప్రవేశించాను. కాని మొదట్లోనే, ప్రాణప్రదమైనటువంటి నా మీసకట్టు, ఈ వేషానికని తియ్యవలసి వచ్చింది. నాకది అశుభంగా తోచింది. కొన్నిరోజులు విపరీతంగా తటపటాయించాను. చివరకు నా తల్లిగారి అనుమతినితీసుకొని ఆమెకు ప్రదక్షిణంచేసి, సాగిలపడి కీ॥ శే॥ రామబ్రహ్మం గారికి *Telegram* ఇచ్చాను ఈవిధంగా :—

"*Accepted-bless me God*" అంటూ.

బ్రదెక్కించి, ఆ మీసాలు గొరగకముందు మా *B. N. R* వో కొబ్బరికాయ నాతలమీదగా తిప్పి దృష్టితీసి పారేశాడు. తిరువాత నున్నగా డెక్కి పారేయించాను. లేచి దొంగవాడిలాగ అద్దంముందుకుపోయి నా మొహం చూసుకున్నాను. వెంటనే ఏడుపు వచ్చేసింది. తరువాత సిగ్గువచ్చింది. తరువాత రెండూ అటూ ఇటూ పెనుగులాడినయి. 'నాలో నాకొక భంగినవ్వను దురంతంబైన, చింతాహతిన్' అన్న ఆ హరిశ్చంద్రుడి పద్యం జ్ఞాపకం వొచ్చింది. ఎందువల్లనోగాని ఈ వేషం చాలా బాగుందని ప్రేక్షకలోకం ఘోషించారు. గోడమీద పిల్లి వాటంగావున్న నేను, దీంతో సినిమారంగ స్థలం మీద కొంచెం కాలూదుకొని నిలబడ్డాను. మాలపిల్ల ప్రివ్యూ రోజు వచ్చే నాకు పెద్ద వ్యాధి ప్రారంభించింది; అపరిమితమైన బాధలతో. అదే '*Lung Abcess*' గా పరిణమించింది. సారథి *Films* వారి మేడమీద నా ఆశ్రయమిచ్చారు. మహానుభావుడు డాక్టరు కేశవపాయి గారి హస్తవాసివల్ల, పెన్సిలియన్ లేని ఆ రోజుల్లో, మృత్యువు నోటనుండి బయటపడ్డాను మూడు నెలలకి. ఈ వ్యాధికి కారణం నేను బాగా పరిశీలించి మా స్తే ఫిల్ములో నేను నాయిల్లు తగలపడిపోయ్యేటప్పుడు అభినయించిన దృశ్యాలు. పెట్రోలు, కిరోసిన్ పోసి అకృత్రిమ గృహాన్ని తగలపెట్టారు. నా వీపుకు ఆ సెగ బాగా తగిలింది. ఆ *Shot, retake* కూడా చేయటంవల్ల వూపిరితిత్తిలో ఒక భాగానికి గాఢంగా సెగతగిలి కుళ్లిపోయి వుంటుంది. అదీ ఇంత వ్యాధికి కారణం. సినిమా రంగ ప్రవేశం నా దగ్గరనుంచి పెద్ద రుసుములు లాక్కుంది. మొదటి రోజుల్లో నేను చనిపోయినానని కూడా ఏదో పేపర్లో పడ్డదట. రామబ్రహ్మం గారికి ఎవరో టెలిఫోన్ చేశారు 'సుబ్బారావు బ్రతికివున్నాడా' అని. *What ? He is very much alive* — మా మేడమీదనే వున్నాడు' అని జవాబిచ్చానని వారు నాతో వెంటనే చెప్పారు. ఇది వో నీలివార్తగా పరిణమించి నాకు పునర్జీవనాన్ని ఇచ్చింది. నా జీవిత చరిత్రలో నేను గడిచిన గండాలలో ఇది రెండవది. నాకేదైనా పుణ్యశేషముంటే గడిచానో ఏటిని, లేక నామీద ఆధారపడ్డ కుటుంబం

యొక్క అదృష్టమో, తపఃఫలమో నేను చెప్పలేకుండా వున్నాను. చావు ఎలా వుంటుందో నాకు తెలిసినట్లు మరెవ్వరికి తెలియదనుకుంటూ వుంటాను. దాని ఆకార భీకరాలను దాదాపు సంపూర్ణంగా చూచి, అనుభవించివున్నాను గనుక.

చాలామంది నా సుందరరామశాస్త్రి వేషం మహాబాగుందని ప్రశంసిస్తూ వుంటారు. నాబోటి స్థూలకాయు డెవ్వడైనా బుర్ర డొక్కించి, మీసాలు గొరింగించటాకిని సిద్ధపడితే నాకన్నా బాగా నటించేవాడేమో అనిపిస్తూవుంటుంది. కారణమేమంటే, వేషభాషల దగ్గరనుంచి అన్నిటిలోను వాస్తవికత ఆరాధించి పూర్ణంగా ప్రత్యక్షం చేసుకుంటేనే గాని సినిమానటన తన పేరును ఆశయాలను, సార్థకం చేసుకోలేదు. ఇదే దాని కీలకం.

మరో విషయం, పూరికే జ్ఞాపకం వస్తూన్నది వొద్దన్నకొద్దీ. 'షావుకారు'లో 'చెంగయ్య' వేషానికి మళ్ళీ నాజుట్టులో కొన్ని గట్టి మార్పులు చేయవలసి వచ్చింది. ఆ రోజున కొబ్బరికాయ దిగతుడుపు, మా 'గోఖలే' తీసివేశాడు. ఆసాంతానికి అద్దంలో చూసుకొన్నాను. ఈసారి కొంత దుఃఖమూ, అఖండమైన భయమూ నాలో వెంటనే కలిగినాయి. ఎందుకంటే నా మొహం నా తండ్రిగారి మొహంలాగ తయార్యరు అయింది. 'నాకుకూడా ముదిమి వొచ్చింది కాబోలు ఇహ జాగ్రత్త పడకపోతే వీలులేదు, అనిపించింది.

నా తండ్రిగారు స్ఫురణకు రావటంవల్ల వారిని అగౌరవపరుస్తున్నానా అనిపించి పట్టరాని దుఃఖం వచ్చింది.

నా జన్మలగ్నం తుల. ప్రస్తుతం సినీమానటన ఆ తక్కెటలో ఉంది. తగ్గు మొగ్గలకు నేను బాధ్యుణ్ణి కాదు ఆ త్రాసుపట్టిన దైవంతప్పు.

నాటకాల్లోకూడా అప్పుడప్పుడు వేషం వేస్తూ వుంటాను. దీంట్లో ఏవి బాగున్నవి అని నన్ను అప్పుడప్పుడూ స్నేహితులు ప్రశ్నిస్తూ వుంటారు. నేను తేల్చి చెప్పటానికి ఎప్పుడూ చేతకావటం లేదు. అన్ని పాత్రలనూ నేను నా వోపినంతవరకు ప్రత్యక్షం చేసుకొని ఆరాధిస్తాను. అంతే. దానిఫలితం ప్రేక్షకలోకానిది. వారికే ఈ విమర్శనలకు హక్కుగాని, నాకు లేదు అనిపిస్తూవుంటుంది. 'బాగున్నదంటే' నేను పొంగిపోను. "చెడిపోయిందంటే" క్రుంగిపోను. సుఖదుఃఖాల తారతమ్యతల ఆచూకి చిక్కనియ్యకుండా, విధి, చిన్ననాటినుండి యింతవరకు దురదృష్ట పరంపరతో దొర్లించుకుంటూ వచ్చింది నా జీవితాన్ని. మొండిజీవిని గనుక నా స్వామికి ఆత్మార్పణం చేసికొని వేంకటదాసునైయాను. 'తొంప ముదిరితే రోసరికిల్లి' అన్న లోకోత్తర లోకోక్తిని, ఆ నోటనే కొంచెం విస్తరించి, నటుకు ముదిరితే నంబివాడు, రసికుకు ముదిరితే రామభక్తుడూ' అవవచ్చునేమో, అనుభవజ్ఞులు మీరు కొంత పరకాయించి ఆలోచించండి. ఈ రెండూ ఒక్క జీవిలోనే ముదిరితే ఏమవుతాడో కూడా మరీబాగా ఆలోచించండి. వేమనయోగి అవుతాడేమో! కొంతమంది నటుల జీవితాలు ఈ పంథాన నడిచిపోయినయి. తన జగన్నాటకాన్ని వెక్కిరిస్తున్నట్లు, నాటకంలో ఉపనాటకాలను మనం ఆడటంవల్ల చివరకు మనకు జ్ఞానాన్ని ప్రసాదించి కట్టుకోయ్యకు తెచ్చి తన దాసులను చేసుకొంటాడు - ఏంచేస్తాడు మరి!

ఈ రెండూ కాక *Radio* లో కూడా పాల్గొంటూవుంటాను దీంట్లో 'నటిస్తున్నా' నన్నాలే మాటలతో "కృత్రిమనటన" చేస్తున్నా ననాలో నేను తేల్చుకోలేకుండా వున్నాను. దీనిలో "నటనే" చాలా కష్టతరమైనదని నాకు అర్థమైంది.

బాబూ! జీవితమేమో గడిచిపోతున్నది. ఎవడి నిర్ణయం ఎన్నాళ్ళో, ఎవరికీ తెలియదు. కాని మన జీవితంలోని ఘట్టాలని '*Once More*' చేస్తే బాగుంటుందని అందరం గట్టిగా కోరికపడతాము. దీనికి ఏ మాత్రం వీలులేకుండా ఘటించాడు దైవం అసలీ విశ్వనిర్మాణంలోనే. ఎంత తన్నుకున్నా, ఆనాటి 'ఓరేయ్ చెలపాయ్, ఓరేయ్ సుందాయ్, ఓరేయ్ కుటుంబాయ్ ఓరేయ్ - నరసింహామ్,' అన్న రోజులు మళ్లీ వస్తాయా? రావండి బాబూ! అయ్యో ఏనాటికీ రావు! 'ఎందుకు ఉట్టినే వగచటం మా వేంకమ్మత్తలాగ!!

---

# గ్రంథ విమర్శనము

## నా చిన్ననాటి ముచ్చట్లు

[స్వీయ జీవితచరిత్ర]

డాక్టరు కె. యన్. కేసరి. ప్రతులకు, గృహలక్ష్మి కార్యాలయం, రాయపేట, మదరాసు. వెల తెలియదు.

తెలుగుభాషలో స్వీయచరిత్ర రచన, వీరేశలింగంపంతులు స్వీయచరిత్రతో ప్రారంభమయినది. తదాదిగా మనభాషలో నాలుగైదు ప్రముఖ జీవితచరిత్రలు వెలిశాయి.

కేసరిగారింతకుపూర్వం గృహలక్ష్మి సంపాదకులుగా ఆంధ్రులకు చిరపరిచితులే. అంతేగాని ప్రసిద్ధరచయితగా వారింతకు పూర్వం సారస్వతులకు సుపరిచితులు కారు. కాని ఈ గ్రంథరచనతో వారాంధ్ర స్వీయజీవిత రచయితలలో ప్రముఖులై చిరస్మరణీయులైనారు.

ఈ గ్రంథం అధ్యాయాల విభాగంలోను, కొన్ని కొన్ని ఘట్టాలలోను, రచనాశిల్పంలోను ప్రత్యేకమైన నైపుణి కనబడక పోవచ్చును. కాని స్వతః కేసరిగారి జీవితంలోనే ఉన్న కొన్ని అద్భుత సన్నివేశాలీ గ్రంథానికి రసవత్తర ఘట్టాలైనాయి. దానికి దాపరికం లేకుండా సన్నివేశాలన్నీ కళ్లకు గట్టినట్టుగా చిత్రించే రచయిత శక్తి తోడైనది.

కేసరిగారీ గ్రంథం రచించేసరికి అనేకమైన కష్టనష్టాలెదుర్కొని జీవితం అంతా సుఖమైన రాజబాటగా దిద్దుకోగలిగారు. ఈశక్తితో వారి లేఖినికి సరళము, సహజము అయిన ఒక దృష్టిపరిణతి ఏర్పడింది. దీనికి అక్కడక్కడ అతి సున్నితమైన హాస్యంకూడా తోడై ఈ గ్రంథం అంతా ఒకగుక్కలో చదివించి వేస్తుంది.

గ్రంథకర్త ఆయుర్వేదవైద్యంలోనే కాక మన తెలుగునాటకాలు, సంగీతము, మొదలైన లలితకళలలో చక్కని పాండిత్యము, అభిరుచికలవారు. వీరు మన నాటకాలనుగురించీ నటులనుగురించీ వ్రాసిన అధ్యాయాలు ఆంధ్రనాటకరంగాభిమానులందరు తప్పక పరిశీలించవలసిన భాగాలు.

వీరి గ్రాంథికశైలి సరళంగా సూటిగా హృదయాలకు హత్తుకొని అడుగడుగునా పాఠకుల కుతూహలం కలిగిస్తుంది.

అరవై ఏళ్లనాటి చెన్నపగరపరిస్థితులు, ఆనాటి విద్యార్థిజీవితము, మూఢాచార విశ్వాసాలు మొదలైన విషయాలు అవగాహన చేసుకోదలచినవారికీ గ్రంథం చాలా ఉపయోగిస్తుంది.

గ్రంథం చక్కగా ముద్రించి ప్రకటించిన కేసరి ముద్రణాలయంవారు అభినందనీయులు.

---

## ఆధునిక విజ్ఞానం

[తెలుగు వైజ్ఞానిక మాసపత్రిక]

సంపాదకులు. వై. వి. సోమయాజులు. సంవత్సర చందా ఆరురూపాయలు. విడిప్రతిక. ఎనిమిది అణాలు. కాపీలకు, సంపాదకులు, ఆధునిక విజ్ఞానం, అప్‌లాండ్స్, వాల్తేరు.

ఇది శాస్త్రీయ విజ్ఞాన వ్యాప్తికోసం ప్రారంభించిన మాసపత్రిక.

తెలుగులో ఇంతకుపూర్వం ఇలాంటివి ఒకటి రెండు పత్రికలు వెలువడ్డాయి కాని, అవి అట్టే కాలం నడవలేదు. ఈ సంచికలో శ్రీ వసంతరావు వెంకటరావుగారు మొదలైనవారు వ్రాసిన క్షేత్రవిజ్ఞానం, రసాయనపు ఎరువులు, నవరత్నములు, జీవులపరిణామం మొదలైన వ్యాసాలూ విషయాలలో పాఠకులకు చక్కని విజ్ఞానం కలిగించేవిగా ఉన్నాయి.

ఇంకా బాలజ్ఞానం, వింతలు, విశేషాలు సులభప్రయోగాలు మొదలైన శీర్షికలలో సంపాదకులు సామాన్య పాఠకుల కుపయోగించే విశేషాలెన్నో చేర్చారు. పాఠకుల సందేహ నివారణలకు కూడా ఒక ప్రత్యేక శీర్షిక ప్రారంభించబోతున్నామని సంపాదకులు తమ 'స్వవిషయం' లో తెలియజేస్తున్నారు.

సంపాదకుల లక్ష్యాలు నేటి తెలుగు పాఠకలోకానికి అత్యంతావశ్యకమైనవి.

ఆధునిక విజ్ఞానం ఆంధ్ర పాఠకలోకం అన్ని విధాలా చేయూత ఇచ్చి ఆదరించదగిన ఉత్తమ వైజ్ఞానిక పత్రిక.

---

## దేవనాగర

[త్రైమాసిక హిందీ పత్రిక]

సంపాదకులు. డాక్టరు నగేంద్ర. శ్రీ సచ్చిదానంద హీరానంద వాత్స్యాయన. సంవత్సర చందా 6 రూపాయలు. విడిప్రతి రూపాయిన్నర.

ఇది భారతీయ భాషాసాహిత్యాలు ఆయా రాష్ట్రాలవారు పరస్పరము అవగాహన చేసుకోడానికీ, తద్వారా భారతీయ విజ్ఞానాభివృద్ధికీ దోహద మిచ్చే ఉత్తమ త్రైమాసిక హిందీ పత్రిక.

దీనిలో తెలుగు, తమిళము, కన్నడము మొదలైన దాక్షిణాత్య భాషలనించీ హిందీతర భాషలనించీ సేకరించిన కథలు, ఖండకావ్యాలు, వ్యాసాలు మొదలైనవి ప్రకటించబడ్డాయి. అనువాదాలతోబాటు ఆయా భాషలలో కావ్యాలుకూడా దేవనాగర లిపిలో ప్రచురించారు. దీనివలన హిందీ పాఠకులకు ఆయా భాషారచనల అనువాదాలే కాక మూలరచనలు కూడా నాగరలిపిలో చదవడానికి వీలుపడుతున్నది.

ఇంతమాత్రంచేత హిందీవారికి ఆయా భాషల స్వరూపం బోధపడడం చాలా కష్టం. అందుచేత నాగరలిపిలో వివిధభాషల రచనలు ప్రకటించడంవల్ల అంతగా ప్రయోజనం ఉండదు.

సంసదీయ హిందీపరిషత్తువారు ప్రకటిస్తున్న ఈ పత్రిక భారతీయ సాహిత్యాలకు చేస్తున్న సేవ ప్రశంసనీయమైనది.

---

## మాతృశ్రీ

[ఖండకావ్యము]

రచయితలు. కోటసోదరకవులు. ప్రతులకు, రచయితలు. కనిగిరి. నెల్లూరు జిల్లా. వెల: ఒక రూపాయి.

ఇది సంస్కృత నైషధకర్త శ్రీహర్షకవి చరిత్ర వర్ణించే మూడు ఘట్టాల పద్యకావ్యము.

శ్రీహర్ష కవి తండ్రి హీరపండితుడు కాశ్మీర రాజాస్థానంలో పండితవివాదంలో పరాజితుడై ఆ విచారంచేత మరణిస్తాడు.

శ్రీహర్షకవి తండ్రికి జరిగిన అవమానానికి ప్రతీకారం చెయ్యడానికి సకల శాస్త్రాలు అభ్యసించి తిరిగి కాశ్మీరరాజాస్థానంలో శాస్త్రవివాదంలో పాల్గొని దిగ్విజయం సంపాదిస్తాడు. సంగ్రహంగా ఇదీ ఈ ఖండకావ్యంలోని కథ.

శ్రీహర్షునితల్లి చిన్నప్పటినించీ ఆప్యాయంగా పెంచి పెద్దవాణ్ణిచేసి సమస్త విద్యలు నేర్పించడంవల్లనే శ్రీహర్షుడింతవాడై ఉండడంవల్ల రచయిత ఈ కావ్యానికి 'మాతృశ్రీ' అని పేరుపెట్టినట్టు కనబడుతుంది.

కాని దీనిలో తల్లి వాత్సల్యంకంటె శ్రీహర్షుని ప్రతీకారావేశమే ఎక్కువ ప్రాధాన్యం వహించినటు కనబడుతుంది. ఇందుచేత ఈ కావ్యానికి పేరుకంటె మరి ఏదైనా ఇంకొక పేరుపెట్టిఉంటే బాగుండేది.

శ్రీహర్షుని బ్రహ్మచర్యభిక్షాటనం వర్ణించే ఈ క్రింది పద్యం వీరి కావ్యంలోని ఉత్తమ రచనా ధోరణికి తార్కాణంగా తీసుకోవచ్చును.

'బంగారు జిగిదేరు పాల్గారు మోముపై
సదముల బ్రహ్మవర్చస్సు నులుక

చదలేటి నురుగు పసందు మించెడు వల్వ
పిడిచుట్టు ముడికట్టు తడబడంగ
విధిగా గ్రహించిన వేదబుక్కాలు వల్లె
వేయుటచే గ్రింది పెదవి కదల
గాలిసోక కదలు వ్రేలుంగొమ్మ విధాన
ముడికమ్మ వలెవాటు భుజముజార
కేల గిండి, వేఱొకచేత జోలె గలిగి
మాధుకరమెత్త బ్రాహ్మణవీథి నొక గృ
హాన 'భవతి! భిక్షాం దేహి' యనుచు జేర
బరమ నియతి శ్రీహర్ష సద్బ్రహ్మచారి.'

---

## భారతీయ తత్త్వశాస్త్రము

[ప్రథమ భాగము]

ఇది డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణపండితుని 'ఇండియన్ ఫిలాసఫీ' అను ఆంగ్లగ్రంథమునకు ఆంధ్రానువాదము. అనువాదకులు: బులుసు వెంకటేశ్వర్లు ఎం. ఏ. పి. ఆర్. కాలేజ్. కాకినాడ. వెల అయిదు రూపాయలు.

ఇటీవల సుప్రసిద్ధాంగ్ల గ్రంథాలనేకం తెలుగులోకి అనువదిస్తున్నారు. అయితే యథామూలత, ఉదాత్తత, తెలుగులోని జాతీయత, శైలీ సౌష్ఠవము, శబ్దసాధుత్వము జాగ్రత్తగా చూసుకుంటూ చేసిన అనువాదాలు మాత్రం చాలా స్వల్పంగానే ఉన్నాయి. ఇక రాధాకృష్ణుని ఆంగ్లతాత్త్విక గ్రంథం తెలుగులోకి అనువదించడం సామాన్యానువాదకులకు సాధ్యమయ్యేవిషయం కాదు.

అయితే శ్రీ బులుసు వెంకటేశ్వరులుగారీ గ్రంథం శిష్టము, జాతీయము అయిన గ్రాంథిక శైలిలోకి అనువదించారు. వీరి అనువాదం అడుగడుగునా మూలంలోని ఉదాత్తత స్ఫురింపజేస్తూ చక్కని జాతీయమైన శైలిలో సాగిపోతున్నది. శైలి కొంత సంస్కృతపదప్రచురంగా ఉన్నది గాని తాత్త్విక గ్రంథానువాదం ఈ మాత్రం సంస్కృత ప్రయోగాలు లేకుండా రచించడం కష్టమే.

అనువాదకులింకా తెలుగులోనికి రాకుండా మిగిలిపోయిన రాధాకృష్ణుని గ్రంథాలు తెలుగులోనికి అనువదించగలరనీ తద్ద్వారా రాధాకృష్ణుని వేదాంత దృక్పథం ఆంధ్రుల కందించగలరనీ ఆశిస్తున్నాము.

---

## బొమ్మరిల్లు

[పిల్లల గేయసంపుటి]

కవిరావు. ప్రతులకు—సాహితీ కేంద్రము. తెనాలి. వెల: మేలు ప్రతి రూపాయిన్నర. సాదా ప్రతి ఒక రూపాయి.

ఇది చక్కని త్రివర్ణ ముఖచిత్రంతోను, సొగసైన రేఖాచిత్రాలతోను పిల్లలకు అత్యాకర్షకంగా ముద్రించిన గేయసంపుటి. ఇటీవల ఇంత సొగసుగా ముద్రించిన గేయసంపుటి రాలేదు. ప్రకాశకులు, చిత్రకారులు ఈ విషయంలో అభినందనీయులు.

అయితే దీనిలోని గేయాలలో చాలావరకు పిల్లలకు తమాషాగా గిలిగింతలు పెట్టేవిగా ఉన్నాయి గాని బాలబాలికల ముగ్ధ భావనాశక్తికి అనువైన ఉత్తమ కవితామాధుర్యం వీటిలో కనబడదు.

ఈ గేయాల్లో ఎత్తుకు పైయెత్తు, కిలాడి, జోస్యము వంటి గేయాలు కొన్ని పిల్లల్లో ఆకతాయితనం రేకెత్తించేవిగా ఉన్నాయి.

---

ఉన్నవాటిలో తుమ్మెదపెళ్ళి, తెనుగు పాపలం, పాపకల లాంటి రెండు మూడు గేయాలు బాలబాలికలు చదివి ఆనందించడానికి చక్కగా ఉన్నాయి. గేయాల్లో వాడిన వ్యావహారిక భాష సరళంగా సులభశైలిలో సాగిపోతున్నది. వీరు వాడిన వివిధరీతుల గేయచ్ఛందస్సులు బాలబాలికల మనః ప్రవృత్తికి అనుకూలంగా ఉన్నాయి.

---

## ఆంధ్రులసంక్షిప్త చరిత్ర

ఏటుకూరి బలరామమూర్తి. విశాలాంధ్ర ప్రచురణాలయం. విజయవాడ. వెల: రెండు రూపాయలు.

ఇది శాతవాహనకాలం మొదలుకొని జాతీయమైన కాంగ్రెసుసంస్థ ప్రారంభంవరకు ఆంధ్రుల చరిత్ర సంగ్రహంగా వివరించే గ్రంథం.

రచయిత ఈ గ్రంథపీఠికలో "వీలైనంతవరకు ప్రాచీనకాలపు ప్రజాజీవితాన్ని వివరించడానికి, వివిధ చారిత్రిక సంఘటనలను ప్రజాదృక్పథంద్వారా పరిశీలించడానికికూడా ప్రయత్నం జరిగింది." అని వ్రాశారు.

అయితే ఇలాంటి ప్రజాదృక్పథంతో పరిశీలించే ముందీ గ్రంథంలో ఈ దృక్పథ స్వరూపము గాని దీనికి గల సాధన సంపత్తిగాని స్పష్టంగా నిర్వచించలేదు. అందుచేత రచయిత ఈ విషయంలో అక్కడక్కడ వ్రాసిన వాక్యాలు పాఠకుల కుపయోగకరంగా లేవు. ఇలాంటి విషయాలు చరిత్ర గ్రంథాలలో చేర్చేముందు విస్పష్టమైన లక్ష్య మేర్పరుచుకొని వాటిని సప్రమాణంగాను, సోదాహరణంగాను బుజువుపరచాలి.

ఈ గ్రంథంలో 161వ పేజీలో వీరు "క్షేత్రయ్య శిష్యుడు సుప్రసిద్ధుడయిన త్యాగరాజు" అని వ్రాశారు. ఇది కేవలం రచయిత ఊహాగానమేగాని దీనికి ప్రామాణికమయిన చారిత్రికాధారం ఏమీ లేదు. చారిత్రికంగా తాడూ బొంగరమూ లేని వాక్యాలీగ్రంథంలో చాలాచోట్ల కనిపిస్తున్నాయి.

శాతవాహనయుగం మొదలుకొని నేటికాలం వరకు నడిచిన ఆంధ్రచరిత్ర సంగ్రహంగా తెలుగు వారికి అందజెయ్యవలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

అయితే అటు ప్రజాదృష్టితో చూసినా, ఇటు కేవలం చారిత్రిక దృష్టితో చూసినా ఈ గ్రంథం బాగా లోపభూయిష్ఠంగా ఉంది.

విశాలాంధ్ర ప్రచురణాలయంవా రిటువంటి ప్రచురణ ప్రకటింప దలచినప్పుడింతకంటె ప్రామాణికు లెవరికైనా ఈ పని అప్పజెప్పి ఉంటేబాగుండేది.

---

## కదంబం

[కథానికల-సంపుటి].

నవ్యసాహితీసమితి. హైదరాబాదు. (దక్కను.) వెల : పన్నెండు అణాలు.

దీనిలో తొమ్మండుగురు రచయితల కథానికలున్నాయి. దీనికి సురవరము ప్రతాపరెడ్డిగారు తొలిపలుకు, పాలగుమ్మి పద్మరాజుగారు రచయితలను గురించిన పరిచయ వాక్యాలు రాశారు.

పదిమంది కథలు చేర్చి పుస్తకంగా ప్రకటించడంవల్ల రచయితలకు సులభంగా ప్రచురణావకాశమే కాక, పాఠకులకు కూడా అనేకవిధాల రచనలన్నీ ఒకే చిన్న సంపుటిలో చదివే అవకాశం కలుగుతుంది. ఇందుచేత ఇలాంటి కదంబాలు ప్రకటించడం ఎంతైనా హర్షించదగ్గ విషయం.

ఈ సంపుటిలో కథానిక లనబడేవి చాలా తక్కువగా ఉన్నాయి. అప్పడు—గోళీ, బంధుమిత్రులు, గమకం అనే మూడు రచనలు మాత్రం కథానిక లనడానికి తగినవిగా ఉన్నాయి.

మిగిలినవన్నీ ఒక ఘట్టమో, సన్నివేశమో తీసుకుని రచించిన చిత్రణాలే.

అయితే ఈ చిత్రణాలన్నీ చక్కగా పాఠకుల హృదయాలకు హత్తుకుంటున్నాయి.

బంధుమిత్రులు, సినీమా ప్రమద్వర అనే ఈ రెండు రచనలలోను చక్కని చమత్కృతి, సంభాషణ చాతుర్యము కనిపిస్తున్నాయి.

---

Printed & published by S. Sambhu Prasad at the Andhra Patrika Pres, No 7, Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad.



రేఖా నికుంజము

చిత్రకారుడు: శ్రీ రణబీర సక్సేనా.




ఇందుకు
సన్‌లైట్
సబ్బే కారణము

బాదకుండగనే బట్టలను
తెల్లగాను, ప్రకాశవంత
ముగాను ఉతుకును!




S. 205-50 TL